# చతుర

ఆగస్ట్ 1979

సంపుటి : 2 సంచిక : 7


## ఈనెల సమగ్ర నవల

అందం వుంది, ఆత్మ విశ్వాసం వుంది ఆమెలో. అందుకు తగినట్లే భావి జీవితాన్ని గురించి ఆదర్శప్రాయంగా ఆలోచించి కొన్ని నిర్ణయాలకు వచ్చి వాటిని ఆచరణలో పెట్టేందుకు దృఢ నిశ్చయంతో నిలచింది. తన ముందుకు వాటంతట అవేగా వచ్చిన అన్ని మంచి అవకాశాల్నీ నిర్లిప్తంగా వదులుకుంది. అటువంటి ఆదర్శ వ్యక్తికి, అరవిరిసిన గులాబిలాంటి అమాయకురాలికి జీవితం చూసి, అనుభవింపజేసిన కఠోర సత్యాలెటువంటివి ?

# ఆదర్శం

అనేది ఆలోచనలవరకేగానీ ఆచరణ సాధ్యం కానిదా ? అయితే అదలా ఎందుకు జరుగుతోంది?

## కప్పగంతుల మల్లికార్జునరావు

ఈనాటి సామాజిక వ్యవస్థలో స్త్రీ స్థానాన్ని ప్రతిభావంతంగా చిత్రించిన 'ఆదర్శం' ఈ నెల చతుర సమగ్ర నవల.

# చతుర

ఈనాడు కాంపౌండ్

సోమాజిగూడ, హైదరాబాద్–500 004

## ఈ నెల ముఖపత్రం

నిజమైన భారతదేశం గ్రామ సీమల్లోనే ఉందంటారు. అనూచానంగా వస్తున్న అలంకరణలో భారత గ్రామీణ యువతి ఈ నెల చతుర ముఖపత్ర పడతి.
ఫొటో: ఇ. యం. సేతురామన్, మద్రాస్

## రెండవ కవరు

ఏదో కొత్తరకం కాక్టస్ పుష్పం కాదిది. మైక్రోస్కోప్‌లోంచి చూస్తే కనిపించే మామూలు చీమ తల. అంత చిన్న తలపై కనిపించే వివరాలు అవన్నీనూ.

## మూడవ కవరు

ముందు భాగంలో నిర్మాణంలో వున్న రెండతస్తుల భవనం వుంది. కానీ ఆ వెనకాల కనిపిస్తున్నది మాత్రం గోడవును కోసం కట్టిన షెడ్డు కాదు. గుడ్డతో వేసిన బ్రహ్మాండమైన డేరా. ఈ కొత్తగా కట్టే భవనాల్ని వాతావరణపు ఆటుపోట్లనుండి రక్షించేందుకు ఆ డేరాను రూపొందించారు జర్మనీలో. అవసరమైతే ఆ డేరాను ఈ భవనంమీద తాత్కాలికంగా వేసి నిర్మాణ కార్యక్రమం ఆపకుండా జరుపుకుపోవచ్చు.

# దోమల వ్యాపారం

దోమల బాధ పడలేక వాటిని చంపి కసితీరా నలిపి అవతల పారవేస్తున్నారా?...ఇహ మీదట చంపండి గానీ, పారవేయకండి. చక్కగా ఎండబెట్టి, పాలిథీన్ సంచుల్లో నిల్వ చేయండి. వాటిని కలకత్తాలోని ఎగుమతి వ్యాపారి అమర్ ఆష్ గారికి పంపితే కిలోకు 40 రూపాయ



లిచ్చి మిమ్మల్ని సత్కరిస్తాడు. జర్మనీలో దోమలకు మహా గిరాకీగా ఉందిప్పుడు. దోమల్లో ప్రోటీన్లు జాస్తి అనీ, చేపల పెంపకానికి అవి దివ్యమైన ఆహారం అనీ వారంటున్నారు. అంతేకాదు టన్నుకు 500 డాలర్లు ఇచ్చి మరీ కొంటున్నారు. అయిదు వందలేం ఖర్మ అయిదువేల డాలర్లు కూడా వస్తాయి అంటున్నారు, మన కలకత్తా వ్యాపారి అమర్ ఆష్‌గారు.

మరో సువార్త ఏమంటే అభివృద్ధి చెందిన యూరప్ దేశాల్లో దోమల జనాభా మరీ మరీ అన్యాయంగా ఉంది. కనుక మన దేశం వంటి దోమల సంరక్షకులకు దోమల్ని వేటాడి డాలర్లూ, ఫ్రాంకులూ, మార్కులూ సంపాదించేందుకు ఇదొక మహదవకాశం గదామరి!

# సంచలన చిత్రం

సినిమాలు జాతిని చైతన్యవంతం చేసేవిగా ఉండాలని గోలపెట్టే వారికో శుభవార్త. ఇటీవల ఒక అమెరికన్ డాక్యుమెంటరీ చిత్రం పశ్చిమ జర్మనీలో బ్రహ్మాండమైన పరివర్తనను తీసుకొచ్చింది. ఆ చిత్రం పేరు 'హెలోకాస్ట్'. ఇటీవల నాజీయిజం మళ్ళీ తలెత్తుతున్న ఛాయలు జర్మన్ ప్రభుత్వాన్ని కలవరపరుస్తున్న సమయంలోనే, 8 గంటల నిడివి గల ఈ 'హెలోకాస్ట్'ను జర్మన్ టి. వి. లో నాలుగు భాగాలుగా ప్రదర్శించారు. ఈ చిత్రాన్ని చూసిన ప్రజలు నాజీయిజంలోని క్రూర చర్యల్ని ప్రత్యక్షంగా చూసి చలించిపోయారు. చూసిన అసంఖ్యాకులలో సుమారు ముప్ఫైవేల మంది ప్రేక్షకులు ఆనందం పట్టలేక, టెలివిజన్ అధికారులను అభినందన పరంపరలో ముంచెత్తారట!

అయితే ఓ పన్నెండు మంది మాత్రం ఈ చిత్రాన్ని ప్రదర్శించినందుకు టెలివిజన్ అధికారులను చంపుతామని ఉత్తరాల ద్వారా బెదిరించారట!



## కంప్యూటర్ యముడు

నానాటికీ పెరిగిపోయే దొంగతనాలతో పాటు దొంగల్ని పట్టే విధానాలు కూడా పెరిగిపోతున్నాయి. దొంగలు ప్లాస్టిక్ సర్జరీ సాయంతో రూపం మార్చుకుని పెద్ద మనుషులుగా చెలామణి కావటం పాత కథే. అలాంటి ఘనుల్ని కూడా గుర్తు పట్టడానికి జపాన్‌లో ఓ సరికొత్త కంప్యూటర్ని తయారు చేశారు. ఆ కంప్యూటరు హస్తరేఖలను పరీక్షించి సదరు మనిషి దొంగా-దొరా అనేది నిర్ణయించే దొంగలపాలిటి యముడిలా తయారయింది.

పోలీసులు అనుమానం ఉన్న దొంగల హస్తరేఖల్ని ఫొటో తీసి ఈ కంప్యూ



టరుకు నివేదిస్తే, కేవలం ఆరు నిమిషాల్లో దొంగ ఎవరో చెప్పేస్తుంది కంప్యూటర్.

మన ఫుట్ పాత్ జ్యోతిష్కులు పాపం సంవత్సరాల తరబడి రక రకాల పుస్తకాలు చదివి చెప్పినా వారి జ్యోతిషం అన్ని సందర్భాల్లోనూ ఫలించదు. కాని జపాన్ కంప్యూటర్ మాత్రం నూటికి నూరుపాళ్ళు ఖచ్చితమైన సమాచారమే అందిస్తుంది. అందుకే జపాన్ కోర్టులలో ఆ కంప్యూటరు నిర్ణయాలనే తుది నిర్ణయంగా పరిగణిస్తున్నారు. ఫలితంగా నేరాల సంఖ్య బాగా తగ్గుముఖం పట్టిందని పోలీసు శాఖవారు సంతోషిస్తున్నారు.

## చోరీ రుసుము

బ్రిటన్‌లో చిల్లర దొంగతనాలు అంటు రోగంలా ప్రబలిపోతున్నాయి. దుకాణాల్లో అమ్మకాలు ఇబ్బడి ముబ్బడిగానే ఉంటున్నాయి; కాని లాభాలు మాత్రం కనిపించటం లేదని దుకాణాదారులు గగ్గోలు పెడుతున్నారు. దీని కంతకూ కొనడానికి వచ్చే పెద్దమనుషుల చేవాటం అసలు కారణమని పరిశీలనలో వెల్లడయింది. ఇలాంటి దొంగతనాలు కొందరు సరదాకోసం చేస్తే మరికొందరు వస్తువు మీద వున్న మోజుకొద్దీ చేస్తారు. ఇలా షాపుల్లో వస్తువులు ఎత్తుకుపోయే వారిలో ఆడ మగ భేదం లేకుండా డాక్టర్లు, లాయర్లు, ఇంజనీర్లు, టీచర్లు, టైపిస్టులు, ఆఫీసు గుమస్తాలు అందరూ ఉన్నారట.

గత సంవత్సరం 65 కోట్ల పౌండ్లు ఖరీదైన వస్తువులు ఇలా మాయమయ్యాయి. ఈ మొత్తం 1040 కోట్ల రూపాయలకు సమానం. ఈ నష్టం భర్తీ చేసుకునేందుకు అక్కడి షాపు యజమానులు తమ దగ్గరకు వచ్చే కొనుగోలుదార్ల నుంచి ప్రతి వస్తువుమీద రెండు శాతం 'చోరీరుసుము' వసూలు చేస్తున్నా



ఏప్పుడు. దొంగల్ని పట్టుకోవడంలో పోలీసులు సహాయపడలేకపోతున్నారు. షాపు యజమానులు నిస్సహాయులై ఏం చేయడానికి పాలుపోక పిచ్చెత్తి పోతున్నారు. ఈ సమస్య పరిష్కారానికి కోర్టు సహాయము కూడా వారికి లభించడంలేదు.

ఇటీవల ఒక షాపు యజమాని, ఒక పెద్ద మనిషిపై చిల్లర దొంగతనం నేరానికి కోర్టులో కేసు పెట్టాడు. తనమీద కేసు పెట్టారన్న కోపంతో పరువు నష్టం దావావేసి షాపు యజమాని దగ్గర వెయ్యి పౌండ్లు గుంజాడు ఆ పెద్దమనిషి.

# 16 మంది భార్యలు చాలు

మధ్యప్రదేశ్ అరణ్యాల్లో ఓ చిన్న గ్రామం లిబ్ని. అక్కడ నివసించే కొండ జాతివారంతా 'హన్సలియా' అనే వ్యక్తి సంతానమే! హన్సలియాకు 78 ఏళ్ళు.ఈ వయసులో కూడా పదహారుగురు భార్యలతో విలాసంగా కాలం గడుపుతున్నాడతను. పైగా నాకు ఈ పదహారు మంది భార్యలూ చాలు. ఇహ పెళ్ళాడబోనని హామీ ఇచ్చిన ఘనుడతను. ఆ పదహారుగురు భార్యలవల్ల అతనికి డెబ్బై రెండు మంది సంతానం కలిగారు.

లిబ్నిలో వున్న రెండువందల మంది పిల్లలు యాభై మంది యువకుల్లో ఎవరినైనా సరే "మీ తాత ఎవరు?" అని అడిగితే హన్సలియా అనే జవాబిస్తారు.

వ్యవసాయం అతని వృత్తి.అందువల్ల భార్యలందరిదగ్గరా సమానంగా గడపలేకపోతున్నాడట. ఒక్కో భార్యదగ్గర ఒక్కో నెల గడపాలనేది అతని నిర్ణయం. కానీ చిన్న భార్య 'మంగాలి' దగ్గర మూడు నెలలన్నా గడపందే మనసుకు తృప్తిగా ఉండదట. ఆమె అందరికంటే వయసులో చిన్నది మరి!

ఆ ఊళ్ళో డాక్టర్లందరూ కలిసి హన్సలియాకి పరిమిత కుటుంబంవల్ల లాభాలు గురించి నూరిపోశారు. అన్నీ



విని హన్సలియా "నా పిల్లల్ని పోషించుకోగల శక్తి నాకుంది. ఆపరేషన్‌కు ఒత్తిడి చేయటానికి మీరెవరు?" అని గద్దించేసరికి తోకలు, కత్తులు ముడిచేశారట డాక్టర్లు!

# వేలం వెర్రి పోస్టర్లు

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో జర్మను లకూ, ఇంగ్లీషు వారికీ మధ్య పచ్చ గడ్డి వేస్తే భగ్గుమనేది. అలాంటి జర్మను లకు సంబంధించిన కొన్ని వాల్‌పోస్టర్లు ఆంగ్లేయులకిప్పుడు విశేషమైన మోజు పుట్టిస్తున్నాయి. లండన్‌లోని ఇంపీరియల్ వార్ మ్యూజియంలో రెండవ ప్రపంచ యుద్ధానికి సంబంధించిన అనేక వస్తువులు భద్రపరిచారు. యుద్ధసమయంలో ఒకరిపై ఒకరు కక్షతో గోడలకంటించిన పోస్టర్లు కూడా ఆ మ్యూజియంలో భద్రపరిచారు. సుమారు యాభై వేల వివిధ రకాల పోస్టర్లు అందులో ఉన్నాయి. వాటిలో ప్రజలను బాగా ఆకర్షించిన రెండు పోస్టర్లను మ్యూజి



యంవారు ప్రచురించగా, క్షణాల్లో 11,000 కాపీలు అమ్ముడయి పోవడం మ్యూజియం అధికారులను ఆశ్చర్య పరి చింది. ఒక్క వాల్ పోస్టరు మీద ఉక్కు టోపీ పెట్టుకున్న జర్మను సైనికుడి బొమ్మ ఉంటుంది. "అంతిమ విజయం మాదే" అని రాసి ఉంటుంది.

మరో వాల్ పోస్టరు మీద స్వస్తిక్ గుర్తు ఉన్న నాజీల జెండా బొమ్మ ఉండి "అంతిమ విజయం హిట్లరుదే" అని రాసి ఉంటుంది. ప్రజలు వేలం వెర్రిగా ఈ జర్మన్ వాల్‌పోస్టర్లను కొనడం దేశ భద్ర తకు ముప్పు అనీ, దేశంలో ఉద్రిక్త వాతావరణం నెలకొనవచ్చుననే భయంతో వాటి అమ్మకాన్ని నిషేధించారు.

# ఖరీదైన కెమేరా

స్టీరియో రేడియోలో రెండు స్పీకర్లుం టాయి. ఈ మధ్య మద్రాసులో వాడుతున్న స్టీరియో కెమేరాలో రెండు కెమేరాలున్నాయి. దీని సహాయంతో ప్రమాదం ఎలా జరిగింది, తప్పు ఎవరిది - మొదలైన విషయాలు నిర్ద్వం ద్వంగా తెలుసుకోవచ్చు.

ఈ కెమేరాను మద్రాసు పోలీసు శాఖ ఆరున్నర లక్షలు ఖర్చుపెట్టి కొనుగోలు చేసింది. ప్రమాదం జరిగిన స్థలాన్ని ఈ కెమేరాతో ఫొటోలు తీస్తారు. ఆ ఫిల్మును కడిగి ప్రాసెస్ చేయడానికి ప్లాటింగ్ టేబిల్ అనే ప్రత్యేక టేబిల్‌ను వాడ తారు. సినిమా రీలులాగా తయారయిన ఈ ఫిల్ముని స్టీరియో స్కోపులో ఉంచి చూస్తే ప్రమాదానికి ముందు జరిగిన కథంతా తెలిసిపోతుంది. పోలీసులు ప్రమాదం జరిగిన ప్రదేశంలో నేరస్తుల కాలి, వేలి ముద్రలు, ఇతర ఆధారాలను కాపలా కాస్తూ కూర్చోవాల్సిన అవసరం



లేకుండా ఈ కెమేరా వాటన్నింటినీ రికార్డు చేస్తుంది.

ఈ స్టీరియో మెట్రిక్ కెమేరా స్విట్జర్లాండ్‌లో తయారయింది. ప్రపంచంలో చాలా దేశాలు దీనిని వాడుతున్నాయి. ఇది చాలా ఖరీదైన కెమేరా కావడంవల్ల మన దేశంలో ఇంతవరకు ఇది వాడకంలోకి రాలేదు. మద్రాసు పోలీసు శాఖ వారు కూడా ఆ కెమేరాను మాత్రమే కొన్నారు. దానికవసరమైన ప్లాటింగ్ టేబిల్ మాత్రం అన్నా టెక్నలాజికల్ సెంటరు వారిది ఉపయోగించుకోవడానికి నిర్ణయించుకొన్నారు.

# మంత్రజలం

ఉత్తరప్రదేశ్‌లోని షాజహాన్‌పూర్‌లోని ఒక నూతిలో నీరు తాగినవారు దీర్ఘరోగాలనుండి విముక్తి పొందుతున్నారట! పోలియో, క్షయ, గజ్జి మొదలైన వ్యాధులున్న వారు షాజహాన్‌పూర్‌లో మకాం పెట్టి ఆ నూతి నీళ్ళతో రోజూ స్నానం చేస్తున్నారు. కొందరు క్షయ బాధనుండి కోలుకున్నామనీ, మరి కొందరు కుష్ఠురోగానికి సంబంధించిన మచ్చలు కూడా లేకుండా మాయమయ్యాయనీ చెప్పారు.

పండిట్ బనారసీలాల్ కుష్ఠురోగి. అతనికి ఓ రోజు కలలో తెల్లటి వస్త్రాలు ధరించిన ఓ సాధువు కనిపించి, ఊరి చివరన ఉన్న నూతి నీళ్ళతో స్నానం చేస్తే కుష్ఠు రోగం పోతుందని సలహా ఇవ్వటం, అతను ఆ ప్రకారం ఆ నూతిలో స్నానం చేసి వారం రోజుల్లో ఆ రోగం నుంచి పూర్తిగా విముక్తిపొందటం జరిగింది. ఇది చూసి ఆ ఊరి జనం ఆశ్చర్యపోయారు. 1977 సెప్టెంబరునాటికి ఈ వార్త దేశమంతటా వ్యాపించి ఆ ప్రదేశం ఒక యాత్రా స్థలంగా మారిపోయింది.

భక్తులు స్నానం చేసేటప్పుడు 'సిద్ధాబాబాకి జై' అని అరుస్తూ ఆ ప్రాంతాన్ని జయజయధ్వానాలతో ముంచెత్తుతారు. ఆ



నూతి నీరు సేవించాక ఎంతటి చెడ్డవారు అయినా సరే సద్వర్తనులుగా, భగవద్భక్తులుగా మారుతున్నామని కొందరు అంటూ ఉండటం అసలైన విచిత్రం!

శాంతం, సహనం, ఓర్పు యిత్యాది మంచి గుణాలన్నీ బొడ్డుకు కట్టుకు పుట్టినట్లుంది రుద్రమదేవి. తల్లి అందం, ధార్మిక చింతన - తండ్రి నిరాడంబరత, త్యాగగుణం పుణికి పుచ్చుకొంది.

ఆమె తండ్రి మాధవరావుకు 'క్విట్ ఇండియా పంతులు'గా ఒకప్పుడు ఆ జిల్లాలోనే గొప్ప పేరుండేది. ఆ జిల్లాకు సంబంధించి ఆ ఉద్యమంలో ఆయన అంతటి కీలకమైన పాత్ర వహించాడు.

అయితే ఆయనకి రాజకీయపు ఎత్తుగడలు తెలియవు. 'ముందు' చూపులేదు. అందుకే నాయకుడుగా ఎదగలేక కార్యకర్తగానే మిగిలిపోయాడు.

జైళ్ళలో బాధలుపడ్డాడు. అంతకన్నా మించి అద్దె కొంపల్లో బాధలు పడ్డాడు.

స్వాతంత్రం వచ్చాక చాలామందికి లాగే ఆయన్నీ తల్చుకొన్న వారు లేరు. ముతక ఖద్దరు గుడ్డలు కట్టే అలవాటు మాత్రమే స్థిరాస్తిగా మిగిలింది. మొదట్లో కొందరు కొత్త ఖద్దరు వస్త్రధారులు అడపా దడపా ఆ సభలకూ, యీ సభలకూ అధ్యక్ష స్థానం యిచ్చి గౌరవించినా త్వరలోనే వాళ్లు ఎదిగిపోయి ఆయన్ని మర్చిపోయారు.

జీవనోపాధి లేదు. ఆర్జన అసల్లేదు. మరెలా అంత సంసారాన్ని యీదుకు రావటం?

చేసిన గొప్పల్ని చెప్పుకొనే గుణం లేదు. ఇక ఎప్పుడో పడ్డ కష్టాలకి,చేసిన త్యాగాలకి ప్రతిఫలాన్నేం అడుగుతాడు ? దేశాన్నేలే దొరలే మర్చిపోయినప్పుడు సహాయం చేయమని ఎవరినర్థించగలడు ?

దంపుడు బియ్యం, దంత చూర్ణం, కాఫీపొడి తయారుచేయించి అమ్మే బిజినెస్సు చేశాడు. ఖద్దరు కొట్లో పద్దులు రాశాడు.

చివరికో పత్రికాఫీసులో ప్రూఫ్‌రీడరుగా చేరేడు.

జీవితం పట్ల భయంతో కూడిన నిర్లిప్తత అలవడింది. జీవన్మృతుడిలా కాలాన్ని ఎలాగోలాగ నెట్టేయాలన్న ఒకే ఒక్క ఆశయం మిగిలింది.

ఈ వాతావరణాలని, కుటుంబ పరిస్థితుల్ని చిన్నతనం నుంచి ఆకళింపు చేసుకొంటూ పెరగటంవల్లనేమో,రుద్రమదేవికి సరిపుచ్చుకొనే తత్వం అలవడింది. పరిస్థితుల కనుగుణంగా సర్దుకుపోతుంది. అవసరమైతే తల వంచుతుంది.

ఏనాడూ 'ఫలానా యీ వస్తువు'కావాలని ఎవరినీ అడిగి ఎరగదామె. ఏది ఎప్పుడు లభ్యమయితే దాన్ని స్వీకరించటమే, తృప్తి పడటమే.

తాను అందగత్తెనని చిన్నతనం నుంచీ తెల్సు ఆమెకు. కానీ ఏనాడూగర్వపడలేదు. కాగా తాను అందగత్తెనన్న విషయాన్నే మర్చిపోవటానికి ప్రయత్నించింది.

అందానికి అలంకరణలు శోభను తెస్తాయని తెల్సీ, ఆమె వాటి పట్ల ఆశలు పెంచుకోలేదు.

అయితే ఎస్సెల్సీతో చదువుమానేయమని తల్లి అన్నప్పుడు ఆమె మొదటిసారిగా తన అయిష్టాన్ని, అసమ్మతిని వ్యక్తం చేసింది.

"చదువుకొందామని నీకు వున్నట్లే, చదివించాలని నాకూ వుందమ్మా. కానీ మీ నాన్నగారి బాధను కూడా కాస్త ఆలోచించు" అంది తల్లి.

ఆలోచించింది. స్కాలర్ షిప్పు తన తలుపు తట్టటానికి కావల్సినన్ని మార్కు-

లతో ఎస్సెల్సీ పాసయింది.

"ఏమ్మా! ఇప్పుడు అభ్యంతరం లేదుగా?"

తల్లి వెంటనే జవాబివ్వలేదు.

"నీ కిష్టం లేకపోతే చదవనులేమ్మా"

అప్పుడసలు విషయం చెప్పిందామె.

ఆమెకు ఆడపిల్లల చదువుకన్నా పెళ్ళి ముఖ్యం. ఎక్కువ చదువులు చదివేకొద్దీ ఎక్కువ కట్నాలు యిస్తేకాని మొగుళ్ళు లభ్యం కారు. ఎక్కడినుంచి తేవటం?

తల్లి బాధను, భయాన్ని అర్థం చేసుకొంది రుద్రమదేవి. తలవంచబోయింది.

సరిగ్గా ఆ సమయంలో మాధవరావుకు ఏం బుద్ధి పుట్టిందో కలుగచేసుకొన్నాడు.

"పెళ్ళికి, చదువుకు ఏమిటి సంబంధం? ఎక్కెచ్చే మొక్కను ఎందుకు తుంచేయటం? ముందు ముందు కాలం ఎలా వసుందో? ఏం చేసినా చెయ్యకపోయినా తన కాళ్ళమీద తాను నిలబడగలిగే శక్తినన్నా దానికివ్వటం మన కనీస కర్తవ్యం కాదూ?"

మాధవరావు మాటకు బయట విలువ లేకపోయినా, యింట్లో మాత్రం ఆయనంటే అందరికీ గౌరవం, భయం, భక్తి! అలా రుద్రమ కాలేజీ జీవితంలోకి ప్రవేశించింది!




డిగ్రీ ఫైనల్ ఇయర్‌లోకి ప్రవేశించిన కొత్తలో రుద్రమ స్నేహితురాలు శారదకు పెళ్ళయింది. అన్ని సంవత్సరాలు ఎలా కాలేజీలో గడిపేసిందో ఆమెకే తెలియదు.

పరీక్షలు...పుస్తకాలు... మార్కులు యివి తప్పితే మరో ధ్యాసే లేదు! వయసుతో పాటు తన అందం ఎంత ఎదుగుతోందో ఆలోచనే లేదు.

అప్పటికీ అలంకరణలేం లేకుండా సాదాగా వున్న ఆమె సౌందర్యమే చాలా మంది యువకుల్ని ఆకర్షించింది. ఆమె దృష్టిని తమ వైపుకి తిప్పుకోవాలని రకరకాల ప్రయత్నాలు చేశారు. సౌంజ్ఞలు చేశారు. వెంటబడ్డారు. విరహగీతాలు పాడేరు. ప్రేమలేఖలు రాశారు. దేనికి ఎవరికీ రెస్పాన్స్ లేకపోవటంతో ఆమెనొక 'నాన్ ఎన్‌టిటీ' కింద భావించి వదిలేశారు.

"ఎప్పుడూ పుస్తకాలు-చదువు-పిచ్చెక్కుతుందే బాబూ! చదువు జీవితంలో ఓ భాగం కాని, చదువే జీవితం కాదుగా? నీ కోసం పిచ్చెక్కి తిరిగే మగాళ్ళనోసారి చూడు. అసలు అద్దంలో నిలువుటద్దంలో నీ అందాన్నెప్పుడైనా చూసుకొన్నావా? ఊళ్ళో మగాళ్ళందర్నీ కొనగోటితో ఆడించే అందం పెట్టుకొని యీ యోగమేమిటే? పెళ్ళి చేసుకోవా?

"ఏమిటి?" అనేది శారద.

శారద అంపగత్తె కాదు. కొన్ని అనాకారాలు కూడా వున్నాయి. అందుకే ఆమెకు అందమైన వస్తువులేవైనా యిష్టం. అందమైన ఆడపిల్లలంటే ఆమెకుఅసూయ లేదు. ప్రేమే! రుద్రమతో పనికట్టుకు స్నేహం చేయటానికి అదో కారణం.

ఆమె ధనవంతురాలు. అయితే డబ్బుకు ఏ మాత్రం విలువ ఇవ్వదు. రూపాయిని

పైసాలాగా ఖర్చు చేస్తుంది. రోజుకో చీరె కడుతుంది.

పైకి చెప్పుకోదు కాని, శారదకు అందగాడైన భర్త దొరకడేమోనన్న భయం చిన్నప్పుడే పట్టుకొంది.

ఆమె పుట్టింది పల్లెటూళ్ళో. ధనార్జన తప్ప తండ్రికి ఏమీ పట్టదు. ఇంట్లో అంతా పల్లెటూరి పద్ధతులు. అంతా ఆమెను గారాబంగా చూస్తారు. ఆమె యిష్టాన్ని కాదనరు. కానీ చాదస్తాలు చాలా వున్నాయి.

అంచేత కాలేజి చదివే రోజుల్ని శారద వరాన్వేషణకు వాడుకుంది

"నీ చీరె బాగుందోయ్!" అన్న వారే కానీ ఆడపిల్లలెప్పుడూ ఆమె రూపాన్ని పొరపాటున కూడా మెచ్చుకో లేదు. అందుకామె ఏనాడూ విచారించ లేదు. తన ముక్కు అందంగా వుంటుందని శారద అభిప్రాయం. కానీ, దాన్ని ఎవరూ గుర్తించలేదని బాధ పడేది!

శారద తన వరుడిని వెతుక్కోవ టంలో చాలా జాగ్రత్తలు తీసుకొంది. తొందరపడలేదు.

తన మొగుడు సినీ హీరో లా అద్భుతంగా, భారీగా, అందంగా వుండాలి. తన కులంవాడో, అంతకన్నా అగ్రకులంవాడో అయివుండాలి. తన డబ్బును చూసే ప్రేమించినా, మంచి మనిషై వుండాలి. పెళ్ళి చేసుకున్నాక 'పిచ్చి వేషాలు' వేసే వాడై వుండ కూడదు. చదువుండాలి. అభిరుచులుకూడా తన అభిరుచులకు అనుగుణంగా వుండాలి.

వెతికి వెతికి చివరికి రవీంద్రను పట్టింది శారద. మంచివాడు. మునిలా మౌనంగా, శాంతంగా వుంటాడు.. రుద్రమలాగే పుస్తకాల పురుగు.

శుభలేఖలో శారద మొగుడిగా రవీంద్ర పేరు చూసి చాలా మంది ఆశ్చర్య పోయారు!

"ఎలా పట్టావే అతన్ని ?"

"ఏం నేను చెప్తే అలాగే నువ్వూ మరెవరినైనా పడ్తామనా ?"

రవీంద్ర ఎవరో రుద్రమకి తెలియదు. కాని శారదే శుభలేఖ యిస్తూ చెప్పింది.

"అందరూ అతను నీకు మొగుడు కావాల్సిన వాడంటున్నారే ? చదువు, పర్సనాలిటీ, అందం చూస్తే ఆ మాట నిజ మేననుకో. కానీ, ఎవరి ప్రాప్తానికి ఎవరు కర్తలు ! అతను నా స్వార్జితం."

"పెళ్ళి చేసుకుంటున్నావ్ బాగానే వుంది. కానీ, చదువునేం చేస్తావే ?"

"నాకెందుకే చదువు ? నేనసలు చదువుకోసం కాలేజీలో చేరాననుకు న్నావా ? ఇదో సరదా. హోదా, అంతే! పెళ్ళయ్యాక యించక్కా మొగుడితో షికార్లు కొట్టక, యీ బోరు నాకెందుకే బాబూ?"

రుద్రమ శారద పెళ్ళికెళ్ళింది.

పల్లెటూరైనా చాలా గొప్పగా ఏర్పాట్లు చేశారు.

పెళ్ళిలో యువతుల కళ్ళన్నీ రవీంద్ర మీదనే! యువకుల కళ్ళన్నీ రుద్రమదేవి మీదనే!

"మేడం నేను రవీంద్ర స్నేహితుడిని నా పేరు విష్ణువర్ధనరావు. హైదరాబాద్‌లో 'ఫోర్ డిజిట్స్' ఆదాయమొచ్చే ఉద్యోగం చేస్తున్నా. బ్రహ్మచారిని. మీకు అంగీకార మైతే పెళ్ళి చేసుకొంటా–"

రుద్రమ దేవి నిశ్చేష్టురాలయింది.

"నాకు దూరపు బంధువులు తప్ప ఆత్మీయ బంధువు లెవరూ లేరు. నా

స్వశక్తిమీద నేను పైకొచ్చాను. మీ కులం కాదు. మీ కన్నా తక్కువ కులం కూడా! కానీ మీ కులాన్ని చూచి మిమ్మల్ని చేసుకోటంలేదు. ఒక విధంగా మీ అందాన్ని చూచి అని చెప్పవచ్చు. కానీ అంతకన్నా బలమైన కారణం మీ మంచితనం. మీకు నా చరిత్ర, నేను నచ్చితే కట్నాల ప్రసక్తి లేకుండా సింపుల్‌గా మేరేజ్ చేసుకొంటా. చదువుకొనే స్వేచ్ఛ ఉద్యోగం యిత్యాది ఏ స్వేచ్ఛ అయినా మీకుంటుంది."

ఆమె విష్ణువర్ధన్ వైపు ఓ క్షణం నిశ్చలంగా చూసింది.

అతను రవీంద్రలా అందగాడేం కాదు. పుట్టిన కులము అతనిలా గొప్పది కాదు. ధనవంతుడూ కాదు.

కానీ స్వశక్తిని నమ్ముకొన్నవాడు. ఎదుటి మనిషి విలువల్ని గుర్తించే శక్తి వున్నవాడు. గౌరవించేవాడు. మంచి మనిషి అని కూడా గ్రహించింది.

అయితే ఏమని జవాబివ్వటం?

"ఆలోచించుకోండి మేడం. మీకు అంగీకారమైతే యీ అడ్రస్‌కు వుత్తరం రాయండి. ఒక్క సంవత్సర కాలం వరకు మీ జవాబుకోసం నిరీక్షిస్తా. ఆ తర్వాత మాత్రం మీ జవాబు నాశించను."

విష్ణువర్ధనుడు కలుగజేసిన ఆశ్చర్యం, ఆనందం, భయం, భ్రాంతి, యిత్యాది భావాలనుంచి తేరుకోక ముందే మరోరకం అనుభవం!

రుద్రమ ఏకాంతంగా వున్నప్పుడు పెళ్ళి కొడుకు తటస్థపడ్డాడు.

"నేనో ప్రశ్న అడగాలని చాలా రోజులుగా ప్రయత్నిస్తున్నాను. మీరెవరినైనా ప్రేమించారా?"

లేదన్నట్లు తల ఊపింది రుద్రమ.

"మరి నా ఉత్తరాలకు జవాబెందుకివ్వలేదో చెప్పగలరా? నేను అందంగా లేనా? మీకు తగననుకొన్నారా?"

"ఏ ఉత్తరాలు?"

"ప్రేమలేఖలు నేను మిమ్మల్ని చాలా రోజుల క్రితమే ప్రేమించాను"

రుద్రమ తనకొచ్చిన లేఖల్ని ఎన్నడూ చదవలేదు. కవర్లు తెరవకుండానే పెట్టె అడుగున పారేయటం అలవాటు. అలాంటి లేఖల్ని చదవటం అంటే అసహ్యం.

"నన్ను ప్రేమించిన వారు శారదనెలా పెళ్ళి చేసుకొన్నారు?"

"శారదను నేను చేసుకోలేదు. శారద నన్ను చేసుకొంది"

రుద్రమ దేవికి చిరాకు వేసింది. కోపం వచ్చింది.

"నేను ప్రేమించిందీ, పెళ్ళి చేసుకోవాలనుకొన్నదీ మిమ్మల్నే! మీరు అందుకు అంగీకరిస్తే యిద్దరికీ బాధలుంటాయని నాకు తెల్సు. అన్నిటిని అనుభవించటానికి సిద్ధపడే రాశాను. కానీ మీ నుంచి రెస్పాన్స్ లేదు. నిరాశలో వున్న స్థితిలో శారద నేర్పుగా నా బలహీనతను కనుక్కొని నన్ను మచ్చిక చేసుకొంది"

"ఏమిటి మీ బలహీనత?"

"నాచెల్లెలు పెళ్ళి చేయాల్సిన బాధ్యత. అది నెరవేర్చుకోలేని అశక్తత. అంతేకాదు ఆఫీసరు కావాలన్న కోరిక కూడా వుంది.

అయితే చెల్లెలు పెళ్లి కోసం శారదను చేసుకొన్నాడన్నమాట!

తన ధ్యేయం చెప్పింది రుద్రమ. ప్రేమలు, పెళ్లిళ్లకు ఎందుకు దూరంగా పోయిందీ, ప్రేమ లేఖల్ని ఎలా చూడకుండా పెట్టె అడుగున పారేసిందీ వివరించింది.

"అయితే మన జీవితాలలో సామ్యం చాలా వుందన్నమాట! పోనీ లెండి. నా ప్రేమ నా హృదయంలోనే వుంటుంది. కానీ-ఈ పెళ్లి వల్ల నా వుద్యోగం కోసం ప్రయత్నం చేసే మామగారు దొరికేరు. నా చెల్లెలికి పెళ్లి జరిపించే మరదలు దొరికింది. నాకదే తృప్తి"

"శారద చాలా మంచిది. ఆమెకేలోటూ రానివ్వకండి"

రవీంద్ర నవ్వేడు!

తిరిగి వెళ్ళబోతున్నపుడు రుద్రమను అడిగింది శారద

"రవీంద్ర ఎలాగున్నాడు?"

"బ్రహ్మాండమైన అందమైన చీరెను స్వల్ప ధరకు లాటరీలో కొట్టేసిన అదృష్టవంతురాలిని ఏమని పొగడను శారదా? ధనవంతులనే అదృష్టాలూ వెతుక్కుంటూ వస్తాయి. అవసరం ధనానికి తల వంచుతుంది. త్యాగం కన్నా స్వార్థమే ఆకర్షణగా కన్పిస్తుంది-'

'దీనికి అసూయ కలిగింది' అనుకొని సంతోషించింది శారద!




డిగ్రీ అయ్యాక రుద్రమ ఏంచేయాలన్న ప్రశ్న వచ్చింది కుటుంబంలో, అప్పటికే మిగతా పిల్లలు రుద్రమ మార్గాన్ని అనుసరిస్తున్నారు.

"పెద్ద పిల్ల! తల తాకట్టు పెట్టయినా పెళ్లి చేయటం శ్రేయస్కరం!" అంది అనసూయ

"ఎవరి తల? నా తల ఎవడు తాకట్టు పెట్టుకుంటాడు?" అన్నాడు మాధవరావు అసహాయంగా!

రుద్రమకు విష్ణువర్ధనరావు గుర్తు కొచ్చాడు. అతనికి జవాబివ్వ వలసిన గడువింకా తీరలేదు.

అతడిని జీవిత భాగస్వామిని చేసుకొంటే తను సుఖిస్తానని ఎందుకో అనిపించింది రుద్రమకు.

తండ్రి లేనప్పుడు తల్లి దగ్గర అతని ప్రసక్తి తెచ్చింది. అనసూయ మౌనం వహించింది.

"ఏమ్మా? యిష్టంలేదా?"

"ఎందుకు లేదమ్మా! అంతకన్న మేము మాత్రం మంచి సంబంధం ఎక్కడి నుంచి తెస్తాము? కానీ నీ కింకా చెల్లెళ్లు, తమ్ముళ్లు వున్నారమ్మా? వాళ్ల పెళ్లిళ్ల మరింత సమస్యలవుతాయనే ఆలోచిస్తున్నా. ఒక్కదానివో చివరి దానివో అయితే స్వయంగా పెళ్లి జరిపించేసి వుండేదానిని"

ఆ రోజే విష్ణువర్ధనరావుకు ఉత్తరం రాసింది.

"చుట్టూ వున్న సమాజం కన్నా ముందుగా ఎత్తుకెదిగి, గొడ్డలి దెబ్బలను భరించాల్సి వచ్చినపుడు చింతించటం ఎందుకు? ముందే ఆ అవసరం రాకుండా చూసుకుంటే మంచిదికదా? నా చర్య వల్ల నా తల్లి కడుపున పుట్టిన తతిమ్మా పిల్లలు చిక్కుల్లో యిరుక్కో కూడదు. నన్ను క్షమించండి"

ఆరోజే తెలుగు యమ్మేకు దరఖాస్తు పెట్టింది. మాధవరావు ఆశీర్వదించాడు. సీటు వచ్చింది.

"ఎమ్మే కూడా చదివితే యికదాని పెళ్లి చేయగలరా మీరసలు"?

"ఇప్పుడు చేయగలిగితేకదా? అప్పుడు చేయలేనని విచారించటానికి?"

"ఈ లెక్కన దానికసలు పెళ్లి అవుతుందా అని నా భయం!"

"నువ్వూ నేనూ పెళ్లి చేసుకొని వుద్ధరించిందేమిటి! మనకితోడు మరికొందర్ని సృష్టించాం. సమస్యలను వాళ్ల నెత్తిన రుద్దేం. అంతేగా?"

"అలాగని పెళ్లే అక్కర్లేదంటారా?"

"అలా ఎందుకనుకుంటావ్? ఆడవానికి పెళ్లి మినహా మరో జీవితంలేదా?"

ఆ సంభాషణ వృద్దమ చెవిలో పడి ఆలోచింప చేసింది.

అసలు స్త్రీ జీవితంయొక్క అర్థం, పరమార్థం ఏమిటి?

వేదకాలం నాడు స్త్రీని అర్ధాంగి అన్నారు. సభ, 'సమితిలలో' ఒకదానిలో సముచిత స్థానాన్ని ఇచ్చి స్త్రీ యొక్క రాజకీయ, సామాజిక ప్రతిపత్తిని గురించారు. ధర్మపత్ని లేకుండా పురుషుడు చేసే ఏ విధమైన ఐహిక ఆముష్మిక కర్మలకు సార్థక్యత లేదనటం ద్వారా స్త్రీకి పురుషుడి జీవితంలో ప్రాధాన్యతను కల్పించారు.

బాగానే వుంది. అయితే యిదంతా పురుష పరంగా ఎందుకు జరగాలి? స్త్రీనే కేంద్రగాచేసి పురుషుడిని ప్రాధాన్యత కలిగిన ఉపాంగంగా ఎందుకు భావించలేదు?

ప్రకృతి-పురుష భావన ఆలంబనగా సృష్టి క్రమాన్ని వర్ణించారు భారతీయ దార్శనికులు.

యూనివర్సిటీలో మొదటి పాఠం ఆమెను ఆకర్షించింది. ఆ పాఠం చెప్పిన రామమోహన్ పాండిత్య ప్రతిభ, వ్యక్తి కరణ ప్రజ్ఞ కూడా ఆమెను ముగ్ధురాలిని చేశాయి.

విశ్వ విద్యాలయ వాతావరణం డిగ్రీ కాలేజీ వాతావరణానికి భిన్నమని ఆమె త్వరలోనే తెల్సుకొంది!

డిగ్రీకాలేజీలోలెక్చరర్లు పాపంపాఠాలు చెప్పేవారు. కానీ విద్యార్థులు వారిని చెప్పనిచ్చేవారు కాదు. అల్లరి, గొల. ఎంత బాగా చెప్పే లెక్చరరుకైన పరీక్షలు తప్పవు.

'అల్లరి చేయటంతో పాటు, పాఠాలు చెప్పే వినటానిక్కూడా ఇదే మీకు ఆఖరి అవకాశం. ఎమ్మేలో అల్లరి ఎలాగూ చేయలేరు. పాఠాలు విందామన్నా మీకు చెప్పేవాళ్లు లభ్యంకావటం అరుదు. గుర్తుంచుకోండి'

డిగ్రీ చదువుతుండగా చరిత్ర లెక్చరర్ చెప్తుండే వాడు. ఆయన మాటలు. అక్షరాల నిజం.

ప్రొఫెసర్లు క్లాసులే సరిగా తీసుకోరు. తీసుకొన్నా సరిగ్గా చెప్పరు. అయినా క్లాసులో పిల్లలంతా కుక్కిన పేనులే. డాక్టర్ రామ్‌మోహన్ కూడా అంతే. క్లాసు తీసుకొంటే పాఠం బ్రహ్మాండంగా చెప్తాడు. కానీ క్లాసులు తీసుకోవటమే గగన కుసుమం. తీసుకొన్నా ఒక్కోసారి పాఠం చెప్పడు. అంతా మూడ్! 'మూడ్ ప్రొఫెసర్' అని ఆయనకు రహస్యంగా విద్యార్థులు పెట్టిన నిక్‌నేమ్‌లలో ఒకటి మాత్రమే!

ఇక విద్యార్థుల్లో చాలామంది చదువుకొందామనీ, ఏదో నేర్చుకొందామనీ యూనివర్సిటీకి వచ్చినట్లు కన్పించదు. క్లాసులుంటే వెళ్తారు. లేకపోతే ఆడమగ జంటలుగా, గుంపులుగా క్లాసు రూము



ల్లోనో, చెట్లకిందో కబుర్లు చెప్పుకొంటూ కాలక్షేపం చేస్తారు. భవిష్యత్ జీవితం పట్ల ఏ విధమైన బెదురు లేనట్లు నిర్వి చారంగా కన్పిస్తారు.

ఆ క్లాసులో విద్యార్థినీ విద్యార్థులు సమ సంఖ్యలో వున్నారు. అప్పటికే అందరూ జతలుగా ఏర్పడ్డారు. రుద్రమ జతకు మార్కండేయు లొక్కడే మిగిలి వున్నాడు.



మార్కండేయులు యూనివర్సిటీలో ఎమ్మే చదివే విద్యార్థిలా కనిపించడు. కుచేలుడి సంతానంలో కడగొట్టు వాడిలా వుంటాడు.

"ఎంత బీదవాడయితే మాత్రం? శుభ్రమైన పేంటు, షర్టు వేసుకోలేడా? ఆ మాత్రం శక్తి లేనివాడు ఎమ్మేలో ఎలా చేరాడు? ధనవంతులు తమ దర్జాను ఎగ్జిబిట్ చేసుకొంటున్నారని ఏడ్చే

చనాపు జనం–కానీ ఇదేమిటి? బీదరికాన్ని ఎగ్జిబిట్ చేసుకోటం కాదా?" సంధ్యారాణి ఓసారి చిరాగ్గా అంది అందరి ఎదుట!

సంధ్యారాణి ఓ సిరిగల వ్యక్తి పుత్రిక. ఆమె తండ్రి, చిన్నాన్న, పెదనాన్నలు అందరూ సినిమా ప్రొడ్యూసర్లుగా, డిస్ట్రిబ్యూటర్లుగా ప్రఖ్యాతి వహించారు.

కాలేజీకి కారులో వస్తుంది. కారులో వెళుంది. దిగబెట్టటానికి, తోడుకొని పోవటానికి అప్పుడప్పుడు ఓ అందమైన ఆజానుబాహు రూపం వస్తుంటుంది:

"బీదరికాన్ని ఎగ్జిబిట్ చేసుకొంటే ఏమొస్తుంది – బూడిద ?" ఆ సందేహం కలిగింది – కంపోస్టు ఎరువువేసి పెంచిన ఓ సొరకాయకు.

ఆ సొరకాయ పేరు సుధాకరమూర్తి. స్కూటర్ మీద వస్తుంటాడు కాలేజీకి. అతని తండ్రి ఒకప్పుడు యమ్మెల్లే. ఆ మధ్య ఓడిపోయినా ఇప్పటికీ జిల్లా రాజకీయాల్లో యుగంధరుడే.

సుధాకరమూర్తి మాటల్లో సొర కాయలు తెగుతుంటాయి, మాటల్లో మసాలా వేసి అందరికీ పంచుతుంటాడు.

అతని తండ్రికి రాజకీయాల్లో కొడుకును తనకన్నా గొప్పవాడిని చేయాలన్న కాంక్ష. తల్లికేమో కొడుకును ఏ కలెక్టర్నో చేయాలన్న కల. సుధాకర మూర్తికి యీ రెండూ ఇష్టమే. అయితే ఈ రెంటికన్నా యిష్టం – సినిమా ఏక్టరు కావటం! అందుకు తగ్గ పర్సనాలిటీ కూడా వుంది. దాన్ని చూసుకొని మురిసి పోతుంటాడు. సినిమా స్టారైనట్లే పోజు పెడుతుంటాడు.

చిత్రమేమంటే క్లాసులో చేరంగానే సంధ్యారాణికి పరిచయమయింది రుద్రమ దేవితో. అలాగే సుధాకరమూర్తికి మార్కండేయులు మొదటి స్నేహితుడు.

అయితే ఇద్దరూ త్వరలోనే తమ పొరపాట్లను తెల్సుకొన్నారు.

సంధ్యారాణి సుధాకరమూర్తికి దగ్గరయింది. జోడు కట్టింది.

సుధాకరమూర్తి ప్రశ్నకు సమాధానం ఇచ్చేముందు సంధ్యారాణి రుద్రమ వైపు అదోరకంగా చూసింది. ఆమె బీదరికాన్ని ఎగ్జిబిట్ చేసుకోక పోయినా వస్తుతః బీదదని సంధ్యారాణికి తెల్సు.

"మన సిరిసంపదల్ని మనం ఎగ్జిబిట్ చేసుకొంటే మనకే నష్టం. బీదవాళ్లు బీదరికాన్ని ఎగ్జిబిట్ చేసుకొంటే అంతా లాభమే. జనం సింపతిని కొట్టేసి బుట్టలో వేసి ప్రివిలేజస్ పొందటానికి అదో మార్గం."

ఇంతలో మార్కండేయులు అటు రావటంతో టాపిక్ మారింది.

ఎవరేమనుకొన్నా రుద్రమకు మార్కండేయులు నచ్చాడు. క్రమంగా అతనికి దగ్గరయింది. దగ్గరయ్యేకొద్దీ అతని విశ్వరూపం సాక్షాత్కారం కాసాగింది.

మార్కండేయులు వేదాలని, ఉపనిషత్తుల సారాన్ని కాస్తోకూస్తో జీర్ణం చేసుకొన్నాడు. మార్క్స్, లెనిన్లనూ అధ్యయనం చేశాడు.

అతని బుర్రలో ఒక వైపు భారతీయ సంస్కృతీ, సాంప్రదాయాలు; మరోవైపు మార్క్స్ లెనిన్లు –తరతరాలుగా అణగ గొట్టబడ్డ వర్గాల వారి కోసం, పడ్డ తపన–నిక్షిప్తాలై వున్నాయి.

అతనికి బీదల కన్నీళ్ళు హరించే సమ సమాజ స్థాపన కావాలి. అలాగే ప్రతీ భారతీయుడూ ఆధ్యాత్మిక విలువలను తెల్సుకొని ధర్మానిష్టా పరుడై వుండాలన్న

కోరికా వుంది.

జగత్తంతా భౌతిక సుఖముల మయ మన్న వాదనను అంగీకరించడు అతను. అలాగే ఆధ్యాత్మికత అంటే అంధ విశ్వాసాలన్న ధోరణినీ సహించడు. అతను తార్కికుడు. హేతువాది. జిజ్ఞాసాపరుడు. మేధావి.

పరిచయం మరికాస్త పెరిగాక అతడిని గురించి మరో విషయం తెల్సింది. అతను కవి. చాలా ఖండికలు రాశాడు. కానీ ఒక్కటీ ప్రచురణ కాలేదు. అసలు ప్రచురణకివ్వాలన్న ధ్యాసే లేదు.

"ప్రచురించటానిక్కాకపోతే మరెందుకు రాశారు ?"

"నా ఆత్మానందం కోసం. నాలోని ఆలోచనల తీవ్రతను వుపశమింప చేసుకోవటం కోసం."

"మీ ఆత్మానందాన్ని జనానికి కూడా పంచి ఇవ్వవచ్చుగా? మరీ అంత స్వార్థమయితే ఎలా? పోనీ నేను చదువుతాను యిస్తారా?"

అతను నవ్వి ఒక బౌండ్ పుస్తకాన్ని ఇచ్చాడామెకు.

ఆమె శ్రద్ధగా చదివింది. అతనన్నది నిజమే.

అతని ఆలోచనలలో లావా వుంది. విషయమేమైనా తీవ్రమైన భావావేశంతో చెప్పాడు. పిల్ల మునిలా కన్పించే అతని బుర్రలో ఎంత అగ్నివుంది?

"మీ కవిత్వానికి వైవిధ్యమున్న యితివృత్తాలనే ఎన్నుకొన్నారు. కానీ ఎక్కడా స్త్రీ సమస్యలను స్పృశించనన్నా లేదే?"

"స్త్రీని నేను ప్రత్యేకించి చూడను. మానవుడు ఈ యాంత్రిక యుగంలో ఎదుర్కొంటున్న అనేకానేక సమస్యల్లో స్త్రీ కూడా ఓ భాగమే"

"స్త్రీ పురుషుల ప్రణయాన్ని కూడా మీ కవిత్వంలో నిషేధించినట్లున్నారు ?"

"నాకు అనుభవం లేని దానిని, తెలియని దానిని, కనీసం ఆలోచనన్నా చేయని అంశాన్ని గురించి ఏం రాయమంటారు ?"

రుద్రమతో దాదాపు సంవత్సరం పరిచయం తర్వాత అతను చెప్పిన విషయం అది ?

అప్పటికే క్లాసులో రెండు జంటల విషయం శృతిమించి రాగానపడి ప్రొఫెసర్ల దృష్టికి వెళ్ళింది. వాళ్ళు పాసు కావటం కష్టం అనుకొంటున్నారంతా !

అటువంటిది తను అంత సాన్నిహిత్యంగా మెలుగుతున్నా అతనికి ఎటువంటి కోరిక కలుగలేదన్న మాట ! ఎంత ఉత్తముడు ?

రుద్రమ ఇందుకు ఆనందించింది. అతనిపై వున్న గౌరవం పెరిగింది.

కానీ మరోకందుకు విచారించింది. నిరాశ చెందింది.

రుద్రమ అప్పుడప్పుడే మార్కండేయుల్ని ప్రేమిస్తోంది. ప్రేమ స్వరూపాన్ని గ్రహించటానికి ప్రయత్నిస్తోంది.

అంతేకాదు. వాస్తవ పరిస్థితుల్ని కూడా ఆలోచించింది.

తామిద్దరూ బీదరికంలో నుంచి వచ్చినవారు. బీదతనంపట్ల సానుభూతి వున్నవారు. పెద్దగా భౌతిక సుఖాల కోసం అర్రులు సాచనివారు. భావైక్యత చాలా విషయాలపై గలవారు. ఇన్ని సామ్యాలున్న తమ జీవితాలు రెండూ ఏకమైతే ప్రయోజనం వుండదా ?

పైగా అతను సదాశయాలు కలవాడు. తన కుటుంబ బాధలు చెప్పుకుంటే కష్టాలు ఇత్యాది విషయాల జోలికి

పోకపోవచ్చు.

"స్త్రీ జీవితం యొక్క అర్థం - పరమార్థం ఏమిటి-మీ దృష్టిలో?"

అతను నవ్వేడు.

"చెప్పానుగా? నేను అద్వైతినని. స్త్రీ పురుషులను విడిగా చూడనని"

ఆ తర్వాత ప్రీవియస్ పరీక్షలొచ్చాయి. అయిపోయాయి.

రుద్రమ బాగా రాసింది. మార్కండేయులూ బాగా రాశాడు.

శలవులకు ఇంటికి వెళ్ళటానికి సిద్ధమవుతుంటే ఆ సాయంత్రం ఓ వార్త తెలిసింది రుద్రమకు.

సుధాకరమూర్తి సంధ్యారాణిని పెళ్ళి చేసుకోమని అడిగేడు. ఆమె ఆ రోజు తనని తీసుకు వెళ్ళటానికి కారులో వచ్చిన పొడుగాటి సినిమా పర్సనాలిటీని అందరికీ పరిచయం చేసింది.

"ఇతను నా భర్త. మిస్టర్ శశాంక సినీ దర్శక నిర్మాత"

కారుపోతూ కళ్ళల్లో కొట్టిన దుమ్ము కన్నా, సంవత్సరంపాటు సంధ్యారాణి తన కళ్ళల్లో కొట్టిన దుమ్ము సుధాకరమూర్తికి గొప్ప బాధ కలిగించిందిట!

నవ్వొచ్చింది రుద్రమకు.



ఝాన్సీని చూచి అద్దంలో తన ప్రతి బింబాన్ని చూసుకొన్నట్లు భ్రమపడింది రుద్రమ. ఏడాదిలో ఎంత మార్పు?

ఝాన్సీలక్ష్మి రుద్రమ చెల్లెలు. మాధవరావు రెండో సంతానం. ఇంటర్ పరీక్షలు రాసింది.

"ఏమే. పరీక్షలు బాగా రాశావా?"

ఝాన్సీ మౌనం వహించింది.

రూపురేఖల్లో రుద్రమకు తీసిపోదు ఝాన్సీ. అయితే స్వభావంలో వ్యతిరేకం. ఎప్పుడూ గలగలా వాగుతుంటుంది. తన డబ్బా తానే వాయించుకొంటూంటుంది.

"ఏమే! ఒకెట్ తన్నేసుందా పరీక్ష?"

"ఖాయమక్కా. కాకపోతే ఎన్ని సున్నాలు, ఎన్ని అంకెలు అనేది చెప్పలేను."

"ఏం చదవలేదా? చదివినవి రాలేదా?"

"చదవలేదు. చదివినవీ రాయలేకపోయాను"

సంవత్సరంలో ఏమిటి పిల్లలో ఇంత మార్పు? ఇంతలో ఏమొచ్చింది? ఎందుకిలా మారింది? తబ్బిబ్బుపడిపోతోంది రుద్రమ మనసులో.

"నువ్వు వస్తే నిజం చెప్దామని నీ కోసం ఎదురు చూస్తున్నానుకో. అక్కా-నాకు చదువు మీదికి మనసు పోవటం లేదు. అమ్మానాన్నలు నా మనసు తెల్సుకోనటానికి ప్రయత్నించరు.నువ్వో మార్గం వేశావుగా? ఆ మార్గంలోనే నన్నూ పంపుదామని వాళ్ళ వుద్దేశం—"

రుద్రమకు చెల్లెలి ధోరణి చాలా కొత్త. ఎప్పుడైనా ఇంత సీరియస్‌గా మాట్లాడి ఎరుగునా?

"ఏమిటే? ఇంతలో ఏమయింది నీకు? ఏదో కొత్తగా మాట్లాడుతున్నావ్?"

"నాకు పెళ్ళి చేయమని అమ్మానాన్నలతో చెప్పు అక్కా నేనే చెప్దామంటే

ధైర్యం చాలటం లేదు"

"ఏమిటీ! పెళ్ళి చేయమని అడుగుతోందా చెల్లెలు?"

ఆ తర్వాత చాలా మాట్లాడుకొన్నారు అక్కా- చెల్లెళ్లు. ప్రేమ ఎంత నచ్చ చెప్దామన్నా ఝాన్సీ ధోరణే ధోరణి. పెళ్ళి-పెళ్ళి!

"పెళ్లంటే మాటలు టే! నాకు పెళ్ళి చేయలేకే కదా చదువు చెప్పిస్తున్నారు? పెళ్ళి చేయకుండా నన్ను చదివిస్తున్నందుకు అమ్మ మనసులో ఎంత బాధ పడుతోందో నీకేం తెల్సు? పోనీ కట్నం అడగకుండా పెళ్ళి చేసుకొనే యువకుడి నెవరినైనా చూసుకో. కులం గిలం అన్నీ సరిపోవాలి సుమా! అలాగే పెళ్ళి చేసేస్తాము''

''తమాషా కాదక్కా. నేను సీరియస్‌గా చెప్తున్నాను రేపు నేను ఫెయిల్ అవుతాను. నన్ననీ లాభం లేదు. జీవితంలో ఫెయిల్ కాకుండా చూసే బాధ్యత మీదే. అమ్మా నాన్నలతో మాట్లాడు" ఝాన్సీ యిచ్చిన అల్టిమేటం అది. కానీ ప్రేమకు ఏం చేయాలో, ఆ విషయాన్ని తల్లిదండ్రులతో ఎలా ప్రస్తావించాలో తోచలేదు.

మాధవరావు మూడవ సంతానం స్వతంత్ర భాను. ఆ సంవత్సరమే టెంత్ క్లాసు పరీక్షలు రాశాడు. ఫస్టు క్లాసులో పాసయ్యాడు. ఆ సంతోషంలో వుందియిల్లంతా ఆ రోజు.

''నేనే వాళ్ళకేమీ యివ్వ లేక పోయాను కానీ, నా బిడ్డలంతా తెలివిగల వాళ్లు. దేశానికి ఉపయోగపడేవాళ్ళు. కానీ దేశం వాళ్ళను వుపయోగించుకొనేటంత తెలివిగా పాలించబడుతున్నదా అన్నదే నా బాధ?''

అందరి ఆనందాన్ని అనుభవించనిచ్చి కాస్త చివరికి వేదనను, ఆందోళనను ధ్వనిస్తూ అన్నాడు మాధవరావు.

ఆయనిప్పుడు ప్రూఫ్‌రీడరు నుంచి అసిస్టెంట్ ఎడిటర్‌గా ప్రమోట్ అయ్యాడు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏ విషయం రాయవల్సి వచ్చినా పత్రికలో ఆయనన్నే రాయమంటాడు ఎడిటర్. అందుకు కారణం లేకపోలేదు. స్వాతంత్రానంతరం కాంగ్రెస్ ప్రభుత్వం సాధించిన విజయాలను, ప్రగతిని ఆయన చూడలేడు. అసలాయనకి కనబడవు. ప్రభుత్వ వైఫల్యాలు మాత్రం ఆయన వెయ్యి కళ్ళతో చూస్తాడు. పదివేల నాలుకలతో విమర్శించగలడు. ఆ విమర్శలు చాలా తీవ్రంగా, పూర్వాపరాలను సమీక్షిస్తూ ఆకర్షణీయంగా, ఆలోచనాత్మకంగా వుంటాయి. ఆయన రాసేవన్నీ పచ్చి నిజాలు. అందుకే ఆయనకి అలాంటి పనులు అప్పగిస్తాడు సంపాదకుడు. అందువల్ల పత్రికకు బోలెడంత లాభం.

''నువ్వెప్పుడూ యింతే నాన్నా! అంతా వ్యతిరేక దృష్టితో ఆలోచిస్తావు. పాజిటివ్ అవుట్‌లుక్ కూడా అవసరం. ప్రభుత్వం అంటే మరీ అంత 'ఎలర్జీ' అయితే ఎలా? మీ రోజుల్లో అసలు మన లాంటి బీదవాళ్ళ తెలివితేటలు బయటపడే అవకాశాలు యిప్పటిలాగా వుండేవా? మా అందరి చదువులకి జీతాలు చెల్లించవల్సి వస్తే మీరు మాకసలు చదువు చెప్పించగలిగేవారా? ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఉచిత విద్యావిధానం వల్లే తమ్ముడి తెలివితేటలు బహిర్గత మయ్యాయి. రేపటి సంగతి తల్చుకొని యిందుకు వాళ్ళెంత ఆందోళన చెందుతారు? ప్రభుత్వం సాధిం

చిన ప్రగతిని కూడా చూడరేం?'

ఆయన ఓ క్షణం మౌనం వహిం చాడు. ఆ తర్వాత మెల్లగా దరహాసం చేశాడు.

"నువ్వింకా చిన్న పిల్లవులేమ్మా, అభివృద్ధికి కొలమానం అది కాదు. స్వాతంత్ర్యానికి పూర్వం కాంగ్రెస్ ధ్యేయాలతో పోలిస్తే, స్వాతంత్ర్యానంతరం యిన్నేళ్ళలో ప్రభుత్వం సాధించిన పురోభివృద్ధి ఆవగింజలో పావుభాగం కూడా వుండదు. ఆ గొడవలన్నీ యిప్పుడెందుకులే కానీ-స్వతంత్రుడిని ఏం చేద్దామంటావ్?" స్వతంత్రభానుని ఆయన ముద్దుగా అలా పిలుస్తాడు.

"వాడి అభిరుచిని కనుక్కోండి ముందు"

"వాడి అభిరుచుల ప్రకారం చదువు చెప్పించే తాహతు మనకుండొద్దూ? ప్రభుత్వం జనరల్ ఎడ్యుకేషన్‌ను కొంతవరకు ఉచితం చేసింది. కాని, టెక్నికల్ ఎడ్యుకేషన్‌ని, ప్రొఫెషనల్ ఎడ్యుకేషన్‌ని ఉచితం చేయలేదు గాని?"

"ఇంటర్ అయ్యాక నేను ఇంజనీరింగ్ చదువుతా. లేకపోతే గుమస్తా వుద్యోగం చేస్తా, అంతేగానీ బిఏలు, ఎమ్మేలు చదవను" స్వతంత్రభాను తన నిర్ణయాన్ని చాలా దృఢంగా, స్పష్టంగా చెప్పాడు. అనసూయతో సహా అంతా ఆశ్చర్యపోయారు.

ఇంజనీరింగ్ చదువు ఆ వూళ్ళో లేదు. మరో చోటికి పంపాలి. అంటే చాలా ఖర్చవుతుంది? ఎక్కడినుంచి తెచ్చేటట్లు?

తర్జన భర్జనలయ్యాయి. స్వతంత్రుడు తన స్వతంత్రభావాన్ని వదల్లేదు.



"రెండేళ్ళ తర్వాత సంగతి కదా నాన్నా! అప్పటికి నేను వుద్యోగంలో చేరనా? అప్పుడు ఆలోచిద్దాంలే. ముందు ఇంటర్‌లో చేర్పించండి"

అప్పటికా నిర్ణయం అయిపోయింది. ఆ ఘట్టం ముగిసింది.

"అయితే ఏమిటే! నువ్వు వుద్యోగం చేస్తావా? మరి పెళ్ళి చేసుకోవా ఏమిటి?!" అనసూయ ఆ తర్వాత కూతుర్ని అడిగింది. ఝాన్సీ విషయం ప్రస్తావించటానికి అది మంచి అవకాశం. అదీగాక ఇంటర్ పరీక్షా ఫలితాలు తెలిసే తరుణం కూడా దగ్గరపడింది. తీరా అప్పుడు కూతురు ఫెయిల్ అయిందంటే అది మిగతా వారికి 'షాక్' కావచ్చు. ముందే అన్ని విషయాలు ప్రస్తావిస్తే మంచిదిగదా?

"ఎమ్మే చదివిన నా పెళ్ళి నువ్వేలాగు చేయలేవుకదమ్మా? నేనే చేసుకొంటాను. అన్నీ సరిపోయినవాడిని, కట్నం అడగని వాడిని నేనే చూసుకొని చెప్తాగా? కానీ ఝాన్సీ పెళ్ళి విషయం ఆలోచించుకొ స్త?"

అనసూయ కూతురివైపు ఆశ్చర్యంగా, అనుమానంగా చూసింది.

"అమ్మా! ఏమీ అనుకోకు. దాని యీడులో వుండగానే-యింకా అంతకన్నా ముందే-నువ్వు నా పెళ్ళికోసం తాపత్రయ పడ్డావు. గుర్తుందా? మరి దాని పెళ్ళికెందుకు తాపత్రయ పడటం లేదు. నాకు పెళ్ళి కాలేదనేనా? ఎవరి అభిరుచులు వారివి అమ్మా. దానికి వెంటనే పెళ్ళి చేయడం అవసరం"

"కొంపతీసి అదేమన్నా కాని పని చేయలేదు గదా!"

"ఆ భయం అక్కర్లేదు. కాని దానికి చదువు మీద దృష్టి లేదుట"

"అంటే-ఆ డిగ్రీ కూడా చదవదా?"

తనకు చదువు చెప్పించటానికి ఒప్పుకోని తల్లి ఇప్పుడు చెల్లి బి.ఏ. చదవదా అని అడుగుతోంది. నవ్వొచ్చింది రుద్రమకు.

"అసలు ఇంటరే పాస్ కాదమ్మా."

అనుకొన్నట్లే ఝాన్సీ ఫెయిలయింది. ఆయనకు అంతకుముందే అనసూయ అన్ని విషయాలూ చెప్పింది. అయినా కూతురు నెంబరుకోసం పత్రికలో ప్రచురణకొచ్చిన నెంబర్లన్నీ ఆఫీసులో వెతికాడు. కూతుర్నేమీ అనలేదు. అసలా విషయమే ప్రస్తావించలేదు. ఆ రోజంతా అందరికీ బరువుగా గడిచిపోయింది.

మర్నాడు శారద రవీంద్రతోసహా దిగింది. అద్దాలలో నెలల బాబు.

"ఏణ్ణర్థం కాలేదు పెళ్ళయి? అప్పుడే చంకలో బిడ్డా? కంగ్రాచ్యులేషన్స్"

బిడ్డ అచ్చం శారద పోలికే. అందరి దృష్టిని ఆకర్షించేటంత అందం ఏముంటుంది ఇంక?

"మూడో నెలన్నా నిండినట్లు లేదు బాబుకు! అమ్మాయిని ఇంకా కొన్నాళ్ళు పుట్టింట్లోనే వుంచకపోయావా నాయనా?" ఏదో మాట్లాడాలికనుక మాట్లాడుతున్నట్లు పెద్ద తరహాలో అంది అనసూయమ్మ.

రవీంద్ర యిరుకునపడ్డట్లు మొహం పెట్టాడు. భార్యవైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"మీకు అతని సంగతి తెలీదులెండి పిన్నిగారూ! పుట్టింట్లో వున్న ఈ నాలుగు నెలల్లోనే అక్కడ ఎన్ని రాసక్రీడలు సాగించేడోనని ఇప్పటికే భయపడి చస్తున్నాను అనుకోండి. చూస్తున్నారుగా ఆయనగారి సినిమా హీరో పర్సనాలిటీ. అక్కడ హైదరాబాద్‌లో ఆఫీసుల్లో ఆడ పిల్లలు. ఇరుగింట పొరుగింట ఆడపిల్లలు. బస్ స్టాపుల్లో ఆడపిల్లలు అందరి కళ్ళూ నా మొగుడిమీదేననుకోండి."

ఆ ధోరణికి భయపడిందేమో అనసూయమ్మ లోపలికెళ్ళింది. రవీంద్ర సిగరెట్టు కాల్చుకోవటానికి వాకిట్లోకి వెళ్ళాడు.

"చాలా రోజులయిందే నిన్ను చూసి. చూశావుగా నా మొగుడి ధోరణి.అతగాడు ఆఫీసరయిన దగ్గరనుంచి చాలా కొత్త కొత్త అలవాట్లు చేసుకున్నాడులే.అందులో ఈ సిగరెట్టు తాగడం ఒకటి! పాడు కంపు. నాకు అసహ్యం. చెబితే వినడు. ఎన్నని చూసుకోను చెప్పు. ఈ సంసారం ఈదకోలేక చస్తున్నాననుకో!"

శారద ఎంతోసేపు వుండలేదు అసలు వుండటానికి రాలేదు. పుట్టింటి నుంచి హైదరాబాద్ వెళుతూ మధ్యలో ఈ మజిలీ వేసింది.

"ఎందుకో నిన్నోసారి చూడాలి అనిపించిందే. అంతే...రవీంద్రతో పోట్లాడి మీ ఇంటికి తీసుకొచ్చాననుకో!"

సాయంకాలం టాక్సీ ఎక్కే వరకు ఇదే ధోరణి. తన భర్త ఆధిక్యతను గురించి అంతటి ఆధిక్యతగల భర్తపై తనకుగల అధికారాన్ని మాటిమాటికీ ప్రదర్శిస్తూనే వుంది మాటల్లో, చేతల్లో కూడా.

శారద స్వభావం తెలిసిన రుద్రమకు స్నేహితురాలి ఈ ధోరణికి ఆశ్చర్య పోవాల్సిందేమీ కన్పించలేదు. కానీ నెలల క్రితం పుట్టిన ఆ బిడ్డను చూసుకొని, ఆ బిడ్డ భవిష్యత్తు తలచుకొని ఆమె పొందే ఆనందం, ఆందోళనలు ఆమెకు ఆశ్చర్యాన్ని కలిగించాయి. అంతే కాదు, పిల్లవాడి ప్రసక్తి వచ్చినపుడల్లా శారద కొత్తగా కన్పించేది. ఏదో హుందా, పెద్దరికం ఆమెను ఆవహించేవి.

"పూర్వంలాగా రోజుకో చీర కడు



తున్నావుటే శారదా? సినిమాలు చూస్తున్నావా ?" మాటల సందట్లో అడిగింది పద్మ.

"కొత్తలో సినిమాలూ చూసేదాన్ని, చీరెలూ కట్టేదాన్ననుకో. హైదరాబాద్‌లో జనానికంతా నా మొగుడుగా రవీంద్రను చూపించాలిగా ? కానీ వీడు–ఈ బుల్లి



వెధవ నా కడుపులో పడ్డాక అన్నీ మానేశానే? ఎందుకో యిచ్చ చచ్చి పోయిందనుకో. కడుపుతో వున్నవాళ్ళు జాగ్రత్తగా వుండాలంటారుగా? నేను ఈ బంగారుకొండకోసం సినిమాలు, చీరెలు, షికార్లు, ఆఖరికి ఈ వాగుడు కూడా త్యాగం చేసేశాననుకో. రేపు వీడు నన్ను ఏం ఉద్ధరిస్తాడో ఏమో?"

ఆ మాటల్లో ఎంత గర్వం? ఎన్ని కలలు? ఎంత తృప్తి?

"ఇంతకీ నీ పెళ్ళెప్పుడే? ఇలాగే తాత్సారం చేశావంటే ఆ తర్వాత మొగుళ్ళే చిక్కరేవ్! నేను ముందే చెబుతున్నా, అసలు నాకు తెలీకడుగుతా నేను [illegible]

చదువుతూనే మొగుణ్ణి వెతుక్కొన్నా కదా! నువ్వు ఎమ్మేకి పోయి కూడా మార లేదా ఏమిటే? ఈ రోజుల్లో ఆడపిల్లలు కాలేజీలకు పోయేది కేవలం చదువుకోసమే కాదే. పదిమంది మగాళ్ళ కళ్ళల్లో పడి పెళ్ళికొడుకుల్ని ఎన్నుకోవటానిక్కూడా! ఎన్ని చదువులన్నా చదువు, ఎంత గొప్ప ఉద్యోగాలన్నా చేయనియ్! ఆడ దానికి మొగుడు నీడలో వున్న భద్రత, సంసార జీవితంలో వున్న థ్రిల్‌కు సాటిలేదనుకో. హైదరాబాద్‌లో జనాన్ని చూస్తున్నాగా? ఎద్దుల్లా ఎదిగిపోయేది, పరాయివాళ్ళ మొగుళ్ళవైపు పీక్కు తినేలా చూసేది-ఎందుకొచ్చిన అవస్థలు చెప్పు?"

రుద్రమకు శూలంపెట్టి గుచ్చినట్లు అయింది.

'శారద అతి సామాన్య స్త్రీ. అతి శయం, స్వార్థపరత్వం ఆమె కవచాలు. వాటినే ఆమె మహా ఆభరణాలనుకొం టుంది. అలాంటి స్త్రీ మాటలని లెక్క చేయటం ఎందుకు?' అని ఎంత సరి పెట్టుకొందామన్నా మనసులో ఆలోచ నలు ముసురుకొన్నాయి.

"ఆడదానికి మొగుడు నీడలో వున్న భద్రత - సంసార జీవితంలో వున్న థ్రిల్‌కు ఏదీ సాటిరాదనుకో!"

స్త్రీ జీవితానికి అర్థం, పరమార్థం- సంసార చక్ర పరిభ్రమణంలో నలగట మేనా?

"శలవుల్లో ఎప్పుడో వీలు చూసుకొని ఒకసారి హైదరాబాద్‌కు రావే రుద్రా! మళ్ళీ పెళ్ళయితే నువ్వెటో, నేనెటో? ఉద్యోగాన్వేషణలో పడితే ఎలాగూ హైదరాబాద్ రావాలనుకో నువ్వు. ఎలాగోలాగు తప్పక రా!" అని టేక్సీ ఎక్కబోతూ ప్రేమగా ఆహ్వా నించింది శారద.

అంతకుముందు అనసూయమ్మ చేత శారదకు మంచి రవికల గుడ్డ, బాబుకు నిక్కరు, షర్టు పెట్టించింది. శారదకు ఆ వస్తువులు వో లెక్కలోవి కావు. ఆలాంటివి చాలా కొనుక్కోగలదు. అయినా అనసూయమ్మ పసుపు రాసి, బొట్టు పెట్టి ఆ రవికల గుడ్డ యిస్తుంటే అప్పటి శారద మొహంలో కోటి దీపాల కాంతి!

రవీంద్ర రుద్రమ వైపు చూసి అదో విధంగా నవ్వేడు. ఒకడుగు ముందుకేసి దగ్గరిగా వచ్చాడు. రహస్యంగా అన్నాడు.

"చూశారుగా? డబ్బుకు అమ్ముడు పోయిన నా స్థితి!"

టేక్సీ కదిలి పోయింది. కానీ రుద్రమ అక్కడినుంచి కదల లేకపోయింది.

"వెళ్ళిపోయిన దాన్ని యింకా ఏం చేస్తావే? నీ తోటిది భర్త, బిడ్డతో గల గలా నవ్వుతూ ఎంత ఆనందంగా వుందో చూడు? ఏ ఈడుకు జరగాల్సిన ముచ్చట్లు ఆ ఈడుకు జరిగితేనే అందం ఆనందం! ఏమిటో? పరాయి అమ్మ కన్న బిడ్డల్ని చూచి మురిసిపోవటంతోనే సరి పోతోంది నా బ్రతుకు? నా బిడ్డలను చూచి మురిసిపోయే కాలం ఏనాడు వచ్చేనో?"

"నన్ను డబ్బా అంటారు. నా కన్నా పెద్ద డబ్బా మీ స్నేహితురాలు. వాగిందే వాగటం! అబ్బ! వాన వెలిసినట్లయిం దనుకో!" ఝాన్సీ కామెంట్!

ఒకవైపు ఝాన్సీ, మరోవైపు శారద రేపిన ఆలోచనల దుమారం ఓ రూపం దిద్దుకోక ముందే రుద్రమ శలవులయి పోయాయి. యూనివర్సిటీ చేరుకొంది మళ్ళీ!




ఆర్ట్సు కాలేజీ దగ్గర బస్సు దిగింది రుద్రమ. రెండు అడుగులు నడిచిందో లేదో కారు ఆమె పక్క నుంచి కాలేజీ గేటులోకి దూసుకొని పోయింది.

"హాయ్" అంది అందులోనుంచి తొంగి చూస్తూ సంధ్యారాణి.

రుద్రమ మొదట్లో లేడీస్ హాస్టల్‌లో చేరింది. కానీ ఆర్థికంగానే కాక చాలా విధాల అక్కడ యిబ్బందిగా తోచింది. అంచేత వూళ్ళో ఎక్కడన్నా చిన్నగది తీసుకొని వంట ప్రారంభిస్తే బాగుంటుందనుకొంది.

కానీ క్లాసులో ఆ మాట ఎవరితోనన్నా అనాలంటే భయం! ఆ వూరి వారు కాని వాళ్ళలో తన క్లాస్‌మేట్స్‌లో సంధ్యారాణి, మార్కండేయులు తప్ప మిగతా అంతా హాస్టలు జీవులే.

"నువ్వెక్కడ వుంటావ్ ?" సంధ్యారాణిని అడిగిందో రోజు.

సంధ్యారాణి రుద్రమ వైపు అదో రకంగా చూచింది. సన్నగా నవ్వుతూ అంది "బీచ్ ఒడ్డున"

అది ఎగతాళి! రుద్రమ కొంచెం చిన్నబుచ్చుకుంది. అది గ్రహించిన సంధ్యారాణి ఓదారుస్తున్నట్లు అంది "మేము సినిమా వాళ్ళం కదా ? 'యిందుగలడందు లేడని' అన్నట్లు ఎక్కడైనా వుంటాం. ఇక్కడ మా వాళ్ళు వున్నారులే"

సినిమా కుటుంబంలో మనిషి. నేరుగా సమాధానమిస్తుందా?

ఆ తర్వాత మార్కండేయులతో పరిచయమయ్యాక అతనితో అసలు విషయం డైరెక్టుగా చెప్పింది.

"నాకు తెల్సినవాళ్లు వున్నారు. వాకబు చేస్తాను" అని చెప్పి కొన్ని రోజుల తర్వాత రూము కుదిరినట్లు చెప్పేడు.

"ఇల్లు కలవాళ్ళు చాలా బీదవాళ్ళు. ఆ యిల్లే వారి జీవనాధారం. అంచేత మీకు అన్ని సౌకర్యాలు అక్కడ వుండక పోవచ్చు. కానీ మీకు తోడూ నీడగా వుంటారు"

ఆ గదిలో చేరిపోయింది రుద్రమ.

"మార్కండేయుల్తో జోడీ కట్టేక హాస్టలు వదిలేసి స్వంత కాపురంపెట్టేవు! ఏమిటి కథ ?" సంధ్యారాణి ఓసారి సర్దాగా అడిగింది. కానీ రుద్రమ జవాబివ్వలేదు.

రూములో స్వంత కాపురంలో పూర్తిగా సెటిల్ అయ్యేలోగానే పరీక్షలు దగ్గిరికొచ్చాయి. చదువు-పరీక్షలు-ఆ తర్వాత శలవులకు వూరి కెళ్ళటం-ఒకదాని తర్వాత ఒకటి జరిగిపోయాయి.

సెలవులకు వెళ్ళే ముందు రూము ఖాళీ చేయలేదు. అంచేతే యిప్పుడు యిబ్బంది లేకుండా పోయింది. ఊరి నుంచి వస్తూనే రూములో దిగింది. రూమంతా సర్దుకుంది.

"ఈ పూటకి మా యింట్లో భోజనం చేయమ్మా! మళ్ళీ యిప్పుడు వంటేం చేసుకొంటావ్?" యింటి యజమానురాలు భోజనం చేసిందాకా వదల్లేదు రుద్రమను.

"మార్కండేయులు ఎలాంటి వాడమ్మా? మంచివాడేనా?" అన్నం తింటుండగా యింటి యజమానురాలు కాళి

కాంబ మెల్లగా అడిగింది. పేరుకు తగ్గట్టు కాకుండా ఆమె చాలా శాంతిమూర్తి. మాటల్లో చేతలలో కూడా ఆమె మంచి తనం స్పష్టంగా కన్పిస్తుంటుంది.

"అలా అడిగేనని అన్యథా భావించ కమ్మా, ఏం లేదు. మా అక్కయ్య కూతుర్ని అతని కివ్వాలనుకొంటున్నారు. నలుగుర్నీ విచారించుకోవాలిగా?"

అకస్మాత్తుగా కొరపోయినట్లయింది రుద్రమకు. భోజనం మింగుడు పడలేదు!

"మంచివాడేననుకో. నాకు తెల్సు. ఎటొచ్చీ నిలవనీడ కూడా లేనంత పేద వాడు. పెద్ద సంసారం. ఇంటి బాధ్యత నెత్తినుంది. పెద్దవాడుగా? ఇక పిల్ల ఏం సుఖపడుందా అని ఆలోచిస్తున్నాం"

పేదవాళ్ళలో కూడా మరో రకం పేద వాళ్లు. కొద్ది పేదవాళ్లు! ఎన్నెన్ని ఆలోచనా ధోరణులు? ఎందుకిదంతా? సుఖం... భవిష్యత్తులో సుఖం కోసం ఆలోచన!

"మార్కండేయులు కాలేజీలో కన్పిస్తే ఓసారి నేను కన్పించమన్నానని చెప్పమ్మా? అతని అభిప్రాయం కూడా తెల్సుకోవాలిగా?"

అంటే యింకా అతనితో ప్రస్తావించ లేదన్న మాట!

మార్కండేయులు కన్పిస్తాడేమోనని చూస్తూ మేడమెట్లు ఎక్కుతోంది రుద్రమ!

"హాయ్..."

సంధ్యారాణి!

సినిమా నటిలా డ్రెస్సు - మొహాన పులుముకొన్న నవ్వు!

"శుభాకాంక్షలందుకోవే సుందరీ ముందు"

చాచిన ఆమె చేతిలో చెయ్యి కలిపింది రుద్రమ. ఓ వైపు ఆశ్చర్యం!

"ఎందుకా అని ఆశ్చర్యపోతున్నావా? నీ పెళ్ళి నిర్ణయమయిపోయిందిటగా? అందుకు"

రుద్రమకు కోపం వచ్చింది. తన బీదరికాన్ని, పెళ్ళి చేసుకోలేని అసహాయతపై ఎగతాళి! సంధ్యారాణి ఎప్పుడూ అంతే. ఇతరులను ఎగతాళి చేస్తూ తన అతిశయాన్ని చాటుకొంటుంది.ఆనందిస్తుంటుంది.

"నీకు డబ్బుంది కదా అని మమ్మల్ని ఎగతాళి చెయ్యకు సంధ్యా" చెయ్యి వెనక్కి తీసుకొంటూ ప్రసన్నంగానే అంది.

"స్టాప్ స్టాప్... సోషలిస్టు అరుపులు అరవకు. కాలేజీలో ధనిక బీద వ్యత్యాసాలు లేవని నాకు తెల్సు. నేనసలు ఎక్కడా వాటిని పాటించను"

నటన! ప్రతి నిమిషం ఆ భేదాన్ని పాటిస్తుంది ఆమె!

"కానీ నువ్వు కారులో వస్తావు. నేను బస్సులో వస్తాను. నువ్వు కట్టే చీరెల ఖరీదుకు నేను కట్టే చీరల ఖరీదుకుమధ్య చాలా పెద్ద క్లాస్ డిస్టెంక్షన్ వుంది. నీకు పెళ్ళయింది. నాకు పెళ్ళి కాక చదువుకోవటానికి వచ్చాను. నువ్వు సరదా కోసం చదువుతున్నావు. ఈ కఠిన సత్యాలు కాదంటే పారిపోవుగా?"

"డబ్బున్నవాళ్ళంటే నీకూ అసూయే నన్నమాట!"

"నాకేం అసూయ లేదు. నీకే బీద లంటే లోకువ"

"ఇంకా ఏమోననుకొన్నా, నీ పుర్రెలో కూడా చాలా ఆలోచనలు వున్నాయే! యివన్నీ నీ స్వంతాలా? లేక మార్కండేయులు నీ బుర్రలోకి ఎక్కిం

చావా ?"

మార్కండేయులు ప్రసక్తి ఆ సందర్భంలో అలా రావటం అసలు యిష్టం లేకపోయింది రుద్రమకు. చిరాకు వేసింది.

"సోషలిస్టు కబుర్లు, బీదల ఏడుపులు ఏడుస్తారు కానీ మీకు సెన్సాఫ్ హ్యూమర్ లేదే రుద్రమా. నువ్వేమన్నా అను. జీవితంలో శారీరక సుఖాలతో పాటు, మానసిక ఆనందం ఎంత అవసరమో, మనిషికి పరీక్షల్లో మార్కులు రావటంతో పాటు సెన్సాఫ్‌హ్యూమర్ కూడాఅవసరం అంటాన్నేను. పెళ్ళి ప్రసక్తి తమాషాగా ఎత్తితే నీ చరిత్ర అంతా చెప్పేసుకొన్నావ్? అసలు విషయం ఇప్పుడు విను. నీకో ఫస్టు మార్కు వచ్చింది ప్రీవియస్‌లో. అందుకు కంగ్రాట్స్-"

రుద్రమకు అదికాస్త ఆశ్చర్య కరమైన వార్తే! తనకు మంచి మార్కులు వస్తాయని తెల్సు. కాని ఫస్టు మార్కు మార్కండేయులుకి, తనకి సెకండు మార్కు వస్తుందనుకొంది. కానీ ఇదేమిటి!

"మార్కండేయులు విషయం కదూ ఆలోచిస్తున్నావ్? అతను మా గ్రూప్‌లో చేరిపోయాడు. ఆ చేతిత్తేసిన మార్కుల వారి గ్రూపులో"

స్నేహితురాళ్లెవరో రావటంతో ఆ ప్రకరణం అంతటితో ముగిసింది.

కొత్త కొత్త వార్తలు!

క్లాసులో ఇద్దరు విద్యార్థులకి సంబంధాలు కుదిరేయి! పెళ్ళి కొడుకులై వచ్చాడు.

"కట్నం ఎంతో? మరో సంవత్సరం ఆగితే ఇంకాఎక్కువ కట్నం వచ్చేదిగా!" ఎవరో ఆడపిల్ల హేళన.

విద్యార్థిని ఒకతెకు సంబంధం కుదిరి తప్పిపోయింది. మరో విద్యార్థిని శలవుల్లో ఓకాస్త బ్రేక్ చేసింది. పెళ్ళి చూపుల పేరుతో. శలవుల రెండు నెలల్లో ఆమెను యిరవై మంది చూసిపోయారు. ఒక్క సంబంధమూ కుదరలేదు !

సుధాకరమూర్తి రావటంతో టాపిక్ మారింది. అతను వచ్చీ రావటంతోనే బాంబు పేల్చాడు. తలా ఓ కరపత్రం పంచిపెట్టాడు. ముందుగా సంధ్యారాణికి యిచ్చేడు.

''నా ఎన్నికల ప్రచారం మన క్లాసు నుంచే ప్రారంభిస్తున్నా. ప్రారంభకురాలు సంధ్యారాణి''

అతను యూనియన్ ఎన్నికలకు నిలబడబోతున్నాడు ! కాలేజీ తెరిచిన రోజే ప్రచారం ప్రారంభించాడు.

''మిమ్మల్నెవరినీ ముందుగా సంప్రదించకుండా ఈ నిర్ణయాన్ని తీసుకున్నందుకు క్షంతవ్యుడిని. కాని, డ్రమెటిక్‌గా కాలేజీ తెరిచిన రోజునే నా నిర్ణయాన్ని బహిర్గతం చేయాలన్న వుద్దేశంతో ఈ సాహసాన్ని చేశాను. మన్నించాలి.'"

"ఇంత అకస్మాత్తుగా ఈ బుద్ధెందుకు పుట్టినట్లో ? అందుకు కారణం వుంది. మన పరీక్షా ఫలితాలు, మార్కుల వివరాలు చూశాక నా గుండె మండిపోయింది. యూనివర్సిటీ కాంపస్‌లో 'కాకాయిజం' ఎంతగా విస్తరించిందో బోధపడింది. ఈ ధోరణిని అరికట్టాల్సిన అగత్యం కనపడింది. అందుకని ధైర్యంగా నేను ముందుకొచ్చాను."

"అంటే నీకు థర్డు క్లాసు మార్కులొచ్చాయని గుర్రా ?"

"కాదు. ఆ మాటకొస్తే నాకు థర్డు క్లాసన్నా రావటమూ అన్యాయమే. నేనసలు ఏమన్నా రాసి చస్తేగా ? కాని మన

మధ్య మణిలా మెరిసే మార్కండేయులు లాంటి మేధావికి థర్డు క్లాసు రావటం దారుణమైన విషయం కాదా? ఈ అన్యాయాన్ని సహిస్తూ ఊరుకోవల్సిందేనా ? ఈలాంటి మార్కండేయుళ్ళు యూనివర్సిటీలో ఇంకెందరున్నారో ? స్వంత ఆలోచనలు, స్వతంత్రభావాలు వున్న మార్కండేయులులాంటి వాళ్ల ప్రొఫెసర్ల సంకుచిత ధోరణులకు బలి కావల్సిందేనా ?"

ఎవరూ చప్పట్లు కొట్టలేదు. కాని ఆశించిన విధంగా మార్కులు రాని వాళ్ళ మొహాలలో ఏదో ఉత్సాహం కనుపించింది.

"ఎలక్షన్లో నా నినాదం ఇదే–మేధావుల నిరంకుశత్వం నశించాలి. ప్రొఫెషనల్ ఇంటెగ్రిటీ పెరగాలి."

బెల్లయింది. రెండవ సంవత్సరంలో మొదటి క్లాసు జరగబోతోంది. నోటీస్ బోర్డులో వున్న టైం టేబిల్ ప్రకారం ఆ క్లాసు డాక్టర్ రామ్‌మోహన్‌గారిది.

కానీ ఆయన ఎంతకూ క్లాసులోకి రాలేదు.అదిఆయనకు మామూలే !

"వేలకు వేలు జీతాలు తీసుకొని, ప్రొఫెసర్లనీ, రీడర్లనీ బిరుదులు తగిలించుకొని క్లాసులు కూడా తీసుకోని జనం తయారయ్యారు. అదేమంటే విక్టిమైజేషన్ ఈ ధోరణిని ఎదిరించాలి. మనకు రెగ్యులర్‌గా పాఠాలు చెప్పేలా చూడాలి. అది మన హక్కు, ప్రొఫెసర్ల, రీడర్ల దయాధర్మ బిక్ష కాదు."

సుధాకర మూర్తికి పాఠాల మీద ఈ శ్రద్ధ ఎందుకు, ఎలా వచ్చినట్లు ?

సరిగ్గా అతని వుపన్యాసం వేడెక్కుతుండగా వచ్చాడు డాక్టర్ రామ్‌మోహన్.

రామ్‌మోహన్ సీనియర్ రీడర్. మూడ్ కుదిరి పాఠం చెప్పటం మొదలు పెడ్తే కాలాన్నే మర్చిపోతాడు. శ్రోతలను మరపింపచేస్తాడు. తెలుగు వ్యాకరణాన్ని కూడా రసవంతమైన నవలను చేసి చెప్ప గల దిట్ట.

కానీ ఆయనకెప్పుడోకాని ఆ మూడ్ రాదు. అసలు కాలేజీకి ఎప్పుడు వస్తాడో, ఎప్పుడు వెళ్తాడో ఎవరికి తెలియదు. ప్రొఫెసర్‌కూడా ఆయన్ని ఏమీ అనడు. ఎందుకంటే ఆయనకు ఉన్నత వర్గాలలో పలుకుబడి వుంది. 'మందు' స్నేహాలు జాస్తి.

ఆయనకు మందు మరో ప్రాణమని చెప్పుకొంటారు.అందుక్కారణంగా ఓ కథ కూడా చెప్పుకొంటారు.

రామ్‌మోహన్ అందంగా వుండడు. ఓ విధంగా అనాకారికూడా అతని భార్య అందంగా వుండేదిట. కొంతకాలం కాపురం చేసి పుట్టింటికి వెళ్ళిపోయింది. ఆమె పుట్టింటి వారు ఐశ్వర్యవంతులు. ఆమె తండ్రికి హైదరాబాద్‌లో పెద్ద వ్యాపారం హైదరాబాద్‌లో ఆమె హైక్లాస్ సొసైటీలో తిరుగుతుంటుంది. ఎన్నో సాంఘిక సేవా సంస్థలతో, సంస్కృతీ సంఘాలతో సంబంధం వుంది.

భార్య వెళ్ళిపోయిన కొత్తలో విడాకులు తీసుకోవడానికి ప్రయత్నించాడు. డాక్టర్ రామ్‌మోహన్. కానీ ఆమె అందు కంగీకరించలేదు. "నాకు నువ్వు కట్టిన మంగళసూత్రం అవసరం ఎంతైనా వుంది. మొగవాడివి–పైగా పెద్ద రీడర్‌వి. భార్యల్నే కొనుక్కోలేవా ?" అందిట.

అప్పటి నుంచి రామ్‌మోహన్ మందుకి అలవాటు పడ్డాడు. భార్య సలహా ప్రకారం రోజుకో భార్యను అవసరమైతే కొనుక్కొంటాడుట !

ఈ కథ ఎంతవరకూ నిజమో కాని,

ప్రొఫెసర్లందరూ విద్యార్థులు ఇళ్ళకి రావాలని కోరుకుంటారు. వస్తే సంతోషిస్తారు. అయితే రామ్మోహన్ అందుకు వ్యతిరేకం. ఎవరైనా విద్యార్థి ఇంటికి వస్తానన్నా వద్దని ఖరాఖండీగా చెపాడు. ఒకవేళ ఎవరైనా వెళ్ళినాతలుపు లోపలో, బయటో తాళం వేసేవుంటుంది.

అతను కాలేజీలో లేడీస్టూడెంట్సువైపు కన్నెత్తి చూడడు. ఎంతో అవసరమైతే తప్ప మాట్లాడడు. కాలేజీలోచూస్తేఅతను స్త్రీ ద్వేషిగానో, లేక ఏ ఋష్యశృంగుడి లాగో అగుపిసాడు.

''ఏమిటోయ్! ఉపన్యాసం ఇస్తున్నావా? నన్నుగురించేనా ?" క్లాసులోకి వస్తూనే నవ్వుతూ అన్నాడు రామమోహన్ సుధాకరమూర్తివైపు చూస్తూ. సుధాకరమూర్తి జవాబుకు తడముకొంటున్నాడు.

"నాకు తెల్సులే. నీలో పొలిటీషియన్ లక్షణాలున్నాయి కూర్చో"

అంత మహానాయకుడు మారు మాట్లాడకుండా వెళ్ళి కూర్చున్నాడు.

"నిజమే నేను క్లాసులు సక్రమంగా తీసుకోను. అందుక్కారణాలు అడక్కండి. క్లాసు తీసుకోటం నా ధర్మం. కానీ క్లాసు తీసుకోనప్పుడు నన్నే నేరుగా నిలేసినేరుగా అడగొచ్చుగా? సభలు–సమావేశాలు – ఆందోళనలు – తీర్మానాలు ఎందుకు ? ఆల్‌రైట్. ఇకనుంచి సుధాకరమూర్తి అభీష్టం ప్రకారం క్లాసులు తీసుకొంటా. ఒకవేళ తీసుకోకపోయినా నన్ను నిలేసి తీసుకువచ్చే బాధ్యతను, అధికారాన్ని సుధాకరమూర్తి కిస్తున్నా. ఏమంటావ్ సుధాకరమూర్తీ ?"

"యస్ సార్! కానీ నా వుద్దేశం..."

"నీ వుద్దేశాన్ని నేను శంకించటంలేదు. నీ వుత్సాహాన్ని అభినందిస్తున్నా"

ఆ రోజు రామమోహన్ మంచి 'మూడ్'లో క్లాసు చెప్పేడు. క్లాసు అయ్యేసరికి అందరి గుండెల్లో ఏదో రసానుభూతి. ఆర్ద్రత జరిగింది. అంతా దాదాపు మర్చిపోయారు. కానీ సుధాకరమూర్తి మాత్రం ఏదో గునుస్తూనే వున్నాడు.

"క్లాసులు రెగ్యులర్‌గా తీసుకోవాలని ప్రొఫెసర్ దగ్గరికి డిప్యుటేషన్ వెళ్దాం."

సంధ్యారాణితో సహా ఎవరూ సుముఖత చూపలేదు.

"ఈ సమయంలో మార్కండేయులు వుంటే బాగుండేది ?"

మార్కండేయులు ఎందుకు రాలేదో అనుకొంది రుద్రమ.

సాయంకాలం బస్ స్టాప్ దగ్గరికెళ్ళబోతుంటే కారువచ్చి పక్కన ఆగింది.

"ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను. రా రుద్రా..."

కారు తన ప్రివిలేజ్ అనుకునే వ్యక్తి, ఇన్నాళ్ళుగా ఎవరినీ కనీసం దగ్గరకు రానీయని వ్యక్తి! తనకు ఇవాళ ఎందుకు లిఫ్ట్ ఇస్తానంటున్నది ?

"ఎందుకు బస్సులో వెళ్తాగా ? థాంక్స్"

"ఏం కోప మొచ్చిందా?" అంటూ కారు దిగి బతిమలాడి రుద్రమను కారు ఎక్కించుకొంది.

"ఒట్టి రాజకీయాల మనిషి అనిపించుకొన్నాడనుకో సుధాకరమూర్తి. మరీ క్షణక్షణానికి రంగులు మార్చే వ్యక్తులంటే నాకు చిరాకనుకో."

ఈమె సంగతేమిటి ? ఇద్దరూ ఒకే తానులో గుడ్డలు కాదూ ?

"పోయిన సంవత్సరమంతా పిచ్చి పిచ్చి ప్రేమ వేషాలు వేసి నా ప్రాణం

తీశాడనుకో. నన్ను పెళ్ళి చేసుకొని సినిమా ఏక్టరవుదామని అతని ఆశ. సినిమాలో హీరో వేషాలు అక్కడ కుప్పలో పోసి వున్నట్లు? విసిగిపోయి చివర్లో చిన్న టోకరా ఇచ్చాను. నువ్వు విన్నావా?"

"టోకరానా? అంటే?"

అనుకోకుండానే విన్నానన్నట్లు తల వూపింది రుద్రమ.



"అయితే నిజంగానే నాకు పెళ్ళి అయిందని నమ్మేశావా?

"పెళ్ళి కాకుండానే పెళ్ళి అయిందని చెప్పేవా అయితే?" అన్నట్లు విస్తుపోయి చూచింది రుద్రమ.

"పెళ్ళి అనేది ఇలాంటి విలన్‌గాళ్ళ బారినుంచి తప్పించుకోటానికి ఉపయోగపడే రక్షరేకు లాంటిదే. ఆడదానిమెళ్ళో

మంగళ సూత్రం వుందన్న భావనే - పులులు, తోడేళ్లు, నక్కల్లాంటి మను షుల్ని కూడా గొర్రెలుగా, పిల్లులుగా, గేదెలుగా మారుస్తుంది. చూశావుగా అంతలోనే అతనెలా ప్లేటు మార్చాడో?"

"అయితే నీకు నిజంగా పెళ్లికాలేదా?" ఈ తడవ వాచ్యంగా అడిగింది రుద్రమ. సంధ్యారాణి పకపకా నవ్వింది.

"అయితే ఆ ఫూల్‌తోపాటు మీరూ బోకరా తిన్నారన్నమాట ? నాకు పెళ్ళి కాలేదు, అయినా అయినట్లే లెక్క. శశాంక తెల్సుగా ?"

తెల్సునన్నట్లు తల వూపింది రుద్రమ. సంధ్యారాణి మళ్ళీ పకపకా నవ్వింది.

"నాకు మగాళ్ళని ఫూల్స్ చేయట మంటే మహా సరదా అనుకో. శశాంకను సినిమా దర్శకనిర్మాతగా పరిచయంచేశాను సుధాకరమూర్తికి.గొర్రెలా తల వూపేడు. ఆశగా,ఆరాధనగా అతని వైపు చూశాడు. అయితే నిజానికి అతను నిర్మాత కాదు, దర్శకుడూ కాదు. ఆ రెండూ వాళ్ళ నాన్నవి. శశాంక ఇండస్ట్రియలిస్ట్"

కారు ఆగింది. ఇంతసేపు రుద్రమ గమనించలేదు. కారు ఏ దోవన పోతు న్నదో. కానీ అది సముద్ర తీరాన కొండ మీద వున్న ఓ చక్కటి బంగాళా కాంపౌండ్‌లో దూరి పోర్టికోలో ఆగింది.

"దిగు యిదే మా కుటీరం ఐమీన్ మా అత్తగారి కుటీరం"

ఆ యింట్లో రుద్రమ ఏమి చూసిందీ వర్ణించటం అనవసరం. కానీ డబ్బుతో సుఖాలు,సౌకర్యాలు ఎన్నెన్ని కొనుక్కో వచ్చో తెల్సుకొంది.

"మా కుటీరం ఎలా వుంది? అందంగా లేదు కదూ ?"

అందానికి అంతెక్కడ? నగ్న సౌందర్యం గొప్పదా? అలంకరణ భూషిత మైన సౌందర్యం గొప్పదా? సుఖానికి కొలమానం ఏమిటి?

ఫ్రిజ్ తెరిచి ఫ్రూట్ సలాడ్ పెట్టింది. అత్తగారిని పరిచయం చేసింది. మామ గారి సినిమా చరిత్రను బొమ్మల్లో చూపే ఆల్బమ్ చూపించింది.

ఏది చేసినా స్నేహితురాలి ప్రతి చర్య వెనుక అతిశయం, ప్రదర్శనా కాంక్ష కన్పించాయి కానీ, అభిమానం కన్పించ లేదు రుద్రమకు.

"ఇందాక కారులో ఆ విషయాలన్నీ నీకెందుకు చెప్పానో తెల్సా ?"

అదే ఆశ్చర్యం!

"సుధాకరమూర్తి ప్లేటు మార్చాడు. ఈ క్రొత్త రాజకీయ చదరంగంలో ఎత్తుగా నీ వెనుక పడవచ్చు. నిన్ను పెళ్ళి చేసుకొంటానని అంటాడేమోనని కూడా నా అనుమానం. కానీ పెళ్ళి చేసుకోదనుకో. ఎందుకు చేసుకోదంటు న్నానో కారణాలు నువ్వే ఆలోచించుకో. నేను చెప్పను. కానీ నువ్వు మాత్రం జాగ్రత్తగా వుండు. రాజకీయాల మను ష్యులు రంగులు మారుస్తుంటారని తెల్సుగా ?"

రాజకీయ వ్యక్తులు రంగులు మారు స్తుంటారు. సినిమా వ్యక్తులు నిజ జీవితంలో కూడా నటిస్తుంటారు. తెలియ కేం? అనాలనిపించింది కానీ నిగ్రహించు కొంది.

బయల్దేరటానికి వస్తుండగా సంధ్యా రాణి నవ్వుతూ అంది.

"అనవసరంగా మా కుటీరానికి తీసు కొచ్చి నిన్ను శ్రమ పెట్టాననుకొంటాను. అందుకే నేను స్నేహితురాళ్ళను ఇక్కడికి తీసుకురాను. నీకు మా కుటీరం నచ్చి

నట్లు లేదు కదూ ?"

స్నేహితురాలి నటనను,అతిశయాన్ని యిక తట్టుకోలేక పోయింది. సహనానికి వ్యతిరేకంగా మనసు తిరగ బడింది.

"నువ్వు ఇప్పుడెలాగూ బయల్దేరు తున్నావుగా? నా గదికి రా. చూసి ఎలా గుందో చెప్పు. అప్పుడు నీ కుటీరం ఎలా గుందో నేను చెప్తాను"

సంధ్యారాణి మొహం మాడిపోయింది. ఏదో పనివున్నట్లు లోపలి కెళ్ళింది.

"ఏమీ అనుకోకు రుద్రా. ఇంట్లో పనొచ్చింది. డ్రైవర్ మీ యింటి దగ్గర డ్రాప్ చేస్తాడు. నేను మరోసారి వస్తానుగా ?"

పోర్టికోలోకి వచ్చారు స్నేహితు రాళ్ళిద్దరూ.

"డ్రైవర్ ! అమ్మాయిగారిని డ్రాప్ చేసిరా."

డ్రైవరు బేక్‌డోర్ తెరిచి పట్టుకొని నిల్చున్నాడు వినయంగా.

పనిగట్టుకొని తనని ఇంటికి తీసు కొచ్చిన మనిషికి, తనను గౌరవంగా ఇంటిదగ్గర దింపాల్సిన బాధ్యత లేదా? అనవసరంగా ఎందుకు తనని ఇలా పిలిచి అవమానిస్తున్నది? ఆత్మాభిమానం పైకి వచ్చి అనుకొంది. దయా ధర్మంగా స్నేహితురాలు చూపుతున్న ఔదార్యాన్ని తిరస్కరించాలని బుద్ధిపుట్టింది. కారు లేకపోతేనేం? ఏ టాక్సీలోనో,ఆటోలోనో పోలేదా?

అయితే పుట్టుకతో వెంటపెట్టుకొని వచ్చి పరిస్థితుల ప్రభావంవల్ల తనతో పాటు పెంచుకొన్న శాంతం, సహనం, ఓర్పు ఇత్యాది మంచి గుణాలు ఆ ఆలోచనల పీక నొక్కేయి. అలవా టైన రీతిలో స్నేహితురాలి చర్యను తాత్కాలికంగా క్షమించేసింది.

మౌనంగా కారు ఎక్కి కూర్చుంది.




రెండు నెలలు గడిచాయి.

ఈ లోగా ఇంటి యజమానురాలు కాళికాంబకు చాలా దగ్గరైంది రుద్రమ.

కాళికాంబ మధ్య వయసు మనిషి. భర్త ఏదో ఫ్యాక్టరీలో పనిచేస్తూ ప్రమాద వశాత్తు చనిపోయాడు. అప్పటికి ఆమె ఇద్దరు పిల్లల తల్లి.

ఆ ఇల్లు, పిల్లలు, కంపెనీవాళ్ళు ఇచ్చిన డబ్బు, భర్తతో గడిపిన రోజుల స్మృతులూ-ఇవే ఆమెకు మిగిలినవి. ఒకరి జోలికి పోదు. ఒక పరుష వాక్యాన్ని మాట్లాడదు. పిల్లలకు చదువు చెప్పుకోవటం, లేకపోతే ఏదో పుస్తకాలు చదువుకోవటం ఇదీ ఆమె వ్యావృత్తి. ఉన్నదాంతో సర్దుకుపోవటం ఆమె సుగుణం.

స్వభావాల్లో సామ్యం, స్థితిగతుల్లో ఏకత్వం ఇరువురి వయసుల్లో వ్యత్యాసాన్ని త్వరలోనే తొలగించింది.

కాళికాంబకు ఓదార్పు రుద్రమ. రుద్రమకు ధైర్యం కాళికాంబ.

ఇద్దరూ ఆ స్థితికి చేరుకొన్నాక ఓ రోజు రుద్రమ అడిగింది—

"జరిగిందేదో జరిగిపోయింది. మరి ఇప్పుడు మీ జీవిత ధ్యేయమేమిటి?"

కాళికాంబ నిట్టూర్పులు విడవలేదు.



విచారాన్ని మొహానికి పులుముకోలేదు. అదో విధంగా నవ్వింది.

"పిల్లలున్న ఏ విధవరాలు జీవితానికైనా ఒకటే ధ్యేయం వుంటుంది రుద్రాంబా! ఆ పిల్లలు పెద్దవాళ్ళు కావాలి. ప్రయోజకులు కావాలి. తండ్రికి, తన వంశానికి పేరు తేవాలి. కనీసం అప్రదిష్ట తీసుకురాకపోయినా చాలు. వయసు మళ్ళిన రోజుల్లో తల్లిని కనిపెట్టి వుంచే మరీ సంతోషం. ఇంతకన్నా ఏ తల్లి మాత్రం బిడ్డల నుంచి మరేం కోరుకొంటుంది"

కానీ ఆమె కూడా మనిషే కదా? కోరికలన్నీ అప్పుడే నశించాయా?

"కోరికలకేమిటి రుద్రాంబా? విష సర్పాల లాంటివి. పాలు పోసి పెంచితే

మనకే ప్రమాదం. కాటు వేస్తాయి. వాలు కనుక్కొని కొట్టాల్సిన రీతిలో కొడ్తే చచ్చిపడి వుంటాయి. అయినా ఓ విషయం చెప్పనా? పెళ్ళి, మంగళసూత్రం కోరి కల్ని తీర్చుకోవటానికిచ్చే లైసెన్సు లాంటిది. బిడ్డలు పుట్టేక ఆ లైసెన్సుకు దానంతట అదే కాలం చెల్లిపోతుంది. కోరికలనేవి విషసర్పాలైతే, ఆ విషానికి విరుగుడు, మనిషికి అమృత భాండాలు బిడ్డలే రుద్రాంబా"

అంతంత మాత్రం చదువుకొన్న సాధారణ వ్యక్తి ఆమె. తనలాగా ఏ విశ్వవిద్యాలయంలోనూ చదువుకోలేదు. డిగ్రీలు లేవు. ఎవరు నేర్పేరివన్నీ?

"అయితే స్త్రీకి పెళ్ళి, పిల్లలు, వాళ్ళను పెంచటం తప్ప-జీవితంలో మరో అర్థం పరమార్థం లేదా?"

కాళికాంబ వాత్సల్యపూరితమైన నవ్వు నవ్వింది.

"పెద్ద పెద్ద మాటలు వాడుతున్నావు రుద్రా! సంఘ సేవలు చేసేవాళ్లో, దేశాన్ని వుద్ధరించటానికి కంకణం కట్టుకొన్నవాళ్ళో; తాత్వికులో చెయ్యాల్సిన ఆలోచనలు అవి. నాకెందుకు? ముందు నన్ను, నా సంసారాన్ని నేను వుద్ధరించుకోగలిగితే కదా యీ ఆలోచనల్ని గురించి పట్టించుకోవటానికి ? ఉట్టి కెగరలేనమ్మ స్వర్గాని కెగురుతుందా?"

తనకే తెలియని ఆవేశంలో కాళికాంబలో తనని ప్రొజక్ట్ చేసుకొని ఓ కథ రాసి ఏదో మాసపత్రిక పోటీకి పంపింది. కథ పేరు 'మధురానుభూతి' అని పెట్టింది. అప్పటికికాని ఆమె మనసులోని ఆరాటం శాంతించలేదు!

కాలేజీలో ఎలక్షన్ల సంరంభం విశ్వరూపం దాల్చింది. సుధాకరమూర్తి మొదలలోతున ఆ రొంపిలో దిగబడ్డాడు. 'కాంపస్‌లో కాకాయిజం' అంతం చేయటం, 'ప్రొఫెసర్ల సంకుచిత ధోరణులను' అరికట్టటం అన్న రెండు నినాదాలతో అతను దర్శీ ఓట్లు అభ్యర్థిస్తున్నాడు

అతని నినాదాలు చాలామందికి నచ్చాయి. కానీ స్వతహాగా అతను తెలివిగల విద్యార్థి కాదుగనుక ఆ నినాదాల వెనుక రాజకీయ ప్రయోజనాలున్నాయని ప్రచారం చేశారు ప్రతిపక్షులు.

సంధ్యారాణి ఎన్నికలు తనకేం పట్టనట్లు దూరంగా వుంది. ఆమె చెప్పినట్టే సుధాకరమూర్తి రుద్రమకు సన్నిహితం కావటానికి ప్రయత్నించాడు.

"కుల వ్యవస్థపై మీ అభిప్రాయాలేమిటి రుద్రమదేవిగారూ?"

"అంత పెద్ద విషయంపై నా అభిప్రాయానికి విలువేముంది మూర్తిగారూ! అయినా నాకు ఏ అభిప్రాయం లేదు"

"పోనీ ప్రేమను గురించి?"

"ప్రేమలు పలు రకాలు. పితృప్రేమ భాతృప్రేమ, పతిప్రేమ, పుత్రప్రేమ, యిత్యాది. ఇవన్నీ ఉదాత్తమైనవేకదా ?"

"నేనడుగుతున్నది యువతీయువకుల మధ్య ప్రేమ గురించి"

"ప్రేమ మంచిదే. అయితే దురదృష్టమేమిటంటే, యువతుల ప్రేమ తొంభై తొమ్మిది కేసుల్లో కన్నీళ్ళతో తడిసి మండిపోతోంది. యువకుల ప్రేమ యువతుల గర్భధారణలతో, అక్రమ సంతానోత్పత్తితో, ఆత్మహత్యలతో ముగుస్తోంది.

"నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను-పెళ్ళి చేసుకొంటాను అంటే మీరెలా ఫీలవుతారు?"

"ఈ సంవత్సరపు ఉత్తమ జోకు కింద తీసుకొని కాస్సేపు నవ్వు కొంటాను"

అలాంటి సమాధానాలను చంద్రమ నుంచి ఆశించలేదేమో – సుధాకరమూర్తి దెబ్బతిన్నాడు. ముఖ్యంగా చివరి సమాధానానికి.

"మీ బ్రైన్‌వాష్ చేసేదెవ్వరో? లేకపోతే మీలాంటివాళ్లు యిలా మాట్లాడరు. మిమ్మల్ని ప్రేమించి పెళ్ళి చేసుకొంటాననటం. జోకా మీకు? ఎంత దారుణంగా మాట్లాడుతున్నారండీ?" జాలిగా అన్నాడు.

"కోప్పడకండి మరి! మన మధ్యనున్న అంతరాలు మీకూ తెల్సు. వాటన్నిటిని దాటగలశక్తి మీకున్నా నేనా శక్తి లేని అభాగ్యురాలినే. మీరు ప్రేమించి పెళ్ళి చేసుకొంటాననగానే సరిపోతుందా? నేనూ ఆ పని చేయాలిగా? ఆ శక్తి లేని నాకు అది జోక్ కాక మరేమిటవుతుంది"

"పోనీలెండి ఆ విషయం! యిప్పుడేం మాట్లాడినా రాజకీయపు రంగు పూసే వాళ్లుంటారు. మీరు నన్ను సపోర్ట్ చేయక పోయినా ఫర్వాలేదు. ఓటు వెయ్యక పోయినా దిగులు పడను. కానీ మరీ నన్నింత దుర్మార్గుడి కింద తో సెయ్యకండి."

వెళ్ళిపోతున్న అతడిని వెనక్కి పిలిచింది చంద్రమ.

"క్షమించండి మూర్తిగారూ. మీ మనసును కష్టపెట్టడం నా వుద్దేశ్యం కాదు. నా ఓటు మీకు వేసాను. నాకు చేతనయినంతలో ప్రచారం కూడా చేసాను. కాని ప్రేమ, పెళ్ళిల ప్రసక్తి మాత్రం తీసుకురానండి. ప్లీజ్..."

ఎలక్షనులో సుధాకరమూర్తి చిత్తుగా ఓడిపోయాడు. అయినా చంద్రమని మాత్రం వదల్లేదు.

"మన విద్యార్థులు ఒట్టి ఫూల్సండీ చంద్రమదేవిగారూ! తమ సమస్యలకన్నా దేశ సమస్యలకు, ప్రపంచ సమస్యలకు ప్రాధాన్యతనిస్తారు. 'ఓట్లు కావాలంటే నిజాలు చెప్పకూడదురా' అని మా నాన్నగారు అనేవారు. నిజం చెప్పి ఓడిపోయాగా? రేపుఅబద్ధాలుచెప్పిఏయమ్మెల్యేనో అయి దేశాన్నే శాసిస్తాను. లేకపోతే సినిమా స్టారునయి అబద్ధాలను కళాత్మకంగా చెప్పి జనాన్ని మోసం చేస్తాను. మీపైన ఒట్టు. యిది నా శపథం. యిక నేను నిజాలు చెప్పను–మీతో తప్ప"

అలాంటి సమయంలో వున్నట్లుండి ఓ రోజు మార్కండేయులు దూకేడు. అప్పటికతన్ని క్లాసులో చాలామంది మర్చిపోయారు.

"ఫస్టు క్లాసు వస్తుందనుకొన్నాడుగా పిచ్చితండ్రి! అది కాస్తా వెనక్కి తన్నేయటంతో మొహం చెల్లక యింటి దగ్గరే వుండి పోయివుంటాడు."

అలాగా మొదట్లో అతడిని గురించి ఏమేమో అనుకొన్నా ఇప్పుడతని ప్రసక్తే రావటంలేదు క్లాస్‌మేట్స్ మధ్య.

"ఫ్రెండ్స్! మీ శలవు తీసుకోవటాని కొచ్చాను ఇప్పుడు. సంవత్సరంపాటు మీతో కల్సిమెల్సి వుండే అదృష్టం కలిగినందుకు సంతోషిస్తున్నా!" అన్నాడు మార్కండేయులు వస్తూనే.

"అంటే చదువు మానేస్తున్నారా? ఎందుకు?" సుధాకరమూర్తి ఉద్రేకంగా అడిగాడు.

"కారణాలు చాలా వున్నాయి. చెప్పుకొని లాభం లేదు?"

"మీరు చెప్పకపోయినా నాకు తెలుసు.



ఫస్టు క్లాసు వస్తుందని ఆశించారు మీరు. కానీ మీకు అన్యాయం జరిగింది. ఆ నిరాశా నిస్పృహలతో మీరీ నిర్ణయాన్ని తీసుకొన్నారు. అవునా?"

"సుధాకరమూర్తిగారికి నామీద అంత మంచి అభిప్రాయం వున్నందుకు సంతోషిస్తున్నా. కానీ కారణం అది కాదు. నేను ఆ మాత్రం మార్కులతోనన్నా పాస్ కావటం నాకే ఆశ్చర్యంగా వుంది. నేను అసలు ఫెయిల్ అవుతాననుకొన్నాను."

క్లాసంతా ఆశ్చర్యపోయింది. రుద్రమ సరేసరి!

"తన బీదరికమే ఫెయిలు కావటానికీ, చదువు మానెయ్యటానికీ కారణమని మార్కండేయులు ఉద్దేశం. కానీ అది తప్పు, మోసం అని నా నమ్మకం" అంది సంధ్యారాణి.

మార్కండేయులు నవ్వేడు చిత్రంగా. ఓ క్షణం మౌనం వహించాడు.

"సంధ్యారాణిగారు చాలా తెలివిగలది. అని అంగీకరిస్తున్నాను. ఐశ్వర్యం, బీదరికం కొంతకాలం పరిస్థితుల వత్తిడివల్ల సహజీవనం చేయవచ్చు. కానీ ఎప్పటికీ సమానాంతరాలేగా? కాకపోతే ధనవంతులు బీదరికపు పలు ముఖాలను పరిశీలించి, పరిశోధనలు జరిపి, విశ్లేషించి, మరింత ధనవంతులు కావటానికి ఆ విజ్ఞానాన్ని వాడుకోవచ్చు. అలాగే బీదవాళ్ళు ధనవంతుల భోగభాగ్యాలకు అసూయ చెంది, ఉద్రేకపు అరుపులు అరిచి, ఆకలి బాధతోపాటు మరిన్ని బాధలు పెంచుకోవచ్చు. ఎవరి జీవన ధోరణి వారిదేగా ? సామీప్యత ఏనాటికి చేకూరేను?"

ఎవరూ నోరు మెదపలేదు.

"యూనిర్సిటీలో కొన్ని సమస్యలు చక్కబెట్టుకుపోవటానికి వచ్చాను. అందరి దగ్గరా శలవు తీసుకొంటున్నాను."

మార్కండేయులు వెళ్ళేముందు తనతో ప్రత్యేకించి మాట్లాడుతాడనుకొంది. కానీ అమెవైపన్నా చూడకుండా వెళ్ళిపోయాడు.

రుద్రమ మనస్సు చివుక్కుమంది. దాదాపు ఏడుపు వచ్చినంత పనైంది.

"చూశావుగా? ఆ సామాజిక వేదాంతిగారి ధోరణి. కనీసం నీవైపు కన్నెత్తైనా చూశాడా?" సంధ్యారాణి అవకాశాన్ని దొరకపుచ్చుకొని రుద్రమను ఎగసన తోసింది. కానీ రుద్రమ పైకి తేలలేదు. నవ్వి వూరుకొంది.

అయినా ఆమె ఎంత ప్రయత్నించినా భావావేశం తగ్గటంలేదు. అణిచిపెట్టేకొద్దీ ఎక్కువవుతోంది. ఎప్పుడో బిరడాను తన్నుకొని పైకి రావచ్చు.

అంచేత ఆమె తర్వాతి క్లాసుకు వెళ్ళకుండా, ఎవరితో చెప్పనైనా చెప్పకుండా బయటికి జారుకొంది. ఇంటికి బయలుదేరింది.

"రుద్రమదేవిగారూ !"

గుండెలనిండా ఆనందం! పులకింత!

'యూనివర్సిటీలో పనైపోయింది. మీ రాకకోసమే ఎదురు చూస్తున్నా. మీతో మాట్లాడకుండా వెళ్ళగలనా?"

ఆమె కళ్ళవెంట నీళ్ళు వచ్చాయి. కనబడకుండా పైట కొంగుతో అద్దుకొంది.

"అంత బాధ కలిగించానా మీకు ? మీతో మాట్లాడకుండా వెళ్ళిపోతానను కొన్నారా?"

"కాళికాంబగారు మిమ్మల్ని గురించి వాకబు చేసేరు. ఒకసారి ఎందుకు రాకూడదూ? నేనూ ఇంటికే వెళుతున్నా"

"క్షమించండి. మీరు చెప్పింది పాత విషయం. ఆమె నాకెందుకు కబురు చేసిందో ఆ వ్యవహారం ముగిసింది. పైగా నేను అర్జంటుగా వెళ్ళిపోవాలి."

అంటే కాళికాంబగారి బంధువుల అమ్మాయిని చేసుకోవటానికి నిరాకరించాడా ?

"మీకు అభ్యంతరం లేకపోతే లైబ్రరీ ముందర లాన్స్‌లో కాసేపు కూర్చుందాం. మీతో ఓ విషయాన్ని చర్చిస్తానని ప్రామిస్ చేశాను గుర్తుందికదా?"

అతనివెంట మౌనంగా నడిచింది.

లాన్‌లో మంచి చోటు చూసి కూచ్చు న్నారు.

"మీరు చదువెందుకు మానేస్తున్నారు? మార్కులెలా తక్కువచ్చాయి?" గద్గదిక స్వరంతో అంది రుద్రమ.

ఇద్దరి మధ్య చాలాసేపు మౌనం. అవతల సముద్ర ఘోష, చెట్టు పైన పక్షుల కిచకిచలు, రోడ్డుమీద బస్సులు తదితర వాహనాల రొద.

"అయితే మీరు మానసికంగా చాలా దూరం పోయారన్నమాట! నన్ను గురించి అంత బాధ పడుతున్నారంటే నన్ను ప్రేమించి నట్లేగా? నిజంగా నేనెంత దురదృష్టవంతుడినండీ రుద్రమదేవిగారూ! మనస్ఫూర్తిగా సత్యం చెప్తున్నాను. ఎన్నడూ నా దరిద్రాన్ని గురించి నేను ఇంతగా బాధ పడలేదు. భయపడలేదు. అసహ్యించుకోలేదు. నిరాశ చెందనూ లేదు. కానీ యీ క్షణంలో మీరు నా కోసం బాధ పడుతుంటే నాలో ఆ భావన లన్నీ ముసురుకొన్నాయి. నా దరిద్రం పట్ల అసహ్యం కలుగుతోంది. 'ఏం? నేనెందుకు ఉన్నతంగా ఆలోచించాలి? చాలామంది లాగా అడ్డుదారులు తొక్కి ఎందుకు ధనవంతుడిని కాకూడదు? నా సుఖాన్ని, స్వార్థాన్ని ఎందుకు చూసుకో కూడదు? బాధ్యతల బంధనాలని ఎందుకు తెగ గొట్టుకోకూడదు?' అని అనిపిస్తోంది. ఉద్రేకం వస్తోంది. ధన వంతులు, పేదవారు అన్న వ్యత్యాసా లెందుకుండాలి? సంధ్యారాణులకు, సుధాకరమూర్తులకు ఆ సుఖాలేం? మనకీ దిగుళ్లు, చింతనలు, వేదనలు ఏం? ధనవంతులను దోచో, హతమార్చో ఎందుకు సమ సమాజ స్థాపనకు దీక్ష వహించకూడదు?" అన్నంత కచ్చ కూడా వస్తోంది."

అతను ఉద్రేకం చెందాడు. ఆలోచన వేదనకు, వేదన అసహనానికి దారిచూపగా అందులో నుంచి వుద్భవించిన ఆవేశం, వుద్రేకం అది!

ఆ స్థితిలో మార్కండేయులు రుద్రమకు మరింత ఆకర్షణీయంగా కన్పించాడు. స్తబ్ధత్వం కన్నా చేతన సొగసైన దేగా?

"కానీ నేను మనిషినండీ! యుక్తా యుక్త వివేచన, ఆలోచన వున్న మనిషిని. ప్రతి మనిషి జీవితం కొన్ని శాశ్వత విలువలకు నిబద్ధమై నడవాలనీ సిద్ధాంతం చేసుకొన్న వాడిని. నిర్దిష్ట నిర్దిష్ట మార్గాలలో ఏదన్నా కానివ్వండి. కానీ విలువలు సంతరించుకోని జీవితానికి ముక్తేమిటండీ? ప్రయోజనమేమిటి? అంచేత ఆవేశకావేశాలకు, కేవలం స్వార్థానికీ భౌతిక సుఖాలకు బానిసను కాలేను. కనుక మీరు నన్ను క్షమించక తప్పదు."

అది అతని నిర్ణయం. అతడితో వివాహ మన్న ఆలోచనే లేదు.

అయినా చిత్రమేమిటంటే రుద్రమకు అతని పట్ల కోపం రాలేదు. కచ్చ పుట్ట లేదు. కనీసం దిగులన్నా వేయలేదు. తానేదో కోల్పోయానన్న బాధ కలగలేదు.

పైగా మనస్సుకు స్వాంతన చిక్కింది. చిత్త శాంతికి దగ్గరవుతోంది. ఇదేం వింత. 'తనసలు అతడిని ప్రేమించిందా? పెళ్ళి చేసుకొందామనుకొందా? అదంతా సత్యమా? భ్రమా? భ్రాంతియా?'

"మిమ్మల్ని నేను ప్రేమించానన్నారు గదా? అదెలాంటిది? అసలు ప్రేమ

స్వరూపం ఎలాంటిది ?" జిజ్ఞాస తప్ప ఆమె ఆ మాటలనడిగిన తీరులో మరో భావం ధ్వనించలేదు.

మార్కండేయులు ఆరాధనగా ఆమె వైపు ఆమె కళ్ళల్లోకి, ఓ క్షణం చూశాడు "ప్రేమ స్వరూపం ఎలాంటిదంటారా ? ఇలాంటిదేననుకొంటాను" అతను హేలగా దరహాసం చేశాడు.

"దయచేసి వివరించండి"

"ప్రతి విషయానికి రెండు స్థాయిలు కనీసం వుంటాయి. ఒకటి భౌతిక స్థాయి కంటికి గోచరమై స్పర్శాత్మకము,శరీరానుభవమూ అయినస్థాయి. రెండవది స్థూల దృష్టికి గోచరం కానిది, శరీర స్పర్శకు, అనుభూతికి అతీతమైన స్థాయి. ప్రేమ విషయంలోనూ యీ రెండు స్థాయిలూ వున్నాయి. చాలామంది ప్రథమ స్థాయిలోనే ఆగిపోతారు. సమస్యల వుచ్చుల్లో బాధల సుడి గుండాలలో యిరుక్కుపోయి సతమత మవుతుంటారు. ఈ ప్రేమ మలినమైనది. చావు పుట్టుకలు కలది క్షణ భంగురమైనది. క్షణ క్షణం కొత్త రుచులను కోరుకునే చపల చిత్త వృత్తి గలది. ఇలాంటి ప్రేమ పాశాలలో చిక్కుకొనే మనుషలు మాయా మోహాలకు బానిసలై పశు ప్రవృత్తిలో సంచరిస్తున్నారు. కష్టలు, కార్పణ్యాలు, ఆశ అసూయలు, యుద్ధాలు,మారణహోమాలు, ప్రేమ అని భ్రమపడ్డ యీ శారీరకస్థాయి వ్యామోహం నుంచే వుద్భవించాయి. వుద్భవిస్తున్నాయి. రెండో దశలో వుద్భవించే ప్రేమ నిర్వికారమైనది. స్థిరమైనది. నశ్వరమైనది. త్రిగుణా తీతమైనది."

"అయితే నా ప్రేమ స్థాయి యీ రెంటిలో ఏది?"

"ప్రథమ దశను మీరు దాటిపోయారు. లేదా అది మీకసలు తెలియదు. రెండవ స్థాయికి సంపూర్ణంగా చేరుకోలేదు. అందుకే ఒక వైపు బాధ, మరో వైపు నిర్విచారం మీకు"

"మీ దృష్టిలో స్త్రీ జీవితం యొక్క అర్థం, పరమార్థం ఏమిటి?"

"స్త్రీ జీవితానికే కాదు ఏ మనిషి జీవితానికైనా యీ రెండూ అవసరమే. అర్థం భౌతికమైనది. పరమార్థం భౌతికాతీతమైనది. అయితే వేగంగా పయనిస్తున్న యీ యంత్ర యుగంలో అర్థాన్వేషణలోనే మనిషి కాలమంతా గడచిపోతుందే? స్త్రీ అంటే అసలు ఎవరండీ? సాంఘికంగా మూడు తరగతులు మనం అనుకొంటున్నాం కదా ? ధనికులు, పేదలు, మధ్య తరగతి వారని. వీరిలో సంపన్న కుటుంబాలలో స్త్రీ లకు చాలా స్వేచ్ఛ లున్నాయి. ఆర్థికమైన ప్రతి పత్తితో సహా చాలా ప్రతి పత్తులున్నాయి. ఇక పేదరికంలోని కుటుంబాలలో స్త్రీ ల విషయానికి వస్తే వారిలో సింగపరమైన అసమానతలు లేవు. స్త్రీ పురుష వ్యత్యాసం లేకుండా అందరూ కల్సి పని చేస్తారు. సంపాదిస్తారు. తింటారు. ఇక ఎటొచ్చీ అటూయిటూ కాక త్రిశంకు స్వర్గంలో వున్న మధ్య తరగతి స్త్రీల సమస్యల్ని గురించేనా మీరు మాట్లాడేది ? మధ్య తరగతి స్త్రీలకుమాత్రమే పరిమితమైన సమస్యలు స్త్రీల అందరి సమస్యలెలా అవుతాయి ? మధ్యతరగతి వారి సమస్యల్ని మధ్య తరగతి మేధావుల్లో కొందరు చిలవలు పలువలుచేసి చెప్పి వాటిని అందరు స్త్రీలకు ఆపాదిస్తున్నారు. అంచేత నేను అలా ఆలోచించను. ఆలోచించలేను. ఆర్థిక తారతమ్యాల మధ్య యింత పెద్ద అగాధ

లుండటం ఏ సమాజానికి ఆరోగ్యంకాదు. అంచేత అవి తొలగించబడాలి. కనీసం తగ్గింపబడాలి. అందుకు కృషిచేయటం ఆడ మొగ అందరి జీవితాలయొక్క అర్థం కావాలి. ఆ తర్వాత వ్యక్తుల మానసిక పరమైన, మేధాపరమైన స్థాయిలనుబట్టి, అభిరుచులనుబట్టి వారివారి పరమార్థకృషి ఉంటుంది—''

అతని ఆలోచనలు చంద్రమకు నచ్చాయి. కానీ తన ప్రశ్నకు అది సమాధానమా? సమాధానమేనని అనుకొని సంతృప్తిపడలేక పోయింది.

''ఇంతకీ మీరు మీవూరువెళ్ళి ఏం చేయబోతున్నారు?'

అతను నవ్వేడు.

''నా సమాధానం మీకు సంతృప్తినివ్వలేదు కదూ? అసలు మనం యీదశలో యిటువంటి వాటినిగురించి ఆలోచించ కూడదండీ. మీరు అడిగారని ఆలోచించాను. చదువు మానివేసిందే యింటి బరువును నెత్తిన వేసుకోటానికి. ఇక్కడి నుంచి వెళ్ళి ఏం చేసారంటే ఏం చెప్పను? నాకు గుమాస్తా వుద్యోగం దొరికింది. ప్రస్తుతానికది చేస్తాను''

''మరో సంవత్సరం ఆగితే అంతకన్నా మంచి వుద్యోగమే చిక్కకపోతుందా?''

అడగకుండా ఉండలేకపోయింది చంద్రమ. అతనోక్షణం ఆలోచించి గంభీరంగా చెప్పసాగేడు.

''మా నాన్నకు నేను పెద్దకొడుకుని. ఆయన ఆయవారాలు చేసుకొని సంసారాన్ని ఈడేవాడు. నేనిక్కడ ఎలా బతికానో తెల్సా? వారాలు చేసుకొని! స్కాలర్‌షిప్పు డబ్బులో కొంత మిగిలించి యింటికి పంపేవాడిని. ఆయన ప్రోద్బలం మీదే ఎమ్మే చదవడానికి వచ్చాను.

'కానీ నేను ఎమ్మేలో చేరిన కొన్నాళ్లకు ఆయన ఆ ఆయవారాలు చేసుకొనే శక్తినీ కోల్పోయాడు. వారిని గురించిన దిగులు-వ్యథ చదువుమీదికి బుద్ధిపోలేదు. అయినా నాకున్న పరిజ్ఞానంతో నేను మంచి మార్కులే సంపాదించుకోగలిగివుండేవాడిని. కానీ పరీక్షలకు ముందు నాన్నకు బాగాలేదని వుత్తరం. దాంతోపాటు నన్ను పరీక్ష రాయకుండా రావద్దన్న ఆంక్ష. పరీక్ష రాశాను. కానీ ఏమిరాశానో నాకుతెలీదు. బహుశా నా దరిద్రాన్నిగురించి రాశానేమో! నాకన్నా ఆర్థికంగా దరిద్రుడీ భువిలో వుండడేమో! కానీ చెప్పుకుంటే నా దరిద్రాన్ని హేళన చేస్తారు కానీ ఎవరు సహాయంచేస్తారు? ఒకప్పుడు కర్మనుబట్టి కులాలను నిర్దేశించారు. అది పోయి క్రమంగా జన్మనుబట్టి కులాల ముద్రపడే దౌర్భాగ్యస్థితికి వెళ్ళిందా వ్యవస్థ. ఇప్పుడు జన్మతః సంక్రమించిన ఆ కులాల ప్రాతిపదికమీద సహాయాలు-మినహాయింపులు-సౌకర్యాలు! అప్పుడు జన్మకులాన్నిశాసిస్తే, యిప్పుడు కులం సహాయాన్ని శాసిస్తున్నది. ఇక కులాలు ఎలా పోతాయండీ?

'పరీక్షరాసి యింటికివెళ్లి నేను చేసిన మొదటిపని - నాన్నకు అంత్యక్రియలు చేయటం. ఆ కనీస ధర్మాన్ని నెరవేర్చటానికి ఎన్ని కష్టాలుపడ్డానో నేనెలా చెప్పనండీ? అది చెప్పుకుంటే నా మాతృభూమిని నేను కించ పర్చినట్లవుతుంది. ఆ తర్వాత నాకనిపించింది. నాకు వెంటనే కావాల్సింది యమ్మే డిగ్రీ కాదు. అయ్యేయస్ వుద్యోగమూ కాదు. నా ఆత్మ గౌరవాన్ని, నా మాతృదేశ గౌరవాన్ని రక్షించే జీవన భృతి. నా వాళ్ళ కింత



గంజినీళ్ళు సమకూర్చగలిగే ఉద్యోగం. ఆ అన్వేషణలో యీ కొద్ది నెలల్లో ఎన్ని తిప్పలు పడ్డానంటారు. ఎన్ని అవమానాలను సహించానంటారు? బేధిక స్థాయి నుంచి ఆలోచనలు కాస్తో కూస్తో ఎదగబట్టి సరిపోయింది కానీ, లేకపోతే హత్యలు చేయటమో, ఆత్మ హత్యలు చేసుకోవటమో తప్ప శరణ్యమే ముందండీ?

"ఏనాడో గుమాస్తా పరీక్షకు కూర్చున్నాను. ఆ ఉద్యోగం వచ్చింది మొన్న. ఇలా వచ్చాను. అర్థం తర్వాత నేనండీ పరమార్థం ఏ వ్యక్తికైనా యవ్వనం తర్వాతే కౌమారం, వార్ధక్యం మనిషికి.

గృహస్థ ధర్మం తర్వాతనే కదా వాన ప్రస్థం? ఈ ధర్మాన్ని నేను తప్పలేను. ఆత్మ గౌరవానికి విలువనిచ్చే వ్యక్తికి ఆత్మ విశ్వాసం-ఆత్మ సౌందర్యం కూడా వుంటాయని నా విశ్వాసం.

మార్కండేయులు ఆకాశంలోని సూర్యుని వైపు ఓసారి చూశాడు. టైం చూసుకోవటానికి యిరువురి దగ్గర గడియారాలు లేవు.

"నేనింక వెళ్ళాలి" అతను లేచాడు. ఆమె కూడా లేచింది. ఇద్దరూ కొన్ని అడుగుల దూరం నడిచారు.

"మీరేమనుకోకపోతే సాధారణ స్త్రీగా చిన్న చివరి ప్రశ్న. మీరు పెళ్ళి చేసు కోరా అసలు?"

"నా మాటల్లో అలాంటి అభిప్రాయం కలిగిందా? భలేవారే. చెప్పాను గా-యవ్వనం తర్వాతే కౌమారం, గృహస్థం తర్వాతే వానప్రస్థమనీ. తప్పక చేసు కొంటాను. బహుశా కట్నం కూడా బాగానే తీసుకోవచ్చు. బాగా కట్నం వచ్చే వరకు ఆగుతాను. అప్పటికి స్థిర పడ్తానుగా? పైగా ఇప్పుడు నేను చేసు కొంటానన్నా ఎవరు చేసుకోరు. మొన్న కాశికాంబగారి బంధువులు వచ్చారు మా ఊరికి. మా చరిత్ర విని బెదురు పుట్టి పారిపోయారు"

అతని నవ్వులో అప స్వరాలు!

"లౌకిక జగత్తులో వుంటూ అలౌకిక జగత్తును గురించి ఆలోచించ వచ్చు కాని, పూర్తిగా అలౌకికమైన స్వాప్నిక జగత్తును కౌగిలించుకొని లౌకిక జగత్తును విస్మరించటం అవివేకం అను కొంటా. ఆ విషయం నాకు తెలుసులెండి"

లాన్స్ దాటి గేటు దగ్గరికి రాబో తున్నారిద్దరూ. అతను అకస్మాత్తుగా ఆగాడు. ఆమె కళ్ళలోకి చూశాడు.

"నా కథ వినక ముందే, నా మురికి ముతకబట్టల వేషాన్ని రోజూ చూస్తూకూడా నాకు మనసు నిచ్చారు మీరు. అమలిన మైన మీ ప్రేమకు నా దరిద్రపు కథ విన్నాక మలినం అంటిందనుకోను. నన్నూ ఒక్క మాట చెప్పి పోనీండి. నా కథ నాకు తెలుసు కనక ఎప్పుడో ప్రేమల్ని గురించి నేను ఆలోచించలేదు. అది గొప్ప వాళ్ళ 'లక్జరీ' అనుకొనే వాడిని. కానీ ఇప్పుడు మిమ్మల్ని చూసి మీతో మాట్లాడేక మిమ్మల్ని నేను కూడా ప్రేమిస్తున్నా. ప్రేమ స్వరూపం నాకూ అనుభవమైంది. ఓ క్షణమైనా అలౌకికా నందాన్ని అనుభవించాను. శలవ్."

రుద్రమ సమాధానం కోసం ఎదురు చూడకుండా ఆమెను వదిలేసి చక చకా నడిచి వెళ్ళిపోయాడు. బస్సు స్టాపు దగ్గర అప్పుడే కదలబోతున్న బస్సులో ఎక్కి తృటిలో మాయమైపోయాడు.




అక్కా నీకు సినిమా ఏక్టరు దగ్గ ర్నుంచి ఉత్తరం వచ్చిందేవ్' ఝాన్సీ అరుస్తూ కవరు పట్టుకొచ్చింది. రుద్రమ అప్పుడే పుర ప్రదక్షిణం చేసివచ్చింది.

కవరుమీద సుధాకరమూర్తి బొమ్మ. కింద చిరునామా !

యూనివర్సిటీలో ఉండగా సుధాకర

మూర్తి అన్నాడు ;

"రాజకీయాల్లో ఎప్పుడైనా దూరిపో వచ్చండీ. అది మా వంశవృత్తి. కానీ సినిమారంగం సంధ్యారాణుల మొనాపలీగా ఎందుకుండాలి ? అందుకే ఆ రంగంలోకి ఎలాగోలాగు కాలూనాలనిప్రయత్నిస్తున్నా పైగా గ్లామరు ఏం ? నాకన్నా ఎక్కువ పర్సనాలిటీ ఉన్నవాళ్లా ఈ హీరోలంతా?"

'పోనీ సంధ్యారాణినే ఛాన్సు ఇప్పించ మనకపోయారా? అంత కోరికగావుంటే?"

"సంధ్యారాణినా ?" అతను ఆత్మాభి మానం దెబ్బతిన్నవాడిలా వుద్రేకంగా అన్నాడు. "ఏమండోయ్ ఎంతైనా నేనూ కాస్తోకూస్తో పరపతి,పరువు మర్యాదలున్న వంశంలో పుట్టాను. అనాదిగా కలిగిన కుటుంబంమాది. కాని సంధ్యారాణిలాగా 'యూత్' మనీతో గొప్పతనం సంపా యించుకొన్నవాళ్ళం కాదు. నేనుగా నేను పెళ్లి చేసుకుంటానంటే తనకు అంతకు ముందే పెళ్ళయినట్టు అబద్దమాడింది.నేను ఎన్నికల్లో పోటీచేస్తే నాకు వ్యతిరేకంగా రహస్యంగా ప్రచారం చేసింది. అలాంటి మనిషిని సినిమాల్లో వేషం ఇప్పించమని అడుగుతానా ? నేను ముష్టివాడిని కాదండీ ఆత్మాభిమానం వున్నవాడిని. కావాలంటే పదెకరాలు అమ్మిపారేసి నేనే సినిమా తియ్యగలను" అన్నాడప్పుడు.

పది ఎకరాలు అమ్మేడో లేదో కానీ ఎవరితోనో భాగంకల్సి నెలరోజుల్లో ఓ సినిమా తీశాడు. షూటింగ్ అంతా విశాఖ పట్నం ప్రాంతంలోనే. చాలామంది కొత్త వాళ్లు. మిగతా భాగస్తులకి అలాంటి సిని మాలు తీయటంలో అనుభవంవుంది. సుధా కరమూర్తి ఆశించింది వేషంమాత్రమే.

హీరో వేషం వేద్దామను కున్నాడు మొదట్లో.

"హీరోవద్దు. మీరు విలన్ వేషాల్లో రాణిస్తారు. విలన్‌గా మీకు ఫ్యూచర్ ఉంటుంది" అని డైరక్టర్‌తో సహా భాగ స్తులు కూడా చెప్పటంతో అంగీకరించి విలన్ వేషం వేశాడు. సుధాకరమూర్తికి కాలేజీలో గ్లామర్ పెరిగింది.

"సినిమా ఓ కళ. మరీ చీప్ చేసి పారేస్తున్నారు కొందరు. అచ్చు పుచ్చు సినిమాలను ప్రజలు ఆదరించవద్దూ ?" రుద్రమతోసహా కొందరు స్నేహితురాళ్ళ దగ్గర తన బాధ వెళ్ళబోసుకుంటూ ఉప న్యాసం ఇచ్చింది సంధ్యారాణి.

"సినిమా కలోకాదో అలా వుంచుదాం. కాని సినిమా రంగంలో సామ్రాజ్యాలు స్థాపించుకొని పాతుకుపోయినవాళ్లుఇలాంటి మాటల్ని చెప్తూ జనాన్ని మభ్యపెట్టాలని ప్రయత్నిస్తున్నారు. వీళ్ళ ఉక్కు సంకె ళ్ళను తెంచుకుంటోంది సినిమా యిప్పు డిప్పుడే" అన్నాడు తర్వాత ఆ మాటలు విన్న సుధాకరమూర్తి.

మొత్తంమీద సంధ్యారాణి. సుధాకర మూర్తుల మధ్య మాటలే ఆగిపోయాయి..

సినిమా రిలీజయింది. బడ్జెట్ సినిమా డబ్బులు చేసుకుంది.

సుధాకరమూర్తికివిలన్‌గా పేరొచ్చింది. రుద్రమతోసహా సినిమాలో అతని నటన చూసి అంతా ఆశ్చర్యపోయారు.

'మీరెప్పుడూ నాటకాల్లోనన్నా నటించ లేదుకదా ? సినిమాలో ఒక్కసారిగా అంతబాగా ఎలా నటించారు ?'

సుధాకరమూర్తి సినిమా హీరోనవ్వు నవ్వాడు.

"మీరుగనుక నిజంచెప్తాను. నాటకాల్లో నటించటం సినిమాల్లో నటించడానికో పెద్ద డిస్‌క్వాలిఫికేషన్ అనుకొంటాన్నేను.

మా సినిమాలో చిల్లర వేషాలు వేశారే! వాళ్ళంతా గొప్ప గొప్ప రంగస్థల నటులు. వాళ్ళకా చిల్లర వేషాలకన్నా పెద్దవి ఇవ్వరు. సినిమాల్లో నటించటం ఏం కష్టమండీ? నిజానికి నేను ఏం నటించానో నాకే తెలియదు. సగం కెమేరా, మిగతా సగంలో సగం దర్శకుడు, ఆ మిగతా సగంలో కొంత కథ, సంభాషణలు, దృశ్యాలు, మేకప్ ఇత్యాది నటించగా మిగతాదే నా ప్రతిభ"

"అయితే సినిమాల్లో నటించటం కష్టం కాదంటారా?"

"నాకు ఏదీ కష్టం కాదు. ఒక్క చదవటం తప్ప. అందుకే చదివే వాళ్ళన్నా మంచి మార్కులొచ్చే వారన్నా నాకు అభిమానం. భయం"

సినిమా రిలీజ్ అయి కాస్త పేరు రాగానే మద్రాసుకు ప్రయాణం కట్టాడు సుధాకరమూర్తి. అప్పటికే అతనికి పరిచయాలు పెరిగాయి.

"చదువునేం చేస్తారు? వదిలేస్తారా?"

"అమ్మమ్మ! ఎమ్మే డిగ్రీ ఎలాగో లాగు సంపాదించాలండీ బాబూ! దానివల్ల నాకు చాలా లాభాలున్నాయి. అసలు సినిమాల్లో ఎమ్మే చదివిన వాళ్ళెవరున్నారండీ?అదో ప్రత్యేకతగావుండదూ? అంచేత పరీక్షల వేళకు వస్తాను. మీరే సాయం చేయాలి"

నాలుగైదు సినిమాల్లో బుక్కింగులు సంపాదించుకొన్నాడు.

పరీక్షల వేళకొచ్చాడు.నేరుగారుద్రమ గదికే వచ్చాడు.

"ఇంక మీదే బాధ్యత. పరీక్షపాసయి ఆ డిగ్రీ వచ్చేలా చూడాలి"

"నన్నేం చేయమంటారు ఇప్పుడు?"

"మీరు యీ నాలుగు రోజులూ ఏదో ఒకటి చెప్పండి చదివే ఓపిక లేదు. వింటాను. ఏదో ఒకటి రాస్తాను. థర్డు క్లాసు డిగ్రీ రాకపోతుందంటారా? వస్తుందని వదిలెయ్యనులెండి. నా ప్రయత్నాలు నేను చేస్తాను"

రుద్రమ ఏం చెప్పిందో, అతనేం రాశాడో ఎవరికీ తెలియదు. పరీక్ష హాల్లో మూడు గంటలూ ఏదోరాస్తూనేవున్నాడు. పరీక్ష హాల్లో కూడా చాలామంది దృష్టి అతనిమీదే! సినిమాలో ఓసారి మొహం కన్పిస్తే చాలు! ఎంత గ్లామర్! ఏమిటీ పిచ్చి జనానికి? అంతవరకూ మామూలుగా కన్పించిన మనిషి సినిమాలో కన్పించగానే భగవంతుడి తాత అవుతాడా!

"థేంక్స్ అండీ రుద్రమదేవిగారూ. మీ దయవల్ల తెల్ల కాగితాన్ని నల్ల చేశాను. తర్వాత విషయాలు దైవాధీనం. ప్రొఫెసర్ల దయ! మద్రాసు వెళ్ళబోతూ రుద్రమ ఇంటికొచ్చాడు వీడ్కోలు చెప్పి పోవటానికి. అలవాటుగానే సినిమా ఏక్టరును చూడటానికి కొందరు పిల్లలు బజార్లో పోగయ్యారు.మరికొందరు మర్యాదకుటుంబాల్లోని అమ్మలక్కలు కిటికీల్లో నుంచి చూస్తున్నారు.

రుద్రమ గదిలోకి అతనెప్పుడూ అడుగు బెట్టలేదు. అన్ని సమావేశాలు కాళికాంబగారి భాగంలో ముందు హాల్లోనే. చదువు అక్కడే సాగింది.

"చాలాసార్లు చెప్పాను మీతోటి. మళ్ళీ యిప్పుడు చివరిసారిగా అదే విషయాన్ని చెప్పబోతున్నాను; ఒకప్పుడు జోక్‌గా కొట్టివేశారు. ఆ తర్వాత మౌనం వహించారు: అయితే యివాళ నాకు మీ ఓటుతో పనిలేదు. చదువుతో పనిలేదు. మరే అవసరమూ లేదు. అయినా చెప్తున్నాను. సీరియస్‌గా ఆలోచించండి" అతను కాళికాంబగారి వైపు చూసి ఆగాడు.

"పెద్ద వారు మీరు చెప్పండి. కులాలు ఒకటనీ కాదు కానీ నాకేం తక్కువండీ? డబ్బు-ఇప్పుడు పేరు-రేపు డిగ్రీ-అన్నీ వున్నాయి కదా? నేను ప్రేమిస్తున్నానంటే తను ఎందుకు తేలిగ్గా కొట్టి పారేస్తుందో కనుక్కోండి? రుద్రమగారూ మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. పెళ్ళి చేసుకొంటాను మీ అభ్యంతరం లేకపోతే?"

రుద్రమ నుంచి సమాధానం కోసం చాలాసేపు ఎదురు చూశాడు సుధాకరమూర్తి.

"వేసిందీ; వేస్తున్నదీ విలన్ వేషాలు

కానీండీ, నేనసలు విలన్‌ని కాదండీ. ఒక విధంగా పిచ్చివాడిని. బడబడా వాగేసే అమాయకుడిని. అందుకే సంధ్యారాణి నన్నంత చులకన చేసింది. అదీ ఒకందుకు మంచిదయిందనుకోండి. కానీ మీరెందుకు నా ప్రతిపాదనను అంగీకరించరు?"

"బాబూ!" కాళికాంబ కలుగచేసుకొంది "ఆడపిల్ల కదా? నీలాగా అన్నిటికీ తెగించగలదా? తెగించినా లోకం హర్షిసుందా? పైగా ఆ పిల్ల కుటుంబ పరిస్థితులేమిటో నీకేం తెల్సు?"

"నాకన్నీ తెల్సండీ? ప్రేమించిన వ్యక్తి యొక్క వివరాలు తెల్సుకోవాలన్న కనీస జ్ఞానంలేని వెర్రివాడిననుకొన్నారా? తను నన్ను ప్రేమిస్తున్నానని ముందు అంటే చాలు. ఆమె కుటుంబ పరిస్థితుల్ని చక్కదిద్ది పెళ్ళి చేసుకొనే మార్గం చెపాను"

"ఏమ్మా? అతనంతగా చెప్తుంటే నువ్వు మౌనంగా వూరుకుంటే ఎలా?"

"మొదట్లో ఏమో కానీండి, సుధాకర మూర్తిని నేనిప్పుడు ప్రేమిస్తున్నాననే అనుకొంటున్నాను. అయితే ఆ ప్రేమ స్వరూపం ఏమిటో ఇదమిద్ధంగా అప్పుడే నేను చెప్పలేను"

"అదేమిటమ్మా అతనికా స్త అర్థమయ్యేలా చెప్పు"

"ప్రేమ విషయంలో నా మనస్సు ఒక పరిశోధనాలయంగా కన్పిస్తున్నదండీ. నేను మార్కండేయుల్ని ప్రేమించాను. పెళ్ళి చేసుకోవాలని కూడా అనుకొన్నాను ఎందుకో? కానీ అతను పెళ్ళి చేసుకోనన్న రోజు నేను బాధపడలేదు. చిత్రంగా లేదూ?"

"ఇప్పుడు నేనూ అంతే రుద్రమ గారూ. మీరు పెళ్ళి చేసుకోనంటే నేనేం పిచ్చివాడిని కాబోవటంలేదు. కానీ మీ పరిశోధనాగారంలో నాకూ చోటు వుంచ న్నారు. అదే నాకు సంతోషం. మీ ప్రేమ స్వరూపమేమిటో పరిశోధించి తెల్సుకోండి. పెళ్ళి చేసుకోదల్చుకొంటే మాత్రం నాదో సూచన వుంది. చెప్పనా?"

"చెప్పండి"

"సినిమా రంగాన్ని నేనిప్పుడు బాగా ఆకళింపు చేసుకొన్నాను. నిలదొక్కుకున్నాను. ఎందుకూ పనికిరాని వాళ్ళంతా అక్కడ అదృష్టముంటే ధనవంతులయిపోతున్నారు. మీకు అందం వుంది. డొక్కశుద్ధి వుంది. మేధస్సు వుంది. ఇన్ని వున్న మీరు సినిమా హీరోయిన్‌ఎందుకు కాకూడదు? అదో వృత్తి - వుద్యోగం అనుకోండి. డబ్బు సంపాదించి కుటుంబానికి సాయం చేయండి. ఆ తర్వాత రిజిగ్నేషన్ పారేసి పెళ్ళి చేసుకోండి. హాయిగా సంసారాన్ని చేసుకోండి"

సినిమా ఏక్టరా తను? పదిమందితో మాట్లాడటమే యింకా పూర్తిగా చేతకాదే? పురుషులతో కల్సి తిరగటం, మాట్లాడటం ఈ రెండేళ్ళలో తప్ప అంతకు ముందు అసలు తెలీదే? అలాంటి తను...

నవ్వొచ్చింది రుద్రమకు. కానీ నవ్వలేదు.

"ప్రేమ విషయం, పెళ్ళి విషయం రెండూ ఆలోచించుకోండి. అయితే ఆరు నెలల్లోగా మీనిర్ణయం తెలుపండి. ఎంతైనా నేను మసలుతున్నది సినిమా లోకంలో కదా! ఎంత కాలం వ్యామోహాలను, ఆకర్షణలను జయిస్తూ పత్నీవ్రతుడిలా వుండగలను?"

మర్నాడు అన్నీ సర్దుకొని వూరికెళ్ళడానికి సిద్ధమవుతుంటే కారులో దిగింది

సంధ్యారాణి. అభినయాలయ్యాయి.

"సుధాకరమూ_ర్తి నిన్ను హీరోయిన్ వేషాలు వెయ్యమన్నాట్టగా?"

"ఇక్కడ మాట్లాడుకున్న విషయం? అక్కడికెలా తెల్సింది?"

"తెలుసుందిలే సినిమావాళ్ళం కదా? అది వినే వచ్చా-ఓ ఆఫర్ వో"

సంధ్యారాణి కట్టుకొన్న ఖరీదైన చీరెకు పులిమిన ఇంపోర్టెడ్ సెంటు వాసనలో ఇల్లంతా నిండిపోయింది. వాకిట్లో ఆమె కారు చుట్టూ కొందరు పిల్లలు మూగారు - ఆమెకూడా ఎవరో సినిమా నటి అన్న ఉద్దేశంతో!

"నీకంతగా సినిమా నటి కావాలని వుంటే ఇన్నాళ్ళుగా నాతో మాట మాత్రం అనకపోయావా? మా నాన్నగారు ఫోను చేస్తే ప్రొడ్యూసర్స్ పరుగెత్తుకు రాక పోయారా? అసలీ న్యూవేవ్‌లు, బడ్జెట్ సినిమాల్లో ఏక్ట్ చేస్తే ఏమొస్తుంది. మహా అయితే ఏక్టర్ అన్న పేరొస్తుందేమో! ఇంకా, ఎవరన్నా తోసేవారుంటే ఏదన్నా ఓ బహుమతి వచ్చేను! కానీ స్టారువై వెలగాలంటే గ్లామరున్న పాత్రలు వేయాలి. మా నాన్నగారేదో టెక్నికలర్ తీసే ప్రపోజల్‌లో వున్నారు. నీ పేరు రికమెండ్ చేయనా?"

సినిమాల్లో తను నటించటం అన్న ఆలోచనకన్నా, ఎందుకో సంధ్యారాణి మాటలు, ఆమె వాటిని చెప్పిన ధోరణి అసహ్యంగా, జుగుప్సాకరంగా తోచాయి. మనస్సు కలుక్కుమంది. ఎంత అణుచుకొందామన్నా మనస్సులో భావన మాటల ద్వారా పైకి రానే వచ్చింది. ఆత్మగౌరవం ఎదురు తిరిగింది.

"ఏం? నా దాకా ఎందుకు? నువ్వూ నా లాగా అందంగానే వుంటావుగా? ఆ వేషమేదో నువ్వే ఎందుకు వేయకూడదు. అసలు ఇన్నాళ్లు నువ్వు సినిమా ఏక్టరివి ఎందుక్కాలేదు?"

కుష్ఠురోగిని కౌగిలించుకున్నట్లు మొహం పెట్టింది సంధ్యారాణి.

"ఛీ! సినిమాల్లో నేను ఏక్ట్ చేయటమా? నాకసహ్యం. మానాన్నకంత కంటే అసహ్యం. సిరిసంపదలు, పరువు మర్యాదలుగల నాకేం ఖర్మ? నాకాబోయే భర్త ఇండస్ట్రియలిస్ట్. నాకూ చాలా పరిశ్రమలలో షేర్స్ వున్నాయి. తెల్సా?"

సినిమా డబ్బుతో గొప్ప వాళ్ళైన సినిమా వాళ్ళ దృష్టి ఇదా?

తమ బిడ్డలు ఇండస్ట్రియలిస్ట్‌లుకావాలి. డాక్టర్లు, ఇంజినీర్లు కావాలి. ధనార్జనకోసం మాత్రం సినిమాని కళగా పొగడటం? సినిమాల్లోకి దిగినా అల్లుడు, కొడుకు ఏ ప్రొడ్యూసరో, డిస్ట్రిబ్యూటరో? వ్యాపారం? తమ కూతుళ్ళని ఎందుకు హీరోయిన్‌లను చేయరు? ఎక్‌స్ట్రా వేషాలివ్వరు?

"నా మేరేజ్ డేట్ కూడా సెటిలయిపోయింది తెల్సా? నా అందాన్ని, అంగాలని అందరిముందు ప్రదర్శించుకునే ఖర్మ నాకేం పట్టింది? అంతగా కాలక్షేపం కావాలనుకొంటే సర్దాగా ఏ లెక్చరర్ ఉద్యోగమో చేసాను కానీ!మానాన్న అసలు మాకేం చెప్తాడో తెల్సా? గ్లామర్ చూసే వారికే భ్రమ కలిగిస్తుంది. దానికి దూరంగా వున్నంతవరకే గౌరవం. పొరపాటున గ్లామర్ వుచ్చులో చిక్కుకుంటే ఆతర్వాత మ్యూజియం బొమ్మల గతే. బందిఖానా, నరకం అది. ఏదో మంచి చేద్దామని వస్తే ఇలా అగౌరవ పరుస్తావా?"

"మంచా? నీకు మంచి కాని విషయం

నాకెలా మంచిదవుతుంది ?''

''నువ్వూ, నేనూ ఒకటేనా ?''

'ఎంత అహంభావం, గర్వం ?'

''ఎందుకవుతాం ? నాకు యూనివర్సిటీ ఫస్టు రాబోతోంది. నీకు థర్డు క్లాసో మహా అయితే సెకన్డ్ క్లాసో రాబోతోంది నేను క్లాసులో ఫస్టు. నువ్వు లీస్టు''

సంధ్యారాణి మొహానికి పూసుకున్న మేకప్ కోటింగు నల్లగా మారింది. గుండెల మీద వున్న కొండలు రెండూ ఎగిరెగిరి పడసాగాయి.

''తెలివిగలదానివని గర్వపోకు, నీ లాంటి పది మంది తెలివిగల వాళ్ళను కొనగల డబ్బు నాకుంది. యూనివర్సిటీ ఫస్టు వచ్చినా నీ కన్నా ముందు నేను లెక్చరర్ వుద్యోగంలో చేరుతాను. నీ కన్నా ముందు నేనే పెళ్ళి చేసుకొంటాను పిల్లల్ని కంటాను. ఇంకా...ఇంకా" మాటల్లో బుసలు, బుసలో కసి !

''ఇంకా-నువ్వా మధ్య వో బోడి కథ రాసి బహుమతి కొట్టేవుగా ? నేను నవల రాసి సినిమా తీయిస్తాను. గుర్తుంచుకో నా మాటలు''

సంధ్యారాణికన్నా బిగ్గరగా గర్జిస్తూ కారు వెళ్ళిపోయింది.

"ఎప్పుడూలేనిది ఎందుకమ్మా ఆ పిల్లతో అనవసరంగా తగాదా పెట్టుకున్నావ్? సిరిసంపదలు అహంకారానికి నెలవులని తెలియనిదా నీకు?'' కాళికాంబ ఆ తర్వాత అంది. ఛుద్రమ కూడా అనుకొంది ఆ తర్వాత. కానీ, ఏమిటి లాభం ?

ఆ రోజే ఆమె ఇంటికి బయలుదేరి వచ్చింది. అప్పటినుంచే వుద్యోగాన్వేషణ.

సుధాకరమూర్తి బొమ్మ చూడగానే ఇదంతా వో క్షణం బుర్రలో తిరిగిందామెకు !

నిజమే! తెలివితేటలు తిండి పెట్టవుగా? ఆవేశం అన్ని అనర్థాలకూ హేతువేగా ? ఇంటికొచ్చిన దగ్గరనుంచి ఏదో ఒకచిన్న వుద్యోగం చేయాలనే తపన పడ్తుందే ? చాలా తిరిగిందే! కానీ, ఏదీ?

అందరూ తన అందాన్ని, యవ్వనాన్ని ఎంగిలి చేద్దామని చూసేవాళ్ళే ? తెలివితేటలని ప్రజ్ఞని పొగిడేవాళ్ళే !

ఉద్యోగం అడిగితే మాత్రం చులకనగా చూసారు. లోకువ చేసారు.

"అదేమిటే అక్కా! ఇంకా ఆ కవరు తెరవలేదూ ? ఉత్తరం రాసింది సినిమా ఏక్టరు సుధాకర మూర్తే. అతని సినిమా వొకటి రేపు రిలీజ్ కాబోతోంది. అయినా నీకు సినిమా ఏక్టర్లతో ఎలా పరిచయాలయ్యాయబ్బా ?''

కవరు చించింది ఛుద్రమ.

"జాగ్రత్తగా చించు అక్కా కవరు మీద బొమ్మ చిరగకూడదు-'' అంటూ జాగ్రత్తలు చెప్పిన ఝాన్సీ ఛుద్రమ వుత్తరాన్ని తీసుకోగానే, తను కవరు తీసుకొని తుర్రుమంది !

''కంగ్రాచ్యులేషన్స్ మీరు యూనివర్సిటీ ఫస్టు."

ప్రొఫెసర్లకి వ్యతిరేకంగా అంతగోల చేసినా నేనూ 'ఎమ్మే' అన్న రెండు అక్షరాలు నా పేరుకు చివరన తగిలించుకోవటానికి అర్హతను సంపాదించుకొన్నాను. అందులో మీ సహాయం కూడా వుందిగా కృతజ్ఞతలు.

చిత్రమేమిటంటే సంధ్యారాణి సెకెండు క్లాసులో పాసయింది.

అంతకన్నా చిత్రమేమంటే ఆమె రాసిన వో కథను సినిమా తీస్తున్నారు. అందులో నాకో పాత్రనిచ్చారు, నేను మాత్రం మీ కథను కనిపించిన వాళ్ళకల్లా

చూపిస్తున్నాను. విశాఖపట్టణంలో షూటింగు వుండి వస్తే మన ఫలితాలు తెలిశాయి. హైదరాబాద్ వెళ్తున్నాను ఈవాళ. నాలుగు రోజుల్లో సంధ్యారాణి పెళ్ళి గదా? మీకు కూడా ఇన్విటేషన్ వచ్చే వుంటుంది.



బహుశా మీవూరుప్రాంతాలకు షూటింగు నిమిత్తం త్వరలో రావచ్చు. అప్పటికి మీ నిర్ణయాలు చెప్పగలిగితే సంతోషిస్తా. షెడ్యూలు తెలవగానే ఉత్తరం రాస్తాను.

అన్నట్టు డాక్టర్ రామ్‌మోహన్‌గారిని నిన్న అనుకోకుండా ఓ 'పార్టీ'లో కలవటం తటస్థించింది. మిమ్మల్ని గురించి నాకేమో తెల్సినట్లు ఆత్రంగా వాకబు చేశారు. ఇలా వుత్తరం రాయబోతున్నానని చెప్పాను. హార్దీగా అభినందనలు అందచేయమన్నారు;

మీ నిర్ణయంపై నా భవిష్యత్ కార్యక్రమాలు ఆధారపడి వుంటాయని రాయనక్కర్లేదుగా ? త్వరలో మిమ్మల్ని కలుసుకోగలనన్న భావనే చాలా తియ్యగా వుంది నాకు......సుధాకరమూర్తి''

మళ్ళీ ఆలోచనలు - గతస్మృతులు.

ఆ రోజు -

ప్రథమ బహుమతి వచ్చిన తన కథ ప్రచురణ అయినరోజు -

కొందరు బాగుందన్నారు. మరికొందరు విమర్శలు చేశారు. అందరికన్నా ఎక్కువగా మెచ్చుకొన్నది సుధాకరమూర్తి.

"వయసుకన్నా బాగా ముందుగాఎదిగి ఆలోచించి రాశారండీ. కష్టమూ, నష్టమూ అనికానీ తెలివితేటలు ఉపయోగించి తీస్తే మంచిసినిమా తీయవచ్చు"

అతని మాటల్ని రుద్రమ అప్పుడు పట్టించుకోలేదు పెద్దగా. మార్కండేయులు అభిప్రాయం యిస్తే ఎంత బాగుండును ? కానీ అప్పటికే అతను వెళ్ళిపోయాడే ?

ఇంటికొచ్చేసరికి కొంచెం ఆలస్యమయింది. మనసంతా ఏదో వింత ఆనందంతో నిండివుంది.

"నీకోసం ఇప్పటిదాకా ఎదురు చూస్తున్నాను రుద్రా. పిల్లలు 'మాయాబజార్' సినిమాకు తీసికెళ్ళమంటున్నారు. బయల్దేరుతున్నాము. నువ్వూ వస్తావా?!" కాళికాంబ, పిల్లలు బయల్దేరటానికి సిద్ధంగా వున్నారు.

మాయా బజార్ సినిమా ! మంచి సినిమా ! ఎన్నిసార్లుచూసినా చూడాలనిపించేది. అందులో కాళికాంబ, పిల్లలతో చూడటం ? బాగానే వుంటుంది.

కానీ వ్యవధిలేదు. పైగా ఎందుకో ఆమెకాక్షణంలో సినిమా చూద్దామన్న ఇచ్ఛ కలగలేదు. తనకథను ఒంటరిగా పదేపదే చదువుకోవాలన్న కోరిక !

"మీరు వెళ్ళండి. నేను అలసిపోయాను పైగాతయారయేసరికిఆలస్యమవుతుంది?"

కాళికాంబ, పిల్లలు వెళ్ళిపోయారు - 'జాగ్రత్త'లు చెప్తూ.

కథను ఒంటరిగా చదువుకొంది. శరీరమంతా ఏదో గగుర్పాటు .

పెళ్లి అన్నా కాని తను- మాతృత్వపు మాధుర్యాలను గురించి రాసింది ! ఎంత చిత్రం ? పైకి అనటంలేదు కానీ తనకు ఆ అనుభవాలు ఉన్నాయని అనుకోవటం లేదుకదా జనం ?

గేటు దగ్గర చీకట్లో ఎవరో వ్యక్తి !

భయంతోగుండె ఝల్లుమంది ! వాకిట్లో లైటు వేసింది. తలుపు గొళ్ళేలు సరిగ్గా వున్నాయో లేదోనని చూసుకొంది. కిటికీలోనుంచి చూసింది.

ఆ వ్యక్తి గేటుదగ్గరే అనుమానంగా నిల్చొనివున్నాడు. ఎవరావ్యక్తి ? డాక్టర్ రామ్‌మోహన్ కాదుకదా ? ... అవును. ఆయనే !

తలుపు తీసుకొని వాకిట్లోకి వెళ్లింది. గేటు తీసింది.

"మాష్టారూ ! మీరు..."

క్లాసులో ఆయన పులిలాంటి మనిషి. భాష, భావం ఆయన చేతిలో బంతులు. నాలుక ఎలా ఆడిస్తే అలా ఆడుతుంది.

కానీ ఇప్పుడాయన తల ఎత్తటానికి సిగ్గు పడున్నట్లుంది ! మాట నోటివెంట రావటంలేదు.

"లోపలికి రండి మాష్టారూ".

ఆయనను గురించిన కథలన్నీ తెల్సు రుద్రమకు. కానీ అవేమీ గుర్తుకురాలేదాక్షణంలో. ఆయన ఆమె అభిమానించి

ఆరాధించే గొప్ప ఉపాధ్యాయుడు! విద్యార్థులకు పాఠం ఎలా చెప్పాలో ఆయన పాఠాలు విని నేర్చుకోవచ్చు.

రామ్‌మోహన్ తలవంచుకొనే నిదానంగా లోపలికి నడిచేడు.

"ఇంటివాళ్లుకూడా లేనట్లుంది..." ఆయన గదిలోకి అడుగుబెడుతూ అనుమానంగా అన్నాడు. అర్థమయింది రుద్రమకు.

"సినిమా కెళ్ళారండీ. పర్వాలేదు. కూర్చోండి మేస్టారు"

ఇద్దరికీ మాటలు కరువయినట్లున్నాయి. మౌనం! చివరికి తెగించి రామ్‌మోహన్ అన్నాడు "చాలా రోజులుగా మీతో ఓ విషయం మాట్లాడాలనుకొంటున్నాను మిస్ రుద్రమదేవి! ఇవాళ మీ కథ చదివేను. ఇక ఆగలేక ఇలా వచ్చాను—"

రుద్రమఆశ్చర్య పోయింది! ఏం మాట్లాడాలో తోచలేదు. తన కథ చదివి వచ్చారా అంత పెద్ద వ్యక్తి!

"నన్నుగురించి స్టూడెంట్స్ చెప్పుకొనే కథలు మీరు వినే ఉంటారనుకొంటాను!"

"కథ ఎలావుంది మాస్టారూ? ఏదో పిచ్చికథ. దానికే బహుమతి ఇస్తారనుకోలేదు"

ఆయన వెంటనే మాట్లాడలేదు.

"ఇక్కడ నేను సిగరెట్టు కాల్చుకోవచ్చా? అభ్యంతరమైతే కాల్చను."

క్లాసులోనే అప్పుడప్పుడూ సిగరెట్లు కాల్చే వ్యక్తి! తన పర్మిషన్ అడుగుతున్నాడు! ఏమిటీ వింత? ఎంత అసహజం!

"మాస్టారూ! మీరు గురువులు. నేను శిష్యురాలిని. నేను సిగ్గుపడేలా చేస్తున్నారు. సిగరెట్టు కాల్చుకోండి మాస్టారూ—మీ కభ్యంతరం ఏముందిక్కడ?"

అతను సిగరెట్టు వెలిగించాడు. కొంత ధైర్యం వచ్చినట్లుంది.

"జీవితంమీద ఆశను చంపుకొని ఒక రకమైన స్వేచ్ఛా జీవితానికి అలవాటు పడ్డవాడిని మిస్ రుద్రమదేవి. నిజం చెప్తున్నాను మీ కథ చదివాక నాకు మళ్లీ జీవితంపై ఆశ కలుగుతోంది. కథలో మీరు మాతృత్వపు మాధుర్యాలను చిత్రించారు. ఆ కథలో స్త్రీ పాత్రలో నన్ను ఊహించుకొన్నాను. పితృత్వపు అనుభూతులు కలిగాయి నాలో"–ఆరిపోతున్న సిగరెట్టుతో మరో సిగరెట్టు వెలిగించేడు. "బలహీనత బలహీనతను, పిరికితనం పిరికితనాన్ని పెంచుతుంది. వ్యసనాలు పిరికితనానికి నిదర్శనం. నాకున్న వ్యసనాల్లో సిగరెట్లు వెంట వెంట కాల్చడం చాలా చిన్నది".

డైలాగుల దగ్గరనుంచీ ఆ దృశ్యమంతా చాలా అసహజంగా ఉన్నట్లనిపించింది రుద్రమకు. కానీ అది సత్యం. ఎదురుగా తను గౌరవించే గొప్ప టీచరు. ఎదురుగా అల్పురాలైన తను! తనని ఆయన పొగుడుతున్నాడు!

"ఇప్పుడు చెప్పు మిస్ రుద్రమదేవి. నన్ను గురించి నీ అభిప్రాయమేమిటి?" పట్టిపట్టి వచ్చాయా మాటలు ఆయన నోటినుంచి.

"మీరు గొప్ప గురువులు మేస్టారూ. ఎదురుగ్గా చెప్తే పొగడ్త అవుతుందేమో! కానీ మొదటిసారిగా క్లాసులో మీ పాఠం విన్న రోజునే మిమ్మల్ని నా గురుదేవులుగా నా గుండెల్లో ప్రతిష్ఠించుకొన్నాను. సుధాకరమూర్తి మిమ్మల్ని విమర్శించి ఒక విధంగా నాలాంటి వాళ్ళకు మేలు చేశాడు. మీరు తీసుకున్న ప్రతి క్లాసు నాకొక్కో గొప్ప రసానుభూతి మేస్టారూ. మీరు నాకు ఎప్పటికీ పూజనీయులు. మీ



వ్యక్తిగత బలహీనతలు మీలోని ప్రతిభను కప్పివేయలేపు కదా మేస్టారూ."

రామ్‌మోహన్ మొహంలో మొదట్లో ఏవో విచార రేఖలు! కొంతసేపు అవి అల్లలాడి మాయమయ్యాయి.

అతను చివుక్కున లేచాడు. ఆమె మొహంలోకి సూటిగా చూశాడు.

"నా పట్ల అంత గురుభావన పెంచుకొన్నందుకు సంతోషమమ్మా. నీలాంటి విద్యార్థిని మనసులో అలా చోటు చేసుకోవటమూ గురువు అదృష్టమే. దాన్ని మలినం చేసే పని ఏమీ చేయను నేను. గురువుగారిలాగే పీట వేసి నీ గుండెల్లో నన్నుంచుకో. అంతకన్నా నేనేమీ ఆశించను. శిష్యురాలిగా నిన్ను కలకాలం గుర్తుంచుకుంటాను" అతను బయటికి నడిచేడు.

"మాస్టారూ కాసిని కాఫీ అన్నా..."

"కాఫీ ఎందుకమ్మా? నీ కథ నాకు ఆక్సిజన్ ఇచ్చింది. నువ్విప్పుడు అమృతాన్నే నా గుండెల్లో నింపేవు. చాలు"

పులిలా చకచకా నడిచి వెళ్తున్న అతడిని చూస్తుంటే క్లాసులోకి ప్రవేశించేటప్పటి గురువుమూర్తి స్ఫురించింది రుద్రమకు. రెండు చేతులు జోడించి నమస్కరించింది చీకట్లోనుంచి వెలుతురులోకి వెళ్తున్న ఆ మూర్తికి!

"ఉత్తరం చూస్తూ ఆలోచిస్తున్నావేమిటి సిస్టర్? ప్రేమలేఖ వ్రాశాడేమిటి సినిమా విలన్?" రుద్రమ చేతిలో ఉత్తరం లాక్కొంది ఝాన్సీ. చదివింది.

"ఐసీ. అయితే విలన్‌గారు యీ హీరోయిన్‌గారి క్లాస్‌మేట్ అన్నమాట! మధ్యలో యీ సంధ్యారాణి ఎవరు? వాంపా? సైడ్ హీరోయినా? ఈ డాక్టరుగారెవరు? మందుల డాక్టరా? చదువుల డాక్టరా? కేరక్టర్ ఏక్టరులాగా వున్నాడే? అమ్మా! 'త్వరలో మిమ్మల్ని కల్సుకోగలనన్న భావనే చాలా తియ్యగా వుంది నాకు!' అంటే తియ్యటి వ్యవహారమేదో కాస్త నడిపేవన్నమాట నువ్వు కూడా?"

"ఛ. సిగ్గు లేదూ అలా మాట్లాడటానికి?"

"సిగ్గెందుకు? సిగ్గుపడుతూ కూర్చుంటే ఈ రోజుల్లో ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు కావే పిచ్చిదానా!అందుకే నేను సిగ్గునువదిలేశా! నాకు ప్రేమలు లేకపోయినా ఫర్వాలేదు. పెళ్ళి అయితే చాలు. చూడబోతే విలన్ గారు నిన్ను పెళ్ళి చేసుకోనేలావున్నాడు. లాగించెయ్ బండి! నా కూ త్వరగా పెళ్ళవుతుంది. అసలు యిప్పుడు విచారిస్తున్నా. నేనూ ఏదో ఎఫైర్‌లో యిరుక్కొన్నట్లయితే బాగుండిపోయేది! చదువు మానేసి ఇంట్లో కూర్చొని పెళ్ళి పెళ్ళి అని నన్ను విసిగిస్తున్నా. బై దిబై. ఫస్టులో పాసయినందుకు ఈ చెల్లెలి శుభాభినందనలు వందనములూ అవేవో అందుకో"

కూతురు పాసయిందని తెల్సి మాధవరావు, అనసూయలు ఆనందంతో పాటు దిగులూ పడిపోయారు.

"వయసు ముదిరిపోతుందే ఇంక. ఇదే పెళ్ళికి మంచి తరుణం. చదువులు అయిపోయాయిగా? ఇక ఆ విషయం చూసుకో"

అంటే తన భర్తను తననే చూసుకోమనా తల్లి అభిప్రాయం?

వెంటనే విష్ణువర్ధనుడు గుర్తుకొచ్చాడు. అప్పుడు తల్లి అన్న మాటలు స్ఫురణకొచ్చేయి.

కులగౌరవాలు సరిపోయే భర్తను చూసుకోమనా?

మరి తాను పెళ్ళి చేసుకొంటే ఝాన్సీ పెళ్ళి ఎలా? స్వతంత్రభానుడి యొక్క ఇంజనీరింగ్ చదువెలా కుదురుతుంది?

అన్ని సందేహాలొచ్చినా తల్లి అభిప్రాయాన్ని స్పష్టం చేయమని అడగలేదు రుద్రమ.

తండ్రి దిగులు మరో ధోరణిలో సాగింది.

"అమ్మా! నీకు నేనెలాగూ పెళ్ళి చేయలేను. ఉద్యోగమన్నా ఇప్పించకపోతే ఏం బాగుంటుంది చెప్పు? అయినదానికి కానిదానికి అధికారులను అర్థించటం నాకు చాతకాదనుకో. అందుకే యిన్ని రోజులుగా నువ్వేదో ప్రయత్నాలు చేస్తున్నా నేను నిర్లిప్తంగా వుండిపోయాను. కానీ ఇక ఇప్పుడలా వూరుకోను. ఫస్టుక్లాసులో పాసయ్యావు. నీవు లెక్చరర్ వుద్యోగమే చేయాలి. ఈ రోజే నాకు తెల్సిన ఓ పెద్ద మనిషికి రాస్తాను"

ఆయన వుత్తరం రాశాడు. కానీ వుద్యోగాలు వుత్తరాలతో దొరికితే ఇంక కావల్సిందేమిటి?

ఈలోగా సంధ్యారాణి పెళ్ళి వివరాలు ఫొటోలు పత్రికల్లో వచ్చాయి. సినిమా పరిశ్రమలో ప్రముఖులంతా వెళ్ళేరుట! ఓ ఫొటోలో వర్ధమాన నటుడు సుధాకర మూర్తి కూడా వున్నాడు.

"అయితే అక్కా నేనో విషయం అడుగుతాను చెప్పు. నువ్వు వుద్యోగంలో చేరి నాకు కట్నం డబ్బు వెనకేసేకనేనా నాకు పెళ్ళి? ఇదంతా జరిగేటప్పటికి నేను ముసలిదాన్ని అయిపోతానేమో?" ఝాన్సీ సహనాన్ని కోల్పోతోందన్నది స్పష్టం. ఆ విషయాన్ని పలు రకాలుగా వ్యక్తం చేస్తోంది మధ్య.

"ఏమిటే నీకు పెళ్ళి తొందర? కొంత నిగ్రహం అవసరం"

"అవసరమనే ఇన్నాళ్ళు నిగ్రహించుకొన్నాను. కానీ ఇంకా తొందరంటావేమిటి నువ్వు? నాకేం తక్కువ వయసుందా? పెళ్ళి చేసుకొన్నట్లయితే ఈ సరికి నువ్వు కుటుంబ నియంత్రణాన్ని అమలు జరిపి వుండేదానివి. నేను 'ఇద్దరా ముగ్గురా' అని తర్కిస్తుండే దాన్ని మొగుడితో"

"అసలు నీకీ పెళ్ళి పిచ్చి ఎలా పట్టిందో చెప్పు?"

"నీకా చదువు పిచ్చి, వుద్యోగంపిచ్చీ ఎలా పట్టేయో చెప్పు. ఇంత చదివేవు కాని ఏం లాభమే అక్కా? శరీరధర్మాలు మనోధర్మాలు మనిషి కొక్కోరకం. అక్కా చెల్లెళ్ళమే అయినా నువ్వూ, నేనూ రూపురేఖల్లో ఒక్కలాగా వున్నామా? పోలిక లుండవచ్చు. అలాగే శరీర వాంఛల విషయంలో, మన స్తత్వాల విషయంలో కూడాను!"

"అయితే ఏమంటావు?"

"ఇంకా ఏమనను? నాకీ జన్మలో పెళ్ళి కాదనుకొంటాను. అయినా పెద్దదానివి నీకు కానిదే నన్నెవరు చేసుకుంటారులే! అసలు ఆ సుధాకరమూర్తిని చేసుకోవటానికి ఏమిటి నీ అభ్యంతరం? ఫొటోల్లో చూస్తే మీ సంధ్యారాణి మొగుడి కన్నా బాగున్నాడే! ఈ కాలంలో కులాలు గిలాలు అనుకొంటే కుదరదక్కా"

ఝాన్సీ ధోరణి ఝాన్సీదే!

అలాంటి సమయంలో సుధాకర మూర్తి దగ్గర నుంచి మళ్ళీ వుత్తరం వచ్చింది. ఈ తడవ ఝాన్సీ ఆ కవరును చించి వుత్తరం చదివేకనే అక్కా దగ్గరకి పట్టుకొచ్చింది.

"మీ విలన్‌గారు మన వూరు వస్తున్నారుటోయ్ అక్కయ్యగారూ. షూటింగుట! నీకు సినిమాల్లో వేషం ఇప్పిస్తానంటాడేమిటి? పోనీ ఆ వేషమేదో నాకిప్పించరాదు?హాయిగా సినిమాలో ఎక్‌స్ట్రా వేషం వేసినా మగ ముండా కొడుకులు పెళ్ళి చేసుకోవటానికి క్యూలో కట్నాలు పట్టుకొని నిలబడతారు? ఇంచక్కా మీకు నా బరువు తీరిపోతుంది."

చెల్లెల్ని వదిలించుకొని వుత్తరం చదువుకొంది రుద్రమ.

సంధ్యారాణి పెళ్ళి అత్యంత వైభవంగా, సంపదిగా జరిగింది. చిత్రమేమంటే సుధాకరమూర్తిని అంతా ప్రత్యేకించి గౌరవించారు. సంధ్యారాణి క్లాస్‌మేట్‌గా, స్నేహితుడిగా కూడా ప్రచారం చేశారు.

"సినిమా ప్రేమలు,గౌరవాభిమానాలూ అలాగే వుంటాయండీ రుద్రమదేవిగారూ! పైకి పోయేవాళ్ళని గౌరవిస్తారు. పడి

పోవటం ప్రారంభిస్తే తలా ఓ తోపు తోస్తారు. పైగా ఈ మధ్య మా నాన్నకి రాజకీయంగా కొంత పలుకుబడి పెరిగింది లెండి! అదీ వారి దృష్టిలో వుండవచ్చు"

ఆ తర్వాత ప్రేమ పాటలు—

"మీ వూళ్ళో మీ వూరిదగ్గర దాదాపు నెల రోజులు షూటింగు. ఇప్పటికే మీ పరిశోధనలు, నిర్ణయాలు అయిపోయి వుంటాయనుకొంటాను. ఆ నెల రోజుల్లో మీతో కొన్ని రోజులైనా గడిపే అదృష్టాన్ని ప్రసాదించండి"

ఇలాగే సాగిపోయింది వుత్తరమంతా. ఉత్తరంలో అడుగడుగునా మర్యాద, మన్నన, ప్రేమాభిమానాలు!

తల్లితో సుధాకరమూర్తితో జరిగిన కథంతా చెప్పింది.

"కులం కాదు. పైగా సినిమానటుడు! ఏం చెప్పనమ్మా? పూర్వం ఓసారి ఏదో చెప్పి ఆ అవకాశం కాస్తా చెడగొట్టేను. నువ్వు మంచిదానివి. బాధ్యత తెల్సిన దానివి కనుక నా సలహానాచరించావ్? ఇప్పుడు నా సలహా అడిగేవు. ర్యూన్సీలాంటి దానివైతే ఎప్పుడో ఆ మూడు ముళ్లూ కట్టించుకొనేది! అప్పుడేం చేసే వాళ్ళం? చిగురుటాకు ముదిరేక పండిపోతుందే కాని మళ్ళీ చిగురించదమ్మా. పండుటాకులు ఎండి కింద రాలుతాయ్. పెంట కుప్ప చేరుతాయ్. చిగురుటాకు దశలోనే దానికిసార్థక్యత వుంటుందమ్మా. శక్తులు లేనప్పుడు అన్నీ సక్రమంగా కావాలనుకొంటే ఎలా ? అవినీతి పనులు చేసేకన్నా నీతిగా సంప్రదాయాలను, ఆచారాలను వుల్లంఘించటం నయంకదూ? నీకిష్టమైతే అతడిని పెళ్ళి చేసుకో. మీ నాన్న కాదనరు. మాకో బరువు తీరుతుందిగా. మిగతా పిల్లల సంగతి సందర్భం వచ్చినప్పుడు చూసుకొందాం. ఈలోకాన్ని డబ్బు నడుపుతోందిగా? డబ్బే అన్నిటినీ చక్కదిద్దుతుంది"

తల్లి ఆశీస్సు లభించినట్లే. ఎంతవాస్తవంగా ఆలోచించింది. తండ్రి ఎలాగూ కాదనడు.

ఆ అభ్యంతరం అలా తొలగిపోయాక కొన్ని రోజులు తను స్వతంత్రంగా మరో మార్గంలో ఆలోచించింది.

తనను సుధాకరమూర్తి భార్యగా ఊహించుకొంది. ఆ భావనే చేదుగా కనిపించింది. అతడిని తను ప్రేమిస్తున్నది. నిజమే కానీ భార్యగా వూహించుకోవాలంటే జుగుప్సాకరంగా వుందేం?

మార్కండేయులు భార్యగా వూహించుకొంది. ఏదో మధురానుభూతి!

ఏమిటీ వింత? వ్యత్యాసం?

ఆలోచించగా ఆలోచించగా ఓ విషయం తోచింది.

తను అతడిని మొదట్లో అసహ్యించుకొంది. అతనిలో మార్పు వచ్చాక ఆ మార్పును అభిమానించింది. అతను ప్రేమించటం ఎక్కువయ్యాక తనూ అతన్ని ప్రేమిస్తున్నాననుకొంది. కానీ, అసహ్యం లేకపోవటం ప్రేమ అవుతుందా?

పోనీ ప్రేమించక పోతేనేం? పెళ్ళి చేసుకోవచ్చుగా? ప్రపంచంలో అందరూ ప్రేమ వివాహాలే చేసుకొంటున్నారా? పెద్దలు కుదిరించిన పెళ్ళిళ్ళేగా? ఆ ఆలోచన మనసుకు యింపుగా తోచలేదు.

ఆయిదారేళ్ళ క్రితమయితే ఆ పనిచేయగలిగేదేమో!

కానీ ఇప్పుడు అజ్ఞాతంగా మనసులో ఏవో కోరికలు ఏర్పడ్డాయి. అవ్యక్తమైన

లక్ష్యాలు వున్నాయి. భావాలు వున్నాయి. వీటన్నిటినీ తోసి రాజనటం సాధ్యమా?

పైగా ఆ సినిమా వాతావరణం, ఆ కృత్రిమ నటనలు, తను అసలు భరించలేదే?

"అమ్మాయ్. శుభ వార్త. నీ కు ఉద్యోగం అయింది. ప్రభుత్వ కాలేజీలో లెక్చరర్ ఉద్యోగం. కానీ మన వూళ్ళో కాదు. ఫోను చేస్తే మా ఎడిటర్ గారికి చెప్పారు. నాలుగు రోజుల్లో ఆర్డర్స్ వస్తాయట!"

"అంటే-పెళ్ళి కాని పిల్లను ఒంటరిగా ఏ కానన గంతలకో పంపిస్తారా?"

"ఆహా! దానితో పాటు నువ్వూ నేను ప్రయాణమై పోదాం" వ్యంగ్యంగా అన్నాడు మాధవరావు. "చూడమ్మాయ్-మీ అమ్మ! నన్నే ఛాదస్తుడినంటోంది లోకం. నా కన్నా ఛాదస్తురాలు మీ అమ్మ. రెండేళ్ళు ఎక్కడో ఒంటరిగా చదివొచ్చిన పిల్ల-మరో 6 నెలలు ఒంటరిగా ఉద్యోగం చేయలేదా? నాకు తెల్సులే ఆ మాత్రం. నాకు పెద్ద కొడుకయినా కూతురయినా నా తల్లే!"

ఆ రోజే సుధాకరమూర్తికి వుత్తరం రాసింది రుద్రమదేవి.

"నా ఆత్మ పరీక్షలో తేలిన అంశాలివి.

నేను మిమ్మల్ని మంచి స్నేహితుడిగా ప్రేమిస్తున్నాను. అభిమానాన్ని పెంచుకొన్నాను. భార్యాభర్తల సంబంధం ఆ ప్రేమాభిమానాలకు విఘాతమే కాని పెంచదు.

అంచేత మంచి స్నేహితులుగా మిగిలిపోదాం.

ఇక మీరు ప్రస్తావించిన రెండో విషయం. ప్రతి వ్యక్తికి అభిరుచులు వుంటాయిగా? మీకు సినిమాల్లో నటించాలని మొదటినుంచీ కుతూహలంగా వుండేదిగా?

అలాగే నేను ఎమ్మేలో వుండగా మంచి ఉపాధ్యాయురాలిని కావాలన్న కోరికను పెంచుకొన్నాను. అదృష్టవశాత్తు ఆ అవకాశం వచ్చిందివాళే. నేనంతకన్నా కోరుకునేదేముంటుంది?"

ఉత్తరం రాసి పోస్ట్ చేశాక పెద్ద బరువు దించుకొన్న భావన కలిగింది రుద్రమకు. మనసు స్వచ్ఛమయింది.

ఆర్డర్ రాగానే వెళ్ళి ఉద్యోగంలో చేరిపోయింది.

* * *

రిక్షా దిగి కాలేజీ కాంపౌండ్‌లోకి అడుగు పెడుతుంటే రుద్రమకెందుకో కొద్దిగా కాళ్ళు వణికి నట్లయింది. గుంపులు గుంపులుగా ఆడా మగా పిల్లలు నవ్వు మొహాలతో లోపలికి వెళుతున్నారు.

ఆ కాలేజీకి పెద్ద కేంపస్ వుంది. మెయిన్ గేటులో నుంచి అర ఫర్లాంగుకు పైగా నడిస్తే కానీ కాలేజీ భవనాలురావు. గేటుకు ఎదురుగా అశోకుడి స్తంభంలా ఓ స్తంభం. ఆ స్తంభం ఉపరి భాగాన సరస్వతీ విగ్రహం. అధో భాగాన నాలుగువైపులా ఏవో ఫలకాలు.చుట్టూరా సిమెంటు చేసిన చప్టా.

సరస్వతీ విగ్రహానికి ఒక వైపు సైన్సు బ్లాకు, మరో వైపు ఆర్ట్సు బ్లాకు.

రుద్రమ సరస్వతి విగ్రహం వైపు




చూసింది. డాక్టర్ రామమోహన్‌ను తల్చుకొంది.

సరస్వతి విగ్రహానికి కాస్త ఇవతలగా ఓ వ్యక్తి నిల్చొని వున్నాడు. నల్లటి చాయ. బట్ట తల. బట్ట తలలో అక్కడక్కడ గాలికి ఎగురుతున్న తెల్ల వెంట్రుకలు. హాఫ్ పాంటు - చొక్కాలాంటి రంగు బనియను—నెత్తిన హేటు—చేతిలో పోలీస్ ఆఫీసర్లు వాడే నల్లటి మోచేతి పొడుగు కర్ర కాలికి చూట్లు -

ఆ వ్యక్తికి అల్లంత దూరంలో వుండగానే విద్యార్థినీ విద్యార్థులు మాటలు, నవ్వులు చాలించి చాలా అమాయకంగా మొహాలు పెట్టి అతి వినయాన్ని నటిస్తూ పిల్లుల్లా తలలు వంచుకొని వెళుతున్నారు. ఇందుకు విభిన్నంగా ఎవరయినా వుంటే ఆవ్యక్తి హెచ్చరిస్తున్నాడు. "ఒరేయ్ దేవాలయాన్ని ప్రవేశించారు మీరు. అదిగో సరస్వతీదేవి విగ్రహం. సినిమా హాలు అనుకొనేరు దాన్ని. సరస్వతీ మందిరం.

మనస్సుల్ని పవిత్రం చేసుకొని చదువు పట్ల అభిరుచితో లోపలికి వెళ్ళండి."

సేనా నాయకుడి కమేండును శిరసావహించి వెళ్ళే సైనికుల్లా విద్యార్థినీ-విద్యార్థులు అక్కడ రెండు పాయలుగా చీలి కొందరు ఆర్ట్సు బ్లాకు వైపు, మరి కొందరు సైన్సు బ్లాకు వైపు క్రమ శిక్షణాయుతంగా పోతున్నారు.

ఈ కాలంలో విద్యార్థినీ,విద్యార్థులను ఇంత అదుపులో ఉంచుకోగలిగిన ఆ వ్యక్తి ఎవరా అని ఆశ్చర్యపోయింది చంద్రమ! ఆగి ఆ విచిత్రాన్ని కాస్సేపు చూడాలనిపించింది. కానీ భయం వేసింది. అనుకోకుండానే ఆర్ట్సు బ్లాక్ వైపు నడిచింది.

కోట బురుజులా మొత్తం కేంపస్ అంతా కనిపించే ఓ గది ప్రిన్సిపాల్‌ది. సులభంగానే కనుక్కొని వెళ్ళగలిగింది. విద్యుచ్ఛక్తితో మోగే బెల్లు గణ గణ మోగింది కాలేజీ అంతటా. బిల బిల మంటూ ఫుల్ సూట్‌లో వున్న లెక్చరర్లు తమ తమ రూములలో నుంచి బయటి కొచ్చారు. క్లాసులు నిశ్శబ్దమయ్యాయి. కేంపస్ అంతా ప్రశాంతత నెలకొంది.

లెక్చరర్లు తమ తమ క్లాసు రూముల ముందు నిల్చున్నారు. ఒకరూ అరా విద్యార్థులు కదలబోతున్న రైలును అందుకో ప్రయత్నించే ప్రయాణికుల్లా క్లాసుల్లోకి పరుగులు తీస్తున్నారు.

ప్రిన్సిపాల్ గారిని గురించి ఆయన గదికి ముందున్న బంట్రోతును వాకబు చేసింది చంద్రమ.

"ప్రిన్సిపాల్‌గారా!? అదుగో-అక్కడే వున్నారుగా?"

ఎవరు? హాఫ్ నిక్కర్, బనీను వేసుకొన్న ఆ వ్యక్తే ప్రిన్సిపాలు! రూపాన్ని, వేషాన్ని చూసి డ్రిల్లు మాస్టరో, యన్.సి.సి. ఆఫీసరో అయి వుంటాడనుకొంది. తమ గదులు దాటి బయటికి కొచ్చే ప్రిన్సిపాల్స్ కూడా వున్నారా!

"మూడో బెల్లు అయిన తర్వాత పది నిమిషాలక్కాని రారు ఇక్కడికి. అలా నిల్చోకండి. ఆ బల్ల మీద కూర్చోండి"

మూడో బెల్లు కాబోలు!కానే అయింది. అంత వరకు క్లాస్ రూమ్‌ల ముందు నిల్చున్న లెక్చరర్లు హుందాగా క్లాసుల్లోకి ప్రవేశించారు. లెక్చరర్లు పిలిచే 'రోల్ కాల్' తప్ప అంతటా ప్రశాంతత? అంత పెద్ద కాలేజీ ఆవరణలో పిట్ట లేదు.

తెలుగు దేశంలోని ప్రభుత్వ కాలేజీ అనుకుని తాను పొరపాటున ఏ సైనిక కాలేజీలోకో రాలేదు కదా ?

గది వాకిలికున్న ప్రిన్సిపాల్‌గారి నేమ్‌బోర్డ్ చూసింది. మేజర్ మహమ్మద్ రవూఫ్‌ఖాన్ !

ప్రిన్సిపాల్ ఆర్ట్సు బ్లాక్‌లో క్లాసుల ముందుగా వరండా అంతా తిరిగి మేడ మెట్లెక్కాడు ఆ చివరన. మళ్ళీ పైన క్లాసుల ముందుగా వరండా అంతా నడిచి రూము చేరుకొన్నాడు.

"నమస్కారమండీ"

"ఎవరివమ్మా ? చంద్రమదేవివేనా ! లోపలికి రా!"

బెరుకుగా లోపలికెళ్ళింది ఆయనవెంట. జాయినింగ్ రిపోర్టు కాగితం ఆయన ముందుంచింది. దానికి జతపర్చి సర్టిఫికేట్లు.

"యూనివర్శిటీ ఫస్టు. గుడ్ కంగ్రాచ్యులేషన్స్. కానీ పాఠాలు చెప్పటంలో కూడా ఫస్టు అనిపించుకోవాలి. ఇందాక వస్తూ చూశావుగా ? ఐవాంట్ డిసిప్లెన్-

నాట్ ఓన్లీ యిన్‌ది కేంపస్ బట్ ఆల్సో యిన్ ది క్లాస్ రూం"

"కేశవరావుగారూ! ఈమెకు తెలుగు డిపార్టుమెంటు హెడ్డుగారి రూం చూపించండి"

తెలుగు డిపార్టుమెంటు హెడ్డు పేరుకే కాకుండా స్వభావ సిద్ధంగా కూడా ధర్మరాజు. ఎంతో మంచివాడు. శాంత స్వభావుడు. అయనకున్న రెండు వ్యసనాలలో ఒకటి పుస్తకాలు చదవటం. రెండోది చీట్లాట ఆడటం.

"నమస్కారమండీ!"

దీక్షతో చదువుతున్న పుస్తకంలో నుంచి మొహాన్ని బయటపెట్టి చిరునవ్వుతో నమస్కారాన్ని అందుకొన్నాడు.

రుద్రమదేవి తనను తాను పరిచయం చేసుకొంది.

"అలాగా! మంచిది" అన్నాడు ఆమె చెప్పిన ప్రతిదానికి ఏమీ అడగలేదు. పుస్తకంలోకి మళ్ళీ తల దూర్చేడు.

"నా క్లాసులూ ఆ విషయం..." రుద్రమే డిస్టర్బ్ చేసింది ఆయన్ని మళ్ళీ

"అలాగా! మంచిది. క్లాసు తీసుకో. టైంటేబిల్ విషయాలు హనుమంతరావు అని అసిస్టెంట్ లెక్చరర్ వున్నాడు. సీనియర్ అతడిని అడుగు చెపాడు"

మళ్ళా పుస్తకంలో మునిగేడు.

ఆయన గదినుంచి రుద్రమ బయటపడింది. కానీ ఎక్కడికి పోయేటట్లు? ఆ హనుమంతరావు ఎవరో?ఎక్కడుంటాడో?

మెల్లగా ఎవరి సహాయంతోనో ఆ హనుమంతరావును పట్టుకొంది. అతనప్పుడే క్లాసునుంచి వచ్చాడు. మొహం నిండా చమట! రొప్పుతున్నాడు.

రుద్రమ ఎవరో తెల్సి వచ్చాక అతని మొహంలోకి జీవం వచ్చినట్లయింది.

"మీ కోసమే ఎదురు చూస్తున్నామండీ? మీ పోస్ట్ ఖాళీ. హెడ్‌గారు క్లాసులు తీసుకోరు. ట్యూటర్లని క్లాసులు తీసుకోమంటే హత్య చేసేలా పైకి దూకుతారు. యిద్దరం 'ఏయల్స్'మి. ఎన్ని క్లాసులని తీసుకోం చెప్పండి? యిప్పుడు మీ క్లాసు వుంది" అన్నాడు టైమ్‌టేబిల్ చూసి.

అప్పటికే తర్వాత గంట క్లాసు లున్న వాళ్లు క్లాసుల ముందు నిల్చున్నారు.

భయంగా చూసింది రుద్రమ! యింత అకస్మాత్తుగా అదీ వచ్చీ రాగానే క్లాసు తీసుకోటమా?

"తప్పదండీ బాబూ! యూ అవర్ వర్కు ఎడ్జెస్ట్‌మెంటు కుదరదు. అవర్‌కు బెల్లు అయ్యేలోగా వెళ్ళకపోతే పాశం వేసి మన ప్రాణాలు బిగిస్తాడు యముడు. పదండి వెళ్దాం నేనూ వస్తాగా?"

ఇద్దరూ క్లాసు దగ్గరికెళ్ళే సరికి బెల్లు అవనే అయింది. సన్నగా క్లాసులో గోల. ప్రిన్సిపాల్ తన రూమ్ ముందు నిల్చొని వున్నాడు అప్పటికే. హనుమంతరావు, రుద్రమలను చూచి చకచకా క్లాసు దగ్గరికొచ్చాడు.

"మీ యిద్దరిలో ఎవరు తీసుకొంటున్నారు క్లాసును?"

హనుమంతరావు రుద్రమదేవి వైపు చూశాడు.

"నా క్లాసు యిప్పుడే అయిందండీ"

రుద్రమను వెంటబెట్టుకుని ఆయనే క్లాసులోకి తీసికెళ్ళేడు.

"ఈమె మన కాలేజీకి కొత్త లెక్చరర్. యూనివర్సిటీ ఫస్టు ఎమ్మేలో. ప్రతి క్లాసులోనూ ఫస్టే. మీ అదృష్టం



కొద్దీ మన కాలేజీకి వేశారు. ఆమె చెప్పే పాఠం వినగానే కాదు. అందరూ ఆమె లాగా ఫస్టుక్లాసులు తెచ్చుకోవాలి" అంటూ పరిచయం చేసి వెళ్ళిపోయాడు.

అటెండెన్సు పిలుస్తుంటే ప్రమద గొంతు వణికింది. నాలిక తడబడింది. డాక్టర్ రామ్‌మోహన్‌ని గుర్తుచేసుకొంది ఒకసారి. డాక్టర్ రామ్‌మోహన్ మొదటి రోజు చెప్పిన పాఠాన్ని మనసనే పుస్తకంలోనుంచి బయటికితీస్తూ లేచినిల్చుంది.

దాదాపు ఎనభై మంది విద్యార్థినీ విద్యార్థులతో గేలరీ నిండి వుంది. అయినా ఆమెకు భయం వేయలేదు.

'వీళ్ళంతా విద్యార్థులు. నేను లెక్చరర్ని. నేను చెప్పటానికొచ్చాను. వాళ్ళు వినడానికి కూర్చున్నారు. నేను గురువును వారంతా శిష్యులు విద్య-అర్థులు'

ఆ భావనతో ఆమెలోకి డాక్టర్ రామ్ మోహన్ సంపూర్ణంగా ప్రవేశించాడు. క్లాసంతా ఓసారి కలయచూచింది.

"మీ పేరేమిటి మేడం?" వెనక బెంచీలనుంచి ప్రశ్న.

"గుడ్! మంచి ప్రశ్న. నన్ను నేను పరిచయం చేసుకోవాలనుకొంటున్నాను. ముందుగా మీ పరిచయం కూడా చేసుకోవాలిగా ? ఆ ప్రశ్న అడిగిన వ్యక్తితో మన పరిచయ కార్యక్రమం ప్రారంభం ఆ విద్యార్థి లేవాలి!"

వెనక నుంచి ఓ పొడుగుపాటి విద్యార్థి లేచాడు.

"ముందు నీ పేరు, గత సంవత్సరం తెలుగులో నీకొచ్చిన మార్కులు, నీ అభిరుచులు తెలపాలి"

అతను చెప్పాడు. అలాగే అంతా చెప్పారు. హుషారు, నవ్వులు! "నా పేరు కాస్త భయంకరంగా వుంటుంది ఎవరికి – దుర్మార్గులకు. కానీ మీరు నా విద్యార్థులు కదా? మంచివారు. కనుక మీకు నా పేరు బాగానే వుంటుంది. జాతీయ భావనను కలిగిస్తుంది. నా పేరు రుద్రమదేవి. ఊరు ప్రస్తుతం యిదే. నా అభిరుచి-తెలియనిది తెల్సుకోవటం, తెల్సింది తెలీనివాళ్ళకు చెప్పటం"

పరిచయాల కార్యక్రమం యిలా అయ్యాక 'భాష – నిత్యజీవితంలో దాని పాత్ర' అన్న అంశం గురించి వుపన్యసించింది. అవర్ అయినట్లు బెల్లు కొట్టే సరికి యింకా సగంలోనే వుంది వుపన్యాసం.

"తర్వాత విరామమే మేడమ్. చెప్పండి"

ఎవరో నిలబడి అన్నారు. దానిని సపోర్ట్ చేస్తూ మరికొన్ని శాల్తీలు లేచాయి.

"ఎందుకు? రేపు క్లాసు వుంటుందిగా మళ్ళీ! ఏ సమయంలో ఏ పని చేయాలో అది చేయాలి. విశ్రాంతి సమయంలో చదువు, చదువుకోవాల్సిన సమయంలో విశ్రాంతి ఆరోగ్యం కాదుకదా?"

క్లాసు బయటికొచ్చింది. అల్లంత దూరంలో ప్రిన్సిపాల్!

విద్యార్థుల్ని క్రమ రీతిలో క్రిందికి పంపుతున్నాడు.

రుద్రమను చూశాడు. నవ్వేడు-చిత్రంగా!

"గుడ్" అన్నట్లు అనిపించింది రుద్రమకు.

"రెండుమూడుసార్లు మీ క్లాసు దగ్గరికి ప్రిన్సిపాలు వచ్చి నిల్చున్నాడు. ఏమైనా గొడవ జరిగిందా? మొదటి క్లాసుగా? మామూలేలే-మీరేం దిగులు పడకండి. మేమంతా వున్నాంగా?" హనుమంతరావు.

అసలు విషయం బోధపడింది రుద్రమకు. ఆమె ఆనందానికి పట్టపగ్గాలు లేవు ఆ క్షణంలో ఆమె లౌకిక బాధలకు, వ్యథలకు అతీతురాలు !

* * *

"అక్కా!

శరీర ధర్మాలు, మనస్తత్వాలు వింతగా వుంటాయని ఒకసారి అన్నాను

కదూ! నిజం. ఎంత ప్రయత్నించీ నీలాగా నిగ్రహశక్తిని అలవాటు చేసుకోలేక పోయాను. సాధనలేక కాదు. నా కోరికలను మొకుల్తో కట్టివేయటానికి నేనెన్ని ప్రయత్నాలు చేశానో ఎలా చెప్పను నీకు! అయితే కట్టివేద్దామనేకొద్దీ మనసుకు వెర్రెక్కిపోతోంది. కోరికలు తుచ్ఛమైనవే కావచ్చు. కానీ నేనేం చేయను?

చివరికి ఆ అవకాశాన్ని నేనే సంపాదించుకొన్నాను. వెళ్ళిపోతున్నాను. సామాజిక పరిభాషలో లేచిపోతున్నాను. ఇప్పుడే నేను నమ్మిపోతున్న వ్యక్తిలాంటివాడితో ఇలా వెళ్ళిపోవటం జూదంలాంటిదని నాకు తెలుసు. జూదం ఆడేవాళ్ళంతా గెలుస్తామనే వెళ్తారు కదా? అలాగే నేనున్నా.

నువ్వు కుటుంబానికి గౌరవం తీసుకొచ్చే పనులు చేస్తున్నావు. నీ సుఖాన్ని త్యాగం చేస్తున్నావు. నాకు తెలుసు. నువ్వు గొప్పదానివి. అయినా ఆ గొప్పతనాన్ని నీ నుంచి నేను నేర్చుకొని కూడా ఆచరించలేని బలహీనురాలినయిపోయాను. మన ఇంటికి నావల్ల 'మచ్చ' తప్పదు. నేనేం చెయ్యను?

నేను ఆడబోయే జూదంలో గెలిస్తే వస్తాను మీ దగ్గరికి. లేకపోతే నేను, నా పుట్టుక-అదంతా ఓ భ్రమ అనుకొని మర్చిపోండి. నాన్న, అమ్మా నన్నెంత వరకు అర్థం చేసుకొంటారో నాకు తెలియదు. లోకం మాత్రం నా మొహాన ఉమ్మేస్తుందని నాకు తెలుసు. కనీసం నువ్వన్నా అర్థం చేసుకోవే అక్కా-

ఝాన్సీ

మద్రమ లెక్చరర్ ఉద్యోగంలో చేరిన కొత్తలో వచ్చిన ఆ ఉత్తరంతప్ప, ఐదు నెలల కాలం ప్రశాంతంగా గడిచిపోయింది.

కాలేజీలో గ్రూపులున్నాయి. కులాల, గుణాల ప్రాతిపదికలమీద ఏర్పడ్డ రకరకాల గ్రూపులవి. టెన్నిస్ ఆడేవాళ్ళ గ్రూపు ఒకటి, చీట్ల పేకాట ఆడేవాళ్ళ గ్రూపొకటి, ప్రతినిత్యం రామకృష్ణమఠం వెళ్ళేవాళ్ళ గ్రూపొకటి, ప్రతి పూటా మందుకొట్టేవాళ్ల ముఠా ఒకటి, షెడ్యూల్ కాస్ట్ వర్గాల గ్రూపు, బేక్వర్డువాళ్ళ గ్రూపు, కమ్మ మేస్టర్ల గ్రూపు, కాపు మేస్టర్ల గ్రూపు, బ్రాహ్మణ లెక్చరర్ల గ్రూపు-అదో మినీ ఇండియా.

ఇవికాక మరో రకం గ్రూపులు. గెజిటెడ్ లెక్చరర్ల అసోసియేషన్, నాన్ గెజిటడ్ లెక్చరర్ల అసోసియేషన్, అందులో మళ్ళీ ట్యూటర్లు డిమానుస్ట్రేటర్ల వర్గం, ఇందులో మళ్ళీ సీనియారిటీలబట్టి హెచ్చుతగ్గులు, తారతమ్యాలు.

అయితే ఏదో ఓ గ్రూపు నిర్ణయాలకు ఖచ్చితంగా ఆ గ్రూపులో వాళ్ళంతా కట్టుబడి వుంటారా అంటే అదీ లేదు. ఎవరికి ఏది అనుకూలంగా వుంటే దాన్ని వాడుకోవటమే!

ఇదిలా వుండగా క్రమంగా మరో రెండు గ్రూపులు మొలకెత్తాయి.

ప్రిన్సిపాల్‌గారి పరిపాలనా ధోరణిని వ్యతిరేకించే వర్గం, విమర్శించే వర్గం. ఈ రెండు గ్రూపుల్లో సభ్యత్వం కులాలకి మతాలకి, గుణాలకి, కేడర్లకి అతీతం. ప్రిన్సిపాల్ పాలనవల్ల వచ్చిన సుఖ దుఃఖాలు, కష్టనష్టాలే ఇందులో సభ్యత్వానికి ప్రాతిపదిక.

ప్రిన్సిపాల్ ఇళ్ళదగ్గర ట్యూషన్లు చెప్పటానికి వీల్లేదన్నారు. దానివల్ల కొందరికి నష్టం. క్లాసులు వదిలెయ్యకూడదు. బెల్లు అయిందాకా పాఠం

చెప్పాలి అన్నాడు. అది కొందరికి కష్టం. పాశ్చాత్య పద్ధతుల్లో సూటో, లేకపోతే భారతీయ సాంప్రదాయం ప్రకారం పంచె, ఉత్తరీయం, లాల్చీనో వెయ్యాలన్నారు. స్లేక్ షర్టులు, టీ షర్టులు వేసుకోని తప్ప కాలేజీకి రామని భీష్మించేవారికి ఆ పద్ధతి విష సదృశ్యమేకదా?

రుద్రమకు ఖాన్‌గారి పద్ధతులు బాగా నచ్చాయి. అలాంటి ప్రిన్సిపాల్స్ ప్రతి కాలేజీకి ఉంటే విద్యావిధానం బాగుపడు తుందని ఎప్పుడూ మనసులో అనుకొం టుంది.

కాలేజీలో ఎవరిదగ్గరాఆమె ప్రిన్సిపాల్ గారి పద్ధతుల్ని గురించి మాట్లాడదు. ప్రిన్సిపాల్ తనని మౌనంగా ఎలా అభిమానిస్తున్నాడో, తనూ అతనిని మనసులో ఆరాధిస్తోంది. అంతే!

అయితే ఖాన్‌గారి వ్యతిరేక వర్గాల వారు ఆమెను ప్రిన్సిపాల్‌గారి అనుకూల వర్గంలో చేర్చేశారు. కాలేజీలో ఎవరితో ఏం మాట్లాడాలన్నా భయం.

ధర్మరాజుకు ఇవేమీ పట్టవు. ప్రిన్సిపాల్ తర్వాత ఆయనే సీనియరు. అంచేత ఆయననెవరూ వీటిలోకి లాగరు. పెద్దమనిషని పేరు. ఇక హనుమంతరావు వ్యతిరేక వర్గంలో ప్రముఖుడు. సర్వీసు వుందనికానీ అతను క్లాసుకు పోతే పిల్లల అల్లరికి అంతుండదు. ఆ అల్లరిని భరించ లేక అతను ఆ క్లాసుల్ని వదిలేయటం అలవాటు చేసుకొన్నాడు. కానీ ఇప్పుడు వీలుకాదే?

కాలం ఎప్పుడూ ఒకే రకంగా వుండదు. ఆపదలు చెప్పిరావు కదా!

ఆరోజు పొద్దున్నే నిద్ర లేవగానే అలవాటుగా శ్రీను మొహాన్నే చూసింది. పూజ చేసుకొనే అలవాటు చేసుకొంది మధ్య. ఆ పూజాదికాలు ముగించుకొంది. వంట చేసుకొంది. తిన్నది. కాలేజీకి వెళ్ళింది. ఫస్టు పీరియడ్ పాఠం చెప్పింది. ఇంటర్వెల్‌కు ముందు అవర్ కూడా క్లాసు తీసుకొంది. మిద్దెమీద నున్న స్టాఫ్ రూమ్‌కు తలవంచుకొని వస్తోంది.

ఇంటర్వెల్ కావటం వల్ల విద్యార్థినీ విద్యార్థులతో వరండా అంతా సందడిగా వుంది. ప్రిన్సిపాల్ కనుచూపు మేరలో అక్కడెక్కడా లేరు. పైగా ఆయన ఆ మధ్య గట్టితనాన్ని కొంత సడలించు కోవాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి.

అకస్మాత్తుగా ఓ విద్యార్థి ఎదురు వచ్చి రుద్రమకు 'డేష్' ఇచ్చాడు. తల వంచుకొని వస్తున్న రుద్రమ ఒక్కసారిగా షాక్ తిన్నట్లయింది. బెదురుగా తల ఎత్తి చూసింది. డాష్ కొట్టిన విద్యార్థి పళ్ళు ఇకిలించి నవ్వుతున్నాడు.

అది యాదృచ్ఛికంగా జరిగిన సంఘ టనలా కన్పించలేదు రుద్రమకు. ఎందు కంటే ఆ యువకుడే ఓసారి ఆమె కొంగు లాగాడు. అతను ఆమె క్లాసు కాదు. ఫైనల్ ఇయర్ స్టూడెంటు. పొరపాటున అయితే అలా ధైర్యంగా నవ్వుతాడా?

ఒకవైపు భయం—అవమానం. మరో వైపు ఆత్మాభిమానం దెబ్బ తిని అతని పైన చర్య తీసుకోవాలన్న కోపం.

"కోపంగా చూస్తుంటే అచ్చం వాణిశ్రీ లావున్నావు మేడమ్"

ఎవరో నవ్వారు. చాలామంది చూస్తూనే వున్నారా దృశ్యాన్ని. కొందరు మాస్టర్లు కూడా! ఎవరూ జోక్యం కలగ చేసుకోలేదు.

ఇదంతా జరిగిందో క్షణంలో!

ఒక్కసారిగా వాతావరణం

'టెన్స్'గా మారింది. విద్యార్థులు ఎటు అవకాశం వుంటే అటు పారిపోతున్నారు. లెక్చరర్లు కొందరు జారుకొన్నారు. మరి కొందరు ఆ విద్యార్థిని నెమ్మదిగా మంద లిస్తున్నారు.

ఎక్కడి నుంచి వచ్చాడో ప్రిన్సిపాల్ అకస్మాత్తుగా ప్రత్యక్ష మయ్యాడు. బొరియలలో నుంచి బయట పడ్డ ఎలుకల్లా బిల బిల లాడుతూ చాలామంది లెక్చరర్లు కూడా చేరుకొన్నారు.

"మేడం మీరు నా రూములో వెయిట్ చేయండి"

రుద్రమ ఇద్దరు స్టాఫ్ మెంబర్ల వెంట రాగా ప్రిన్సిపాలు గదిని చేరిందో లేదో ప్రిన్సిపాల్ ఆ కుర్రాడిని వెంట బెట్టుకొని వచ్చాడు.

"నేను కావాలని ఆమెకు డాష్ ఇవ్వ లేదు. ఆమె నాకు డాష్ ఇచ్చిందని ఎందుకనుకో కూడదు?" విద్యార్థి వాదన.

"ఒరేయ్. మాతృదేవిని పూజించినట్లు పూజించాల్సిన సరస్వతీ మూర్తిని ఆ పని చేసినందుకు కళ్ళు పోతాయి. అబద్ధం కూడా ఆడేవంటే నోరు కూడా పడి పోతుంది. ఇది దేవాలయం. గుర్తుంచుకో లెక్చరర్‌గారి కాళ్ళ మీద పడి క్షమాపణ కోరుకో"

విద్యార్థి ఆ మాటల్ని తిరస్కరించా డని అతని మొహమే చెప్తోంది. పైగా ప్రిన్సిపాల్ పైకి గురి చూశాడు బాణాన్ని ఈసారి.

"మేస్టారూ! ఎంత మీరు ప్రిన్సిపాల్ అయినా మర్యాద ఇవ్వండి. మా నాన్న గారే నన్ను 'ఒరేయ్' అని పిలవరు. మీరు 'ఒరేయ్' అన్న పదాన్ని ఉపసంహ రించుకోవాలి ముందు"

'ఒరేయ్' అనటం ఖాన్‌గారి అలవాటు. విద్యార్థు లెవరూ అభ్యంతరం చెప్పరు.

"విద్యార్థులు మీరు! మిమ్మల్ని మన్నించి గౌరవిస్తే మీకే ఆయువు క్షీణంరా. కాలేజీలో మీకు 'లోకో పేరంట్స్' లాంటి వాళ్ళు మేస్టర్లు. అది కూడా తెలీదా నీకు?"

విద్యార్థి మొండికేశాడు. ఎదురు తిరి గాడు. ఎంతకీ లొంగి రాలేదు.

"మీ నాన్నగారి పేరేమిటి? ఏం చేస్తుంటారు?"

"ఆయన సంగతి మీ కెందుకు? నేను ఎదుటే వున్నాగా!"

ఏం చేసుకొంటారో చేసుకోండని అర్థం.

ప్రిన్సిపాల్ ఖాన్ ఒక్క క్షణం ఆలోచించాడు. పైప్ వెలిగించాడు.

"నీకు చాలా అవకాశా లిచ్చాను. అన్నిటినీ కాదన్నావు. నీలాంటి విద్యార్థు లకు ఈ దేవాలయంలో చోటు లేదు. నిన్ను సస్పెండ్ చేస్తున్నా. కాస్సేపాగి ఆ కాగితం తీసుకొని పో—"

"అక్కర్లేదు" ఆ కుర్రవాడు విసు రుగా వెళ్ళి పోయాడు.

తీరా ఫైలు తెప్పించి అతని వివరాలు చూస్తే ఊళ్ళో ఓ ధనవంతుడి కొడుకు. వాళ్ళ నాన్నకు రాజకీయంగా పలుకుబడి వుంది.

కాస్సేపు మాట్లాడి "మళ్ళీ పిలుస్తాను మాస్టారూ! సాయంకాలం స్టాఫ్ మీటింగ్ వుంటుంది. అందరూ రండి. ప్లీజ్!" అని చెప్పి మిగతా మాస్టర్ల నందరినీ పంపిం చేశాడు. రుద్రమ దేవి ఒక్కతే మిగి లింది రూములో.

"జరిగింది నేను చూశాను. కనుక మీరు చెప్పాల్సిందేమీ లేదు. వాడా పని కావాలనే చేశాడు. అయితే అతడి చర్య

వెనుక 'మోటివ్' తెల్సుకోవాలి నేను. మీకూ, ఆ విద్యార్థికి గల పరిచయాలు ఏమైనా వుంటే చెప్పండి"

దిగ్భ్రమ చెందింది చూసింది రుద్రమ !

"పరిచయాలు వున్నాయని కాదు, వుంటే చెప్పమంటున్నాను. మీ సంగతి నాకు తెల్సు. వాడి చర్య వెనుక పెద్ద కుట్రే వుందని నా అనుమానం. ఇది ఇంతటితో ఆగక పోవచ్చు..."

తనని పమిట లాగిన సంగతి చెప్పింది.

"అప్పుడే నాతో ఎందుకు చెప్ప లేదు ?"

రుద్రమకు కంటి వెంట నీళ్ళు తిరి గాయి. ఏమిటీ పరీక్ష ?

"అప్పుడే చెప్తే వాడికివాళ ఇంత ధైర్యం వచ్చేదా? మీరు పొరపాటు చేశారు. ఒక విధంగా వాడిని ప్రోత్స హించారు"

రుద్రమ ఆత్మగౌరవం కలుక్కు మంది. కన్నీళ్ళు ఆగిపోయాయి.

"ఎంత చదువుకొన్నా ఆడదాని జీవితమే ఇంతండీ ? కొంగు లాగాడని చెప్పుకొంటే సాటివాళ్ళలో చులకనై పోతుంది. చెప్పకుండా వూరుకుంటే లాగినవాడికి చు ల క న అయిపోతుంది"

ప్రిన్సిపాల్ మౌనం వహించాడు. జరిగిందంతా ఆమెచేత కాగితం రాయించు కొన్నాడు.

"ఇవాళైనా మీకు రిపోర్టు చేసేదాన్నో కాదో నాకు తెలియదు సార్. అవమానం, ఆత్మగౌరవం ఈ రెంటి మధ్యా నలిగి పోతున్నాను మీరొచ్చే సమయానికి. ఏమైనా వీలుంటే ఈ విషయం ఇంతటితో ఆగిపోయేలా చూడండి సార్..."

"ఇది మీ వ్యక్తి సమస్యే కాదుగా ? కాలేజీ గౌరవం—డిసిప్లీన్—"

"పోయేది ముందు నా గౌరవమే కదండీ ఓ కాలేజీ విద్యార్థి నన్ను అవమాన పర్చటం కన్నా— దాన్ని పదిమంది చెప్పు కోవటం, ప్రచారం చేయటం నాకు మరింత అగౌరవం కాదా? రేపు నన్ను పెళ్ళెవరు చేసుకొంటారు ? . చిలవలకు పలవలల్లే అలవాటున్న జనం మధ్యనే కదా మనమున్నది?"

"మీ అభిప్రాయం తెల్సుకొన్నాను. మీ గౌరవానికి, కాలేజీ గౌరవానికి, నా గౌరవానికి భంగం కలగకుండా వ్యవ హారం చక్కపర్చటానికి ప్రయత్నిస్తాను. కానీ సస్పెన్‌షన్ ఆర్డర్ మటుకు ఇవ్వక తప్పదు. కాలేజీ నుంచి వెళ్ళేటప్పుడు చెప్పండి. తోడు పంపిస్తాను. శెలవు పెట్టినా అభ్యంతరం లేదు"

ఆ సాయంకాలం సెషన్‌లో సస్పెండ్ చేయబడ్డ విద్యార్థికి మద్దతుగా అతని క్లాస్ వాళ్ళు క్లాసుల్ని బాయ్‌కాట్ చేశారు. కొందరు సీనియర్ లెక్చరర్లు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు.

ఆ విద్యార్థి పేరు కిరణ్. అతని సస్పెన్‌షన్ ఆర్డర్ నోటీస్ బోర్డుకు ఎక్కింది. సస్పెండ్ చేయటానికి కారణం రుద్రమదేవిని దేష్ ఇవ్వటం కాదు. ప్రిన్సిపాల్‌తో అగౌరవంగా మాట్లాడటం.

కిరణ్ తండ్రికి మర్నాడు తనని కలవమని కాగితం పంపించాడు ఖాన్.

ఆ సాయంకాలం 'స్టాఫ్ కాన్సిల్' మీటింగుకు రుద్రమ కూడా ఆహ్వానించ బడింది. ఆమె గౌరవాన్ని నిలపాలన్న విషయంపై ఏకాభిప్రాయమే! అయితే విద్యార్థిని సస్పెండ్ చేయటం విష యంలో భేదాభిప్రాయాలను వ్యక్తం చేశారు.

పైప్ కాలుస్తూ అందరి అభిప్రాయాలను జాగ్రత్తగా విన్నాడు ప్రిన్సిపాల్ ఖాన్.

మర్నాడు కాలేజీలోని మొత్తం క్లాసులు స్ట్రయిక్ చేశాయి. మూడు రోజుల తర్వాత ఊళ్ళో మిగతా కాలేజీలవాళ్ళు మద్దతు స్ట్రయిక్ చేశారు.

ఈ మధ్యలో ప్రిన్సిపాల్ ఖాన్ నిరంకుశ ధోరణికి నినాదాలు చేశారు. ఆయన 'ఎఫిజీ'ని దహనం చేశారు. ఊరేగింపులు జరిపారు.



మధ్యలో రుద్రమాంబను గురించి కూడా దుష్ప్రచారం జరిగింది.

"మిస్ రుద్రమదేవీ! ఈ యుద్ధం మీ మీద కాదు. నామీద. మీకు మిష. మీ బాధను నేనా రోజే అర్థం చేసుకొన్నాను. మీరు శలవు పెట్టి వూరికెళ్ళండి. మిమ్మల్ని బదిలీ చెయ్యమని రాశాను. మీ వూరికి వెయ్యమని నేను పైవాళ్ళతో చెప్తాను—"

ఆ రాత్రి ప్రిన్సిపాల్ ఇంటిమీద రాళ్ళు రువ్వారు. నిక్కరూ, బనీనుతో ఆయన బయటికొచ్చాడు. చేతిలో మామూలుగా వుండే కర్ర తప్ప మరే ఆయుధం లేదు.

"మిలటరీలో బులెట్‌లను ఎదుర్కొన్నాను. మీ రాళ్ళో లెక్కకాదు. మీరు ఎందుకొచ్చారో చెప్పండి" అంటూ ఇంటి మేడమెట్లు దిగి కిందికొచ్చాడు. విద్యార్థుల గుంపు పారిపోయింది.

మర్నాడు ఇదంతా చెప్పి చాలామంది స్టాఫ్ దగ్గర అన్నాడు ఖాన్.

"కొంతమంది రహస్యంగా రాళ్ళు రువ్వగలరు. కొందరు రువ్వించగలరు. కానీ ఎదురుపడితే పారిపోతారు. ఈ పిరికితనం పోవాలండీ మనుష్యుల్లో — ముఖ్యంగా మేస్టర్లలో!"

ఎవరో కొందరు మేస్టర్ల హస్తం ఈ గొడవలో వున్నట్లు ఆయన అనుమానిస్తున్నాడని అందరూ గ్రహించారు.

తన విషయంకన్నా ఖాన్‌గారి విషయమై రుద్రమ బాధపడింది.

అంత చిన్న విషయానికే తనంతగా బాధపడిపోయి ఏడ్చిందే? మరి ఇంత పెద్ద సమస్యను ఆయన ఎలా ఎదుర్కోగలుగుతున్నారు? అదీ అంత నిబ్బరంగా, ధైర్యంగా. ఆయన ఉక్కు గుండెకు మనసులో జోహారులర్పించింది.

ఆ రోజే ఆమె శలవుపెట్టి వెళ్ళిపోయింది వూరికి. ఖాన్‌గారు అన్నట్లే ఆమెకు బదిలీ ఆర్డర్స్ వచ్చాయి—తన స్వంత వూరి కాలేజీకి.

"పోనీయలేవే! మీ నాన్న చేయించలేని పనిని ఆ విద్యార్థులో, ప్రిన్సిపాలో చేసి పుణ్యం కట్టుకొన్నారు. ఝాన్సీ అలా చేసిపోయిందా? నీ గతేమిటా అనుకొని కుమిలిపోతున్నాననుకో"

అయితే రుద్రమ తల్లిలా అనుకోలేక పోయింది.

ఒక వ్యక్తి చేసే మంచి పనులను అర్థం చేసుకొని హర్షించే దెప్పుడు? విద్య పట్ల, విద్యార్థుల అభివృద్ధి పట్ల నిజంగా ఆసక్తి వుండి కృషి చేసే కొద్దిమంది మేస్టర్ల గతి ఇలా అవుతే ఇక విద్యా విధానం బాగుపడేదెట్లా? కంచే చేను మేస్తే కాపాడే దెవ్వరు?

అలాంటి ఆలోచనలే ఎప్పుడూ. ఉత్సాహం చచ్చి పోయింది. పాఠాలు చెప్పాలన్న పూర్వపు శ్రద్ధ మాయమైంది. యాంత్రికం—అంతా యాంత్రికం! చైతన్యపు నడుము విరిగినట్లయింది!




యవ్వనంలో వున్న ఏ వ్యక్తి జీవితంలోనైనా మూడు సంవత్సరాలు చాలా

ముఖ్య మైనవి. అలాంటి మూడు సంవత్సరాలు రుద్రమ జీవితంలో వృధాగా ఖర్చయి పోయాయి!

ఆమె ఇప్పుడు వయసుకన్నా పెద్దదిగా కన్పిస్తున్నది. కట్టుబొట్టుపట్ల శ్రద్ధ ఏమాత్రం చూపదు. తను క్లాసులో ఏం చెప్పాలనే విషయం కూడా ముందుగా ఆలోచించదు. క్లాసులో కూర్చోని ప్రపరేషన్ అవటమే. బాగా చెప్పిననాడు తృప్తి లేదు. బాగా చెప్పనినాడు దిగులూ లేదు!

ఆమె అదృష్టమేమో! ఖాన్‌కు పూర్తిగా వ్యతిరేక స్వభావం కల ప్రిన్సిపాల్ ఆ కాలేజీలో వున్నాడు. ఆయన కాలేజీలో ఎవరు పాఠాలు చెప్తున్నదీ, ఎవరు చెప్పందీ గమనించడు. అసలు రూము వదిలి బయటికి రాడు. వచ్చినా బయటి ప్రపంచాన్ని చూడడు.

అంచేత రుద్రమ క్లాసుల్ని తరచూ వదిలేయటం నేర్చుకొంది. అప్పుడు విద్యార్థుల మొహాల్లో వెలిగే ఆనందం చూసి 'ఇంత అల్ప సంతోషులూ, అజ్ఞానులూ నేం పిల్ళు?' అనుకొని మనసులో అప్పుడప్పుడూ వ్యథను చెందుతుంది.

స్వాతంత్ర్యభానుడు ఇంజనీరింగ్‌లో చేరాడు. దాదాపు పూర్తి కావస్తోంది కూడా. మిగతా పిల్లలు బాగానే వృద్ధిలోకి వస్తున్నారు.

ఝాన్సీ లేచిపోయిన కొత్తలో అనసూయ, మాధవరావులు కొంత కలత చెందారు. గాబరా పడ్డారు. కానీ క్రమంగా ఆ విషయాన్ని మర్చి పోవటం నేర్చుకొన్నారు.

అందుకు కొంత వరకు కారణం రుద్రమ. ఎదురుగా వున్న కూతురిని వదిలేసి ఎక్కడికో చెప్పా పెట్టాకుండా లేచిపోయిన పిల్లకోసం దిగులు చెందటం దేనికి?

సుధాకరమూర్తి ఆ మూడేళ్ళలో విలన్ పాత్రలనుంచి కేరక్టర్ యాక్టర్‌గా ఎదిగేడు. సంధ్యారాణి రాసిన కథ ఆధారంగా తీసిన సినిమాలో అతనికి మంచి పేరొచ్చింది. అప్పటినుంచీ అతను బాగా ఎదిగిపోయాడు. బిజీ ఆర్టిస్ట్ అయ్యాడు. ఏ గోడమీద చూసినా అతని బొమ్మలే!

సంధ్యారాణి రాసిన సినిమా కథకు ఏవో బహుమతులు కూడా వచ్చాయి. అయినా ఆ తర్వాత మళ్ళీ సినిమాకు కథ రాయలేదు సంధ్యారాణి.

సుధాకరమూర్తి సంధ్యారాణి పట్టిందంతా బంగారం ఎలాగవుతోంది? వాళ్ళు అనుకొన్నవన్నీ సాధించగలగటం వెనుకగల రహస్యమేమిటి? తాను ఎందుకు వంచించబడుతోంది?

ఆ సంవత్సరం రుద్రమదేవికి? ఎగ్జామినర్ షిప్పు వచ్చింది. యూనివర్సిటీ లోనే స్పాట్ వాల్యుయేషన్!

"మళ్ళీ ఒంటరిగా వెళ్ళి అక్కడేం బాధలు పడ్తావు? ఎందుకులెద్దూ!" అనసూయమ్మ అంది.

అయితే రుద్రమ మనసు కొంత మార్పును వాంచిస్తోందిమధ్య. చదువు కొన్న చోటు. డాక్టర్ రామ్‌మోహన్ గారిని చూడాలి. కాశికాంబతో ఓ పూట గడపవచ్చు. ఎలా వున్నారో వాళ్ళంతా? పైగా డబ్బు వసుంది చేదా?

ఆ రోజు కాలేజీకి వెళ్ళేముందు జడ వేసుకొంటుంటే తలలోని ఫలిత కేశ మొకటి దువ్వెనకుయిరుక్కొంది. వులిక్కిపడింది రుద్రమ! అద్దంలో చూసుకొంది తలలో మరికొన్ని తళుక్కుమన్నాయి.

"తల నెరవటమేం ఖర్మ? మరి

కొన్నాళ్ళు పోతే ముఖంలో ముడతలు కూడా కన్పిస్తాయి! ఎలాంటి పిల్ల ఎలా గయిందో?" అనసూయమ్మ ఆవేదన చెందింది.

చివరికి స్పాట్ వాల్యుయేషన్‌కు వెళ్ళ డానికే నిర్ణయించుకొంది.

బయలుదేరేరోజు ప్రయాణానికి సిద్ధ మవుతుండగా శారద ప్రత్యక్ష మయింది. వెంట రవీంద్ర లేడు. నాలుగు సంవత్స రాల బాబున్నాడు! కడుపుతో వున్నట్లు మనిషినిచూస్తూనేఅర్థంచేసుకొన్నారంతా.

"ఎప్పుడో ఇంతవాడుగా వుండగా చూశారు కదూ? వీడు నా సుపుత్రుడు!"

ప్రమద కుర్రాడిని దగ్గరికి తీసు కొంది. అంతా శారద పోలికేగా! మొహం కన్నా అతడు వేసుకొన్న డ్రెస్ బాగా వుంది.

"పేరేమిటి బాబూ?"

"ప్రొఫెసర్ దత్–"

ఠీవిగా అన్నాడు కుర్రాడు, అందరికీ నవ్వొచ్చింది.

"నీకు పుట్టవల్సిన వాడే ప్రమదమా. పుస్తకాల పురుగనుకో. అక్షరాలు రాక పోయినా పుస్తకాలు ముందేసుకు కూర్చుం టాడు. ఎలా పుట్టిందో బుద్ధి! ప్రొఫెసర్ అవుతానంటాడు. అటు అత్తింట్లో ఇటు పుట్టింట్లో కాగడాలు వేసి చూసినా ఎమ్మే చదివిన వాళ్ళే లేరే! మరి వీడికి బుద్ధేమి టంటా? అప్పటికీ నేనూ, ఆయన 'చెడి పోకురా తండ్రీ' అని నెత్తీ నోరు కట్టు కొని చెప్తున్నాం. ఇక వాడి తాత వాడిని మార్చాలి"

"ఒంటరిగా వచ్చేవేమమ్మా? మీ ఆయన్ని కూడా వెంట తీసుకొని రాక పోయావా పోనీ. పైగా ఒట్టి పిల్లవూ కాదు"

"ఆయనెందుకండీ యింకా? దండగ. చేయి పట్టుకొని ఓ బిడ్డ, కడుపులో ఓ బిడ్డ–ఆడదానికి అంతకన్నా రక్షణేమి టండీ? అందుకే మా వాళ్ళనీ రావద్ద న్నాను. వీళ్ళిద్దరూ చాలనన్నట్లు పైగా ఆయన బరువెందుకు ? మీ కాయనగారి సంగతి తెలీదులెండి. పైగా నన్నే మగాడు కన్నెత్తి చూస్తాడండీ? నేనేం ప్రమదమనా? మహా మహా దినాలలోనే నన్ను చూసి భయపడిపోయేవారు జనం" అంటూ ప్రమదను చూచి ఉలిక్కిపడింది. "అదేమిటే ప్రమదా! నేను మొగుడితో కాపురంచేసి, పిల్లాడిని కని డొక్కునవుతే నువ్వు పెళ్ళన్నా కాకుండా అలాగయ్యా వేమిటి? ఇలాగుంటే నిన్నెవరు చేసు కొంటారే యింక? ఛఛ! ఎంత అందంగా వుండేదానివి! ఎలాగయ్యావ్?"

"నువ్వన్నా చెప్పమ్మా అలాగ!"

"చెప్పేదేమిటండీ! ఏదో సంబంధం నిర్ణయించండి మీరు. ఎలా చేసుకోదో చూస్తాను. ఇన్నాళ్ళు యిన్ని చదువులు చదివి, ఇంతకాలం ఉద్యోగంచేసి ఒక్క 'మగ పురుషుడిని'పట్టి పెళ్ళి చేసుకోలేక పోయిందంటే దానికా టెక్నిక్ తెలీదన్న మాట! మీరే పూనుకోవాలింక"

ఈలోగా శారదను తీసుకుపోవటానికి వాళ్ళవాళ్ళు బజారులో పనులు చూసుకొని వచ్చారు.

శారద వెళ్ళిన కాస్సేపటికే ప్రమద కూడా ప్రయాణమయింది. రైలు దిగి నేరుగా కాళికాంబగారింటికే వెళ్ళింది.

"ప్రమదమా నువ్వా! గుర్తుపట్టలేక పోయాను సుమా వెంటనే?"

కాళికాంబ మారలేదు. అదే నిండు

దనం. వదనంలో అదే ప్రసన్నత.

పిల్లలు కాస్తంత పెద్దవాళ్ళయ్యారు. చదువుకొంటున్నారు.

తను వచ్చిన పని చెప్పింది రుద్రమ. కొద్దికొద్దిగా తన కథ చెప్పుకొంది.

"ఎంత ఆనందంగా వుందో రుద్రమా నీ రాక నాకు! నువ్వు నా ఇంట వుండటమే నాకు పండుగ. డబ్బు సంగతి ఆలోచించకు. డబ్బు శాశ్వతం కాదుగా? స్నేహం, మంచితనం కూడా జీవితంలో అవసరాలే. చిన్నదానివైనా నువ్వు నాకు స్నేహితురాలివి. బంధువువి. నువ్వు ఇక్కడ వున్నన్ని రోజులూ నా ఇంట్లోనే వుండు."

రుద్రమ పూర్వం వున్న చిన్న గదిలో ఎవరో అద్దెకుంటున్నారు. కానీ ఆ గదికి, వీరింటికీ మధ్య తడిక అడ్డంగా వుంది. ప్రశార్థకంగా ఆ అడ్డుగోడవైపు చూసింది.

"నీలాంటి విద్యార్థినులే వుంటున్నారు. కానీ నీలాంటి గుణాలవారే వుండరుగా అందరూ? అద్దెకిచ్చాక ఎవరి సరదాలని కాదంటాము. చూడలేనప్పుడు కళ్ళు మూసుకోవటం ఉత్తమ మార్గం అంటారు కదా?"

రుద్రమాంబకు ఆమె భావన అర్థం అయింది.

"పైగా చిన్నపిల్లలున్న ఇల్లు. నాకేమో ఆ కాస్త అద్దె వస్తే వేన్నీళ్ళకు చన్నీళ్ళుగా ఉపయోగపడుతుందని ఆశ"

స్పాట్ వాల్యుయేషన్‌ను గురించి విన్నది రుద్రమ. కానీ అది ఆమెకు కొత్త అనుభవం. మొదటిరోజు దిద్దాల్సిన పాతిక పేపర్లలో పది కూడా దిద్దలేక పోయింది.

"రుద్రమదేవిగారూ! అలా అక్షరం అక్షరం చదువుతూ కూర్చుంటే ఈ పేపర్లన్నీ వాల్యూ చేయటానికి మనకు ఆరు నెలలు కూడా చాలదు. మరి ఆరు నెలల్లో ఫెయిల్ అయినవాళ్ళు మరో పరీక్ష కూడా రాయాలే! పేపర్లు వాల్యూ చేసే టెక్నిక్‌ను తెల్సుకోవాలి ముందు" ఛీఫ్ ఎగ్జామినర్‌గారు మందలించారు.

ఆ టెక్నిక్ నేర్చుకోవటానికి అదేం బ్రహ్మవిద్యా కాదు, భూతవిద్యా కాదు. చూడకుండా చూసినట్లు టిక్కులు కొట్టి మార్కులు పడెయ్యటమే!

నాలుగు రోజులు ప్రయత్నిస్తే కానీ ఆ అన్యాయపు పద్ధతికి అలవాటుపడలేక పోయింది.

"రుద్రమదేవిగారూ! మీ వాల్యుయేషన్ ఇప్పుడు చాలా 'బేలెన్స్‌డ్'గా వుంది"– మూడు రోజులుగా కష్టపడి దిద్దితే నసిగిన ఛీఫ్ చూడకుండా మార్కులేసిన రోజు మెచ్చుకొన్నాడు. నవ్వాలో, ఏడ్వాలో అర్థం కాలేదు రుద్రమకు!

జీవితంలో అన్ని విలువలూ ఇలాగే మారుతున్నాయేమో! విలువల కొలమానాల్లో ఎంత పతనం? యాంత్రిక నాగరికత సృష్టించిన విష ఫలాల్లో ఈ దృక్పథాల్లో మార్పు ఒకటి కాదుకదా? ఈ స్థితికి తనొకత్తే కళ్ళెం వేస్తే ఆగుతుందా? వెనక్కి తిరుగుతుందా? పిచ్చి భ్రమ! వెనక్కి తిరిగి తంతుంది కాలం.

ప్రిన్సిపాల్ ఖాన్‌గారు గుర్తుకు వచ్చారు.

విద్యుక్త ధర్మానికి అంకితమయిన వ్యక్తి! ఏం బావుకొన్నాడు? నాలుగు చోట్లకు బదిలీలు, ఎంక్వయిరీలు, ఛార్జి షీటులు.

అయిదో రోజు అందరికన్నా ముందే తన 'కోటా' పూర్తిచేసింది. కట్టకట్టి చీఫ్ మొహాన పడేసి ఆ 'సంత'నుంచి

బయటపడింది.

డాక్టర్ రామమోహన్ డిపార్టుమెంట్ మొత్తం తాళం వేసి వుంది. కాలేజీకి సెలవులు.

విచారిస్తే రామమోహన్‌గారుప్రొఫెసర్ అయినట్లు తెలిసింది. ఆయన ఇప్పుడు కాంపస్‌లోనే క్వార్టర్స్‌లో వుంటున్నారు. చిరునామా పట్టుకొని బయలుదేరింది.

క్వార్టర్స్ దగ్గరయ్యేకొద్దీ భయం, బెరుకు ఆవహించాయి ఆమెను. ఆయనను గురించి విన్న కథలు కళ్ళముందు మెదిలాయి. తాగి వుంటాడేమో! ఎవరితో ఏ పిచ్చివేషాలు వేస్తున్నాడో?

ద్వార మందిరానికి పచ్చటి మామిడి ఆకు తోరణాలు. ఇంటిలో ఏదో సందడి. చిరునామా తప్పేమో! ఆ అనుమానాన్ని ఇంటిముందున్న కాంపౌండ్‌కు వున్న బోర్డు తీర్చేసింది.

"ఎవరు కావాలమ్మా?"

పోతపోసినట్లున్న నల్లటి భారీ స్త్రీ స్వరూపం. నుదుట రూపాయి కాసంత ఎర్రటి బొట్టు. తలంటు పోసుకొని వున్న జుట్టు. ఎదుట పాపిడిలో ఎర్రటి కుంకుమ. తాంబూల చర్వణంవల్ల ఎర్రబడ్డ నల్లటి పెదవులు. రెండు చెవులలో దూది. కొత్త చీర. నడుంకు గుడ్డకట్టు. ఎవరీ కొత్త బాలెంతరాలు!

"ప్రొఫెసర్ రామమోహన్‌గారు..."

"ఓ వారికోసం వచ్చారా? కూర్చోండి. ఏమండోయ్ ప్రొఫెసర్‌గారూ! తమరి కోసం ఎవరో వచ్చారు. ఓసారి ఇలా వస్తారా?"

కొత్త పంచె, లాల్చీ, చేతిలో పసిగుడ్డు!

"నమస్కారం మేస్టారూ! నేను రుద్రమదేవిని. గుర్తున్నానా సార్?"

అసలే ఆనందంతో వెలిగిపోతున్న ఆయన వదనంలో మరింత మెరుపు.

"రుద్రమదేవి అంటే మీరేనా?" ఆమె పక్కన వచ్చి కూర్చుంది. ఆప్యాయంగా భుజంమీద చెయ్యివేసింది. "మీ మేస్టరు గారికి గుర్తుండటమేమిటి? భలేవారేనే! నేను కాపురానికొచ్చిన యీ రెండేళ్ళలో మీ పేరు ఆయనగారు తల్చుకోని రోజు ఒక్కటి వుందా? ఇందాక కూడా మీ ప్రసక్తి వస్తేనూ! మా బాబుపేరు ఏం పెట్టారోతెల్సా? ప్రతాపరుద్రుడు. మీ మేస్టరుగారికి ఏదో మందుపెట్టి పోయి నట్లున్నావమ్మా నువ్వు".

డాక్టర్ రామ్‌మోహన్ బాబును రుద్రమచేతి కందించాడు. శరీరమంతా ఏదో పులకింత!

ఆ రాత్రికి అక్కడే వుండిపోక తప్ప లేదు రుద్రమకు. కాళికాంబకు కబురు పంపిం చాడు రామ్‌మోహన్. ఆ తర్వాత అక్కడ ఉన్నన్ని రోజులూ ప్రతిరోజూ వస్తూనే వుంది.

సత్యభామ అసలుపేరు రుక్మిణి. పెళ్లి అయ్యాక రామ్‌మోహన్ సత్యభామాఅని పిలవసాగాడు.

రుక్మిణి అనాథ. తొలి జీవితంలో మిట్టపల్లాలను చాలా కష్టంతోదాటి చివరికి మహిళాసంక్షేమ గృహంలోకి చేరింది. జీవి తాన్ని పవిత్రంగా గౌరవంగా గడపాలని ఆమె తాపత్రయం. కానీ అన్నీ అడ్డా లేనే! గతం ప్రతి క్షణం ఆమెను భయ పెట్టేది.

అలాంటి స్థితిలో సంక్షేమ గృహ అధి కారిణి నుంచి పిలుపువచ్చింది. ఎవరో మధ్య వయస్కుడు. రెండోపెళ్లి చేసుకో

వాలను కొంటున్నాడు. విద్యారంగంలో పని. మంచిజీతం. పిల్లలునకనే అర్హత వున్న స్త్రీని మాత్రమే చేసుకొంటాడు. ఈ వివరాలు చెప్పి అంగీకారం తెలిపే వాళ్లకు తెలపమంది అధికారిణి. ఆ పెద్దమనిషి ఫొటోకూడా చూపించింది.

అందరూ పెదవి విరిచారు. తలొక రకంగా విమర్శించారు మామూలే అని.

"ముసలోడు ఈయనకు ఇప్పుడు పెళ్ళెందుకో ?"

"మన ప్రాణం తియ్యటానికి"

"పిల్లలుకనే అర్హత కావాలట ! తన కుందా అసలు !"

రెండో పెళ్ళి వాళ్లంటే కొందరికి ఎలర్జీ. అదే చిత్రం !

మరికొందరికి రెండో పెళ్లి వాడయినా పర్వాలేదు. కానీ పిల్లలు ఉండకూడదు.

అందరూ అనుకొనేది విన్నది రుక్మిణి. తను ఆలోచించింది. పేరుయిచ్చింది. ఆ తర్వాత పని చాలా సులభంగా అయిపోయింది.

"నాకు మీ గతంతో పనిలేదు. మీరు నా గతాన్ని పట్టించుకోకూడదు, నేను నచ్చి, సంసారపక్షంగా నడుచుకోదల్చుకొంటే పెళ్లి చేసుకోటానికి నా అభ్యంతరం లేదు" డాక్టర్ రామ్మోహన్ ఆమెతో అన్నాడు.

"మీ గతమేమైనా మీరు విద్యావంతులు గొప్పవారు. నేను అల్పురాలిని. బురదలో పుట్టి, బురదలో పెరిగి, ఆ బురదపట్ల అసహ్యాన్ని పెంచుకొన్న దానిని. నాకు మీ ఐశ్వర్యంతో పనిలేదు. మీ రూపు రేఖలతో పనిలేదు. నాకు కావల్సింది నా భర్త. ప్రేమించకపోయినా అభిరుచుల్ని గౌరవించగల భర్త. నా గత స్మృతులను గుర్తుచేయని పద్ధతిలో సంసారం చేస్తానంటే మీరే నా సర్వస్వం అనుకుంటా. మీకు దాసినై పడివుంటా",

"అంటే ?"

"నాకు తాగుడంటే అసహ్యం. పూరకుక్కలంటే భయం. తిట్లు కొట్లాటలు అంటే రోత. ప్రశాంతత, ఆత్మీయత కావాలి నాకు"

"నా అన్వేషణ వీటికొరకే. నాకూ నువ్వు ఇప్పుడు చెప్పినవాటిపట్ల ఇప్పుడు నాకూ అసహ్యమే. అయితే నాకు నువ్వు మరొకటికూడా ఇవ్వగలగాలి. అదేమిటంటే పితృత్వం. నేను వివాహాన్ని వాంఛిస్తున్నది కామంతోకాదు. తండ్రిని కావాలన్న వాంఛతోనే".

అలా పెళ్ళయింది ఇద్దరికీ.

"ఆ తర్వాత ఆయన చెప్పిన దాన్ని బట్టి గ్రహించాను. ఆయనలో మార్పుకు కారణంమీరు. మీరు వ్రాసిన కథ. నా పాలిటి అదృష్టానికి కారణమూ మీరే. మీరు నాకు దేవత" ఓ సారి రుక్మిణి కన్నీళ్లు నింపుకుంటూ అంది. అవి ఆనంద భాష్పాలు !

ఎంత పెద్ద వాళ్ళనైనా ఎప్పుడు ఏ చిన్న సంఘటన ఎటు మారుస్తుందో ఎవరు చెప్పగలరు ?

"నువ్వు పెళ్లి చేసుకొని సంసారం చేసుకొంటూ ఉండి వుంటా వనుకొన్నాను మిస్ రుద్రమదేవీ. ఉద్యోగం పెళ్లికి అప్రతిబంధకం కాదే. ఈ రోజుల్లో అదో క్వాలిఫికేషన్‌కూడా గదా? ఎందుకు ఇంకా వివాహం చేసుకోలేదు.

ప్రొఫెసర్‌గారికి ఏమని సమాధానం ఇవ్వగలదు రుద్రమ ?

"నీ కుటుంబ పరిస్థితి నాకు తెల్సు. ఇప్పుడుకాదు. నువ్వు విద్యార్థిగా ఉండ



గానే. అందుకే ఆరోజు నీదగ్గరకొచ్చాను.

ఉలిక్కిపడింది రుద్రమ. ఎందుకు ?

"ఆడపిల్ల వివాహానికి ధనలేమిత్వం ప్రతిబంధకమయ్యేరోజు ఏనాటికిపోతుందో కానీ నీ విషయంలో అది ప్రతిబంధకం కారాదు. ధనం అవసరమైతే నన్ను అడుగు. గురువు తండ్రితో సమానమని నేను వేరే చెప్పనక్కర్లేదుగా నీకు."

స్పాట్ వాల్యుయేషన్ ముగిసి ఇంటికి బయలుదేరేముందు రామ్మోహన్ రెండు పుస్తకాలు ఇచ్చాడు రుద్రమకు బహుమతిగా. రెండూ విమర్శనాగ్రంథాలే.



"ఇందులో ఒకటి ఎన్నడో రాసి ఇప్పుడు ప్రచురించాను. మరొకటి నా నూతన జీవితఫలం. రెండూ నీ పుణ్యాన్నే వెలికివచ్చాయి. వెలుగు చూస్తున్నాయి—"

రుక్మిణి పట్టుచీరె కొనిపెట్టింది.

"త్వరలో పెళ్లి చేసుకోవాలిసుమా! నీ పిలుపు కోసం మేము ఎదురు చూస్తుంటాం. ఇక్కడ మేము సంబంధాలు చూస్తాంలే."

కాళికాంబ పిల్లలకు ఏవేవో కొనిచ్చింది రుద్రమ. వెళ్లబోయేముందు ఆమెచేతిలో డబ్బు ఉంచబోయింది.

"జీవితానికి డబ్బు అవసరమే. కానీ జీవితమే డబ్బు కాకూడదుగా రుద్రమా! మనమధ్య పెరిగిన అనుబంధాన్ని అపవిత్రం చేయకు. నీకంత నన్ను సంతోషపెట్టాలనివుంటే నేనో కోరిక కోరుతాను. తీర్చు"

కాళికాంబ తనను కోరటమా! ఏమిటి కోరుతుంది?

"మాతృత్వాన్ని గురించి కథ రాయగానే సరికాదు. ఆ మాతృత్వపు మాధుర్యాన్ని అనుభవంలోకి తెచ్చుకో"

ఆ క్షణంలో రుద్రమ పెళ్లిచేసుకోవాలని నిర్ణయించుకుంది.

"మరి మీరునా పెళ్లికి వస్తాననిమాట ఇవ్వాలి."

కాళికాంబ రుద్రమను ఆప్యాయంగా కౌగిలించుకొంది.

వీడ్కోలు ఇవ్వటానికి రామ్‌మోహన్ రుక్మిణిలు స్టేషన్ కొచ్చారు.

"ఏంలేదు. నిన్ను మరోసారి చూచి నట్లవుతుందని మీ గురువుగారు కూడా అంటేనూ..."

"మళ్ళీ త్వరలోనే చూస్తారు. మా ఊరికి తప్పక రావాలి".

పరిగెత్తుతూ రైలు చేస్తున్న శబ్దం 'పెళ్లి పెళ్ళి' అని పాట పాడుతున్నట్లని పించింది రుద్రమకు.

కాలక్షేపానికి రామ్‌మోహన్ ప్లాట్ ఫాంపై కొనిచ్చిన పత్రికలు తిరగేస్తోంది.

వధువు కావలెను.

'ఆస్తి కలిగి, స్వతంత్ర వృత్తిలో నున్న మధ్య వయస్కునకు చదువుకొన్న అందమైన యువతి కావలెను. కట్నములు అంగీకరించబడవు. శాఖా భేదములులేవు జాతకముల ప్రసక్తి ఉండదు'

అంటూ వసుని వయస్సు, కులం వివరాలు ఇవ్వబడి వున్నాయి ఆ ప్రకటనలో.

"నాన్నా! నేను పెళ్లి చేసుకోవాలనుకొంటున్నాను" అంటూ తన చేతిలో పేపరు వుంచిన కూతుర్ని చూచి మాధవరావు ఆశ్చర్యపోలేదు.

"ఎన్నాళ్లకు మంచి నిర్ణయం తీసుకొన్నావమ్మా! ఇన్నాళ్లకు నీ తండ్రి సామర్థ్యంమీద నీకు ఈ మాత్రమన్నా నమ్మకం వచ్చింది. అదే సంతోషం. శుభం తల్లీ. అలా కానిద్దాం" అన్నాడు కూతురు తల నిమురుతూ ప్రేమగా మాధవరావు.




పళ్ళూడి పోయిన గాయకుడి పాటకచేరి లాగా ఎన్నో అపస్వరాలతో రుద్రమదేవి పెళ్ళి జరిగిపోయింది.

కట్నం దమ్మిడీ తీసుకోలేదన్న పేరే కానీ రుద్రమ దేవి అత్తగారు, ఆడబిడ్డలు, ఆరడిబెట్టి ఆ పేరుతో ఈపోరుతో వచ్చినంత గుంజుకొన్నారు. విడిదిలో దిగిన దగ్గర నుంచి పెళ్ళి వాళ్ళు విసుగుదలను ప్రదర్శించటం ప్రారంభించారు.

"వెధవ ఆదర్శాలు వద్దురా అంటే విన్నాడు కాదు. వాడికి తండ్రిగాదు వత్తాసు. సంచుల్లో కట్నాలు కుమ్మరిస్తామని ఇంటి చుట్టూ తిరిగిన వాళ్ళనెంద

రినో కాదని పేపరులో ప్రకటనలు చేసి ఈ ముష్టి సంబంధాన్ని పట్టుకొచ్చారు. పోనీ రంభనేమైనా ఎన్నుకున్నాడా అంటే అదీ లేదు. చీకి పారేసిన మామిడిటెంకలా మొహమూ అదీనూ, కుటుంబ మర్యాద చూద్దామా అంటే అక్కడా మోసమే. రైలు దిగిందాకా కూతురు లేచిపోయిం దన్న విషయం తెలియనిచ్చారు కాదు! రంకు తనం మూత పెట్టే మాయమవు తుందా ? ఇంతకీ వాడి కర్మలే. రంభలు ఊర్వసులు కావాలని ఆగి ఆగి ఆఖరికీ ఈ అడుసులో ఇరుక్కొన్నాడు. ఏంచేస్తాం?"

మొత్తం మీద మాధవరావు రుద్రమలు కల్సి కూడబెట్టినది కాస్తో కూస్తో ఉంటే అది కాస్తా పెళ్ళి పేరిట ఖర్చయి పోయింది. అందుకు దిగులుపడలేదు,

పెళ్ళికొడుకు బాగున్నాడా అంటే అదీ లేదు. రుద్రమ తొందర పడిందేమోనని అందరికీ అనిపించింది.

పేరుకు చక్రవర్తి అయితే ఆ లక్ష ణాలు రూపురేఖల్లో మచ్చుకైనా లేవు. సన్నగా, నల్లగా గిటక్కరుచుకు పోయి నట్లు వున్నాడు. నిద్రపోతున్నవాడిలా కంటి రెప్పలు బరువుగా వాలిపోతూనే వున్నాయి. నల్ల మందు తిన్నవాడిలా మొహంలో ఉత్సాహమే లేదు. రూపం ఎలాగున్నా మనిషిలో ఎక్కడా పెళ్ళికళ కన్పించందే ?

పెళ్ళికి పెద్దగా ఎవరినీ పిలవలేదు రుద్రమ. సింపుల్‌గా జరిగిపోవాలనుకుంది. రుక్మిణి, రామ్‌మోహన్, కాళికాంబలు మాత్రం పెళ్ళికొచ్చారు. పెళ్ళి కొడుకు, అతని తల్లి వాళ్ళ ధోరణి ఇవన్నీ చూచి ఏమనుకున్నారో ఏమో ! పెళ్ళి కాగానే భోజనాలు చేసి తిరుగు పయాణా లయ్యారు. మరో రెండు రోజులు వుండ మని రుద్రమకూడా వత్తిడి చేయలేక పోయింది.

"త్వరలో పండంటి బిడ్డను కనాలి. ఆడపిల్ల అవుతే మా వాడికి చేసుకుంటాం, మగ పిల్లవాడు అవుతే వాడిని నా అల్లుడు చేసుకోటం కోసం పనిగట్టుకొని ఈ సారి ఆడ పిల్లను కంటాను. గుర్తుంచుకో" రుక్మిణి అంది భర్తవైపు చూస్తూ. కానీ రామమోహన్ మాట్లాడలేదు, ఆయన కళ్ళల్లో ఏదో ఆవేదన తొంగి చూస్తోంది.

"అత్తలూ ఆడబిడ్డలు, కోడంట్రకాలు పెళ్ళిలో ఈ గొడవలు అన్ని చోట్లా మామూలే రుద్రమా. నీ భర్త నీకు అండ. రేపు పుట్టబోయే బిడ్డలు నీ కొండలు. ఉద్యోగం మాత్రం వదులుకోకు సుమా. ఆడదానికి ఆర్థిక స్వతంత్రం వుంటేనే విలువ."

వెళ్ళబోయే ముందు రామ్ మోహన్ కూడా తెగించి అదే అన్నాడు.

"ఉద్యోగాన్ని మాత్రం వదులుకోకు రుద్రమా, అంతగా వుద్యోగం నీ సంసా రజీవితానికి ప్రతిబంధకమవుతుంటే నాకు చెప్పు నేను సహాయం చేస్తాను. నీ భర్తకు అంగీకారమైతే యూనివర్సిటీలో పోస్టు ఖాళీ అవుతుంది త్వరలో–అప్లయి చేయి. రీసెర్చి చేసుకోవచ్చు–".

సంధ్యారాణి, సుధాకరమూర్తులకు ఆహ్వానం కూడాపంపలేదు. అడ్రస్ తెలి యక కాదు, అనవసరమనిపించి. ప్రిన్సి పాల్ ఖాన్‌గారి నుంచి శుభాకాంక్షలతో పాటు ఓ వుత్తరం వచ్చింది.

"సిద్ధాంతాలు, విశ్వాసాలు వున్న వ్యక్తు లకు క్రమశిక్షణ దానంతట అదే అల వడుతుంది. జీవితంలో శాశ్వత విలువలకు ఆలంబనం క్రమశిక్షణ. క్రమశిక్షణా

యుతంగా నడిచే సంసారంలో సుఖ శాంతులు వుంటాయి. దేవతలు అక్కడే వుంటారుట. జీవితంలో పరిగణకు తీసుకో వల్సింది స్వల్ప అపజయాలు కాదు. అంతంలో లభ్యమయ్యే తుది విజయం. తలిదండ్రులు క్రమశిక్షణతో మెలుగుతూ ఉన్నత ఆదర్శాలు కలిగి ఉన్నప్పుడే బిడ్డలకు ఆ గుణాలు అలవడుతాయి. నీ బిడ్డలు ఉన్నత పౌరులగుదురుగాక! అల్లా మీ కుటుంబానికి ఎల్లప్పుడూ అండగా ఉండి ఆశీర్వదించు గాక"

ఖాన్‌గారి ఉత్తరం రుద్రమకు కొండంత బలాన్నిచ్చింది. తన భవిష్యత్తు మార్గాన్ని నిర్దేశించినట్లు కనిపించింది.

అయితే ఆ శక్తి, బలం, ఆలోచనలు అన్నీ మొదటి రాత్రే పరీక్షకొచ్చాయి.

ఆ రాత్రి-

చక్రవర్తి ఉన్న గదిలోకి ప్రవేశించి ఎదిగీ ఎదగని కన్నెవయసులో వున్న పిల్లలా రుద్రమ సిగ్గు పడుతూ వాకిలి వద్దే నిల్చో లేదు. అది చాలా అసహజంగా కన్పించింది. సహజంగానే భర్త వైపు చూచింది. నిర్జనారణ్యంలో పులిని చూచినట్లు బెదిరిపోయింది.

అతని చూపుల్లో ప్రేమ లేశమాత్ర మైనా లేదు. కామదాహంతో అతని శరీర మంతా మండుతున్నట్లుంది. అతడిని సమీపించటానికి సందేహించింది. అదో విధంగా చూచింది.

"ఏమలా చూస్తున్నావు.? మీవాళ్ళంతా నేను అందంగా లేననుకొంటున్నా రటగా? పెళ్ళి చూపుల తంతు కూడా నడిపించారుగా? ఆ నాడు కళ్ళెక్కడికి పోయాయి? అయినా తలుపు చెక్కలా ఎద్దంత పర్సనాలిటి వుండగానే సరిపో యిందా? మగాడికి కావాలసింది మగసిరి."

"ఎవరేమనుకొంటే మనకెందుకు? సంసారం చేసేది మనం కదా! నాకు అన్ని విధాలా నచ్చబట్టే కదా అంగీకరిం చాను? మీకూ నచ్చబట్టే నన్ను మీ భాగ స్వామిని చేసుకొన్నారు."

"నాకు తెల్సు నువ్వు పతివ్రతవు. నీ మొహం చూస్తేనే అనుకున్నాను. కానీ, నీ చెల్లెలి సంగతి నాకెందుకు చెప్పలేదు?"

"చెప్పకపోవటం తప్పయితే మన్నించండి. కాని చెప్తే ఏం చేసేవారు? నన్ను చేసుకొనేవారు కాదా?"

"అని కాదు" అతను లేవబోయి కొంచెం తూలాడు. మళ్ళీ పక్క మీదే కూర్చున్నాడు. "అక్కడే నిలబడిపోయావేం? కబుర్లలో పడితే వచ్చిన పని మర్చిపోయేలా వున్నావే? ఇలారా"

ఆతడిని సమీపించింది. సుగంధ పరిమళాలన్నిటినీ మలినం చేస్తూ వాసన గుప్పుమంది.

"రా -" ఆమె చేయిపట్టుకున్నాడు అతను. కాదనలేదు రుద్రమ.

"మీకి అలవాటున్నట్లు నాకెందుకు చెప్పలేదు?"

"ఏ అలవాటు? ఆడవాళ్ళ చెయ్యి పట్టుకొనే అలవాటా?" భలో క్తి విసిరేడు. నవ్వేడు. "ఓ! ఇదా? ఇందులో చెప్పేదేముంది హైకోర్టు అడ్వకేటును. పైగా సిటీలో పుట్టిపెరిగినవాడిని. నాగరికత ప్రపంచంలో మసలేవాడిని. ఈ సింపుల్ అలవాటు లేనివాళ్ళు కూడా వుంటారనే నాకు తెలియదే అసలు! ఏం నీకిష్టం లేదా? ఈ అలవాటు వుందంటే పెళ్ళి చేసుకొనే దానివి కాదా? పోనీ ముందే అడక్కపోయావా?"

"మీ ఇష్టం మీది. మీ అలవాటుని

మానమని నేనెలాగ అనగలను. అయితే ఆ వాసనంటే నాకు అసహ్యం. దయచేసి నా అభిరుచిని కూడా గౌరవిస్తారుగా? సమయం, సందర్భం పాటించమని ప్రార్థన."

చక్రవర్తి నవ్వాడు-"ఒట్టి పిచ్చిదాని లాగ వున్నావే. సమయం సందర్భం నాకన్నా బాగా తెలిసినట్లు మాట్లాడుతున్నావు. ఇంతకంటే సమయం ఏమిటి? మొదటి రాత్రి"

మనిషి తోలు కప్పుకొన్న పులి నగ్నంగా బయటపడింది. వీరంగం చేసింది కొంతసేపు. తనకు కావల్సిందేదో జరిగింది. మేక తల తెగగానే గణాచారి పూనకం తగ్గినట్లు కాస్సేపటికి పులి శాంతించింది. మనిషి తోలు కప్పుకొని గుర్రుపెట్టి నిద్రపోయింది.

అనాదిగా అనేక వేల సాహిత్య గ్రంథాలలో ఉగ్గడించిన ఆడదాని తొలి అనుభవం. రుద్రమ అనుభవంలోకి రాకుండా తప్పించుకు పారిపోయింది. మొదటి రాత్రిని కళ్ళు మూసుకొని చేదుమాత్రలా మింగింది.

హైదరాబాద్‌కు వెళ్ళాకగాని అత్తగారి ఇంటి పూర్తి స్వరూపం అవగాహన కాలేదు రుద్రమకు.

కలిగిన కుటుంబమే! మంచి యిల్లు వుంది. ఆ యింటికి గేరేజీ వుంది ఒకప్పుడు వాళ్ళకి కారు వుండేదనటానికి నిదర్శనంగా.

ఇంటిముందు రెండు పెద్ద బోర్డులు వున్నాయి. 'డాక్టర్ కేశవరావు, యం.బి.బి.యస్, రిటైర్డు సివిల్ సర్జన్. పిల్లల స్పెషలిస్టు. సంప్రదించుటకు వేళలు- ఉదయం 8 నుండి 10 వరకు, సాయం కాలం 4 నుంచి 6 వరకు మాత్రమే' అది మామగారి బోర్డు.

రెండోది 'చక్రవర్తి, యమ్మే.యల్ యల్.బి, హైకోర్టు అడ్వకేట్'

ఈ రెండు బోర్డులకు మధ్య ఇనుప గేటుకు ఓ చిన్న బోర్డు వుంది.

'కుక్కలున్నాయి జాగ్రత్త. కరచిన యెడల ఇంటి యజమానులు బాధ్యులు కారు'.

అయితే రుద్రమ అత్తవారింటికెళ్ళి రెండు రోజులు దాటినా కుక్క కన్పించ లేదు ఇంట్లో. ఒక్క రోగి మామగారి దగ్గరికి రాలేదు. ఆయన మాత్రం పాపం ఎనిమిది గంటలకల్లా వెళ్ళి ఓ చిన్న గదిలో కూర్చుంటాడు.

చక్రవర్తి కోసం ఒక్క పార్టీకానీ, కనీసం ప్లీడరు గుమాస్తాకానీ రాలేదు. అసలు కోర్టు ఫైళ్ళు అనేవి ఎక్కడ వున్నాయో కూడా ఆమె కనుక్కోలేక పోయింది. ఇక చక్రవర్తి ఎప్పుడూ ఇంట్లో వుండడు. రాత్రి పొద్దుపోయి కానీ రాడు.

"ఎంత కొత్త పెళ్ళానివైనా నీ ముందు కూర్చుంటాననుకోకు. అందరా సినిమాల్లో, కథల్లో. నేను మగాడిని. సవాలక్ష వ్యవహారాలు. తెల్సిందా?"

ఇక మామగారు 'హెన్ పెక్ట్ హజ్ బెండ్'. భార్య సుందరమ్మ గొంతు వినిపిస్తే చాలు. ఆయనకు మాట పడి పోతుంది. ఇద్దరు ఆడపిల్లలకు పెళ్ళిళ్ళయి అత్తవాళ్ళకు వెళ్ళిపోయారు. ఒక ఆడ బిడ్డను హైదరాబాద్‌లోనే ఇచ్చారు. ఆమె భర్తకు కూడా అక్కడే ఉద్యోగం.

ఈ సంసారంలో అసలు కీలకమైన వ్యక్తి సుందరమ్మ తల్లి సరస్వతమ్మ. ఆమె పెళ్ళికి రాలేదు. కానీ గుండ్రాయిలా

వుంటుంది. గుండు చెంబు గచ్చుమీద దొర్లించినట్లు ఎప్పుడూ ఆమె నోరు ఏదో వాగుతూనే వుంటుంది.

"ఏమే మనవరాలా! ఇంతమందికి చక్రిగాడు–వాడొక్కడే ఆధారం. నువ్వు చూడబోతే ఎర్రగా, బుర్రగా వున్నావు. చదువులు వెలగబెట్టావు. ఉద్యోగాలు తగలబెడుతున్నావు. ఈ ఇంట్లో కాపురం చేయాలంటే ఆ లక్షణాలు కాదు కావాలి సింది. పెద్ద ముండలం. మాలో కలిసి పోవాలి. మొగుడిని మాయలో పడేసు కొందామనుకొంటున్నావేమో. అ దే ం కుదరదు. ఈ ఇల్లు, ఆస్తి, అన్నీ నావి గుర్తుంచుకో—"

మూడు రోజులు కాగానే తలెత్తిన మొదటి ప్రశ్న?

రుద్రమదేవి ఉద్యోగం చేయాలా, మానెయ్యాలా?

సరస్వతమ్మ,సుందరమ్మలు మానేయ మన్నారు. కేశవరావు, అడిగిందాకా వాళ్ళకు ఓటు వెయ్యలేదు.

రుద్రమదేవికి ఉద్యోగం వదిలేయటం ఇష్టంలేదు. మొదట్లో మృదువుగా,తర్వాత గట్టిగా, చివరికి నిష్కర్షగా చెప్పింది.

"అనుకొంటూనే వున్నా ఇలాంటి వేషాలేవో వేస్తావని! నీ సంపాదన మాకు అక్కర్లేదంటుంటే తీపరమైందా?"

"మీకక్కర్లేదు. కానీ నాకు కావాలి."

"ఏం? నీ అబ్బకు దొబ్బబెడతావా ఇంకా? అదేం కుదరదు. కానీ కట్నం లేకుండా చేసుకొన్నాం. ఆ డబ్బు మాకే చెందుతుంది."

చివరికి చక్రవర్తి ఆ సమస్యను పరిష్కరించాడు. రుద్రమదేవి ఉద్యోగం చేయటానికి పర్మిషన్ దొరికింది.

అయితే ఉద్యోగం అక్కడ, మొగుడు ఇక్కడ. ఎలా?

"నాన్నగారూ! మీరు ప్రయత్నించి దానిని బదిలీ చేయించండి ఇక్కడికి. మీకు తెలిసినవాళ్ళు ఉన్నారుగా?"

అంతవరకు రుద్రమ పుట్టింట్లో వుండి ఉద్యోగం చేసుకొనేదానికి కూడా అంగీ కారం లభ్యమైంది.

"ఏమ్మా! అగి అగి ఆఖరికి నీకు అన్యాయం చేసేనేమోననిపిస్తుంది కదూ?"

మాధవరావు ఉద్యోగంలో నుంచి రిటైరు కాబోతున్నాడు. అయితే స్వతంత్ర భానుడు ఎక్కొచ్చాడు. ఇంజనీరింగ్ అయిపోతోంది. మిగతా పిల్లలూ త్వరలో ఎక్కొస్తారు. చివరిది ఆడపిల్ల. చిన్నది. ఇన్నేళ్ళు శారీరకంగా, మానసికంగా ఆయన అనుభవించిన కష్టాలు, వ్యధలు ఇప్పుడు ఆయన ఆకారాన్ని క్రమక్రమంగా ఆక్రమిస్తున్నాయి. ముసలితనం ముంచు కొస్తోంది. ఆ స్థితిలో ఆయనకు ఈ కొత్త చింతా?

"మీరేం చేశారు నాన్నా! కట్నం తీసుకోని వ్యక్తినిచేసుకోవాలనుకొన్నాను. చేసుకొన్నాను. నాకేం తక్కువయింది ఇప్పుడు? ముసలితనంలో మీకు ఆసరాగా వుంటుందనుకొన్న డబ్బును ఇంకా నా కోసం మీరే ఖర్చుపెట్టారు—"

మాధవరావు సన్నగా నవ్వాడు.

"నువ్వు మంచిదానివమ్మా! సత్య కాలపు తల్లివి. పూర్వ కాలంలో అయితే నీ గుణాలకు విలువ ఉండేదేమో! కానీ స్వాతంత్ర్యం వచ్చిందికదమ్మా. అన్ని విలువలుతోపాటు మంచితనానికి, త్యాగానికి వున్న విలువ కూడా నశించిపోయింది. మోసం చేసేవాళ్ళకి, మాయ మాటలు చెప్పేవాళ్ళకే ఇప్పుడు విలువ—"

ఎన్నో రోజులు గడవకుండానే రుద్రమకు హైదరాబాద్‌కు బదిలీ అయింది.

"డబ్బు అవసరమయితే రాయండి నాన్నా. స్వతంత్రుడి చదువు పూర్తి అయిందాకా ఎలాగూ వాడికి పంపిసాను"

హైదరాబాద్‌కు వెళ్ళేసరికి సరస్వతమ్మ మంచంలో పడి వుంది. మెట్ల మీద నుంచి కింద పడి కాలు విరగగొట్టుకొంది. అసలే ఆమెకు చక్కెర, రక్తపోటు వున్నాయట.

"ఏకేం ఫర్వాలేదండీ. మీరు మళ్ళీ హాయిగా తిరుగుతారు. ఎటొచ్చీ చక్కెర, రక్తపోటు వున్నాయి కదా ? అంచేత కాస్త వ్యవధి పడుతుంది" కొత్త డాక్టరెవరో అంటున్నాడు. "అయినా మీకేమండీ?అన్ని విషయాలు చూసుకోవటానికి కేశవరావుగారున్నారా? కొడుకు డాక్టరు కావటం వల్ల లాభాలు ఇప్పుడు తెలుస్తాయి లెండి మీకు!"

"సరేలే వాడిని నమ్ముకుంటే నా కాలే కాదు, త్వరలోనే నేనూ కాటికి వెళ్తాను. ఉద్యోగం చేసే రోజుల్లో ఎందర్ని చంపేవాడో ? మా అదృష్టం బాగుండి ఆ రోజుల్లో వాళ్ళ నాన్నగారు ప్రభుత్వ వుద్యోగం సంపాదించ బట్టి సరిపోయింది. కానీ లేకపోతే ప్రైవేటు ప్రాక్టీసు పెడితే ముష్టెత్తుకు బతకాల్సి వచ్చేది కాదూ?"

రుద్రమ మనస్సు చివుక్కుమంది ! పరో డాక్టరుగారి ఎదుట కొడుకు ప్రజ్ఞను ఎంత అవమానం చేస్తోంది ? అయినా కేశవరావు నవ్వుతూనే వున్నాడు.

"వారి సంగతెందుకులెండి. జరగాల్సింది చూడండి" అంది సుందరమ్మ.

నర్సింగ్ హోంలో చేరమంటాడు డాక్టరు. అక్కర్లేదు ఆ కట్టేదేదో కడితే యిక్కడే పడి వుంటానంటుంది సరస్వతమ్మ.

"నర్సింగ్‌హోంలో అయితే నర్సులూ వాళ్లూ కనిపెట్టి వుంటారు. ఇక్కడ..."

"ఫర్వాలేదు లెండి. ఎమ్మే చదివిన కోడలుంది మాకు. నర్సు చేసే పని చేయలేదా ఆ మాత్రం ?" సుందరమ్మ కోడల్ని చూస్తూ అత్తగారికి వత్తాసిచ్చింది.

రుద్రమ సంసారజీవనం అలా ప్రారంభమయింది.

అనాదిగా ఆ యింట్లో సరస్వతమ్మే వంట చేసేది. సుందరమ్మ ఆమె గారాల బిడ్డ. అంచేత వంట నేర్వలేదు. పైగా కూతురు కష్టపడుతుంటే ఇప్పటికీ ఆమె గుండె గిలగిల లాడిపోతుందిట.

"రుద్రమ్మకు చేతనయ్యే వుంటుంది. ఎంత చదివితే మాత్రం ఆడదానికి వంట చేయటం నేర్పకుండా అత్తింటికి పంపుతారా ? అందులోనూ వాళ్ళది ముష్టి కుటుంబం"

రుద్రమ వంట చేసింది. మెచ్చుకొంటూ అందరూ ఆరగించారు.

"రేపటి నుంచి కాస్త శుభ్రంగా మడి గుడ్డ కట్టుకొని వంట చెయ్యి"

తెల్లవారు ఝామునే లేవటం...... సరస్వతమ్మకు ప్రభాత సేవలు చేయటం, మడి గట్టుకొని వంట చెయ్యటం, తిన్న వాళ్ళకు పెట్టి తను ఆదరా బాదరాగా యింత నోట్లో కుక్కుకొని కాలేజీకి వెళ్లటం. కాలేజీలో పరిస్థితి యింటికన్నా అధ్వాన్నం.

ప్రిన్సిపాల్ ఒక అసమర్థుడు. అయితే తను చాలా గొప్ప పరిపాలకుడిననిపించుకోవాలని ఆయన తాపత్రయం. కుర్రాడు

గట్టిగా మాట్లాడితే ఆయనకు కంపరం పుడుతుంది. అయితే ఆ భయాన్ని కప్పి పుచ్చుకోవటానికి లెక్చరర్ల దగ్గర 'స్ట్రిక్టు'గా వుంటాడు. వాళ్లని రాచి రంపాన పెడతాడు. లీవు కావాలంటే ఆ కాగితం క్రిందికి పైకి పదిసార్లు తిరుగుతుంది. ఇంక్రిమెంటు శాంక్షన్ చేయటమంటే ఆయనకు గొప్ప సముద్రాన్ని ఈదినట్లే! రీము కాగితాలు ఖర్చు చేస్తే కాని ఆయన ఏ పనీ చేయడు. అందుకే ఆయనికి 'కాగితాసురుడు' అని పేరు.

పాఠాలు చెప్తే విద్యార్థులకు కోపం, చెప్పకపోతే ప్రిన్సిపాల్ మెమో ఇస్తాడు. కాపీ కొట్టుకోనివ్వకపోతే విద్యార్థులు





తంతారు. కాపీ కొట్టుకోనిస్తే ప్రిన్సిపాల్ కాగితం ఇచ్చి విశ్వరూపం ప్రదర్శిస్తాడు.

రుద్రమ అదృష్టం బాగుంది. కాలేజీలో విద్యార్థులకి ఎందుకు కలిగిందో ఆమెపట్ల సదభిప్రాయం కలిగింది. ఆమెపట్ల మర్యాద చూపసాగారు. విద్యార్థులకు ద్వేషం కలిగినా, ప్రేమ పెరిగినా కారణాలు యిదమిద్ధంగా వుండాలసిలేదు. అనేక కారణాల సమ్మిశ్రమంగా వుంటుంది.

ఐతే ఎంతసేవ చేసినా సరస్వతమ్మ, సుందరమ్మల గౌరవాన్ని అభిమానాన్ని మాత్రం పొందలేక పోయింది.

"కాలేజీ కాగానే కొంపకు నేరుగా రారాదూ ? మధ్యలో షికార్లు ?"

కాలేజీకి ఇంటికీ దూరం. బస్సులు రెండు మారాలి, రద్దీ. చిక్కేనూ చిక్కక పోయేనూ ?

"బస్సులు కాకపోతే కార్లు వస్తాయి ఈ రాణిగారికి ? కట్నం సంచులతో పుట్టింటి నుంచి మోసుకొచ్చిందా పాపం? మా ఆయన, నా కొడుకు ఒకప్పుడు కాపుల్లో తిరిగినవారే! కావాలంటే గేరేజీ చూడు. మా ఆయన దగ్గర వుండి గేరేజీ కట్టించుకొన్నాడు."

వంట దగ్గరా ఇదే రీతిలో సాధింపులు ఓ పూట ఓ ముద్ద ఎవరికైనా తక్కువ యితే – "పుట్టుకతో లేని గుణాలు చదువులో వస్తాయా ? కడుపునిండా అన్నం తిన్న మొహమా ? పెట్టిన మొహమా ? మా ఇంట్లో పనిమనుషులకు పెట్టే అన్నం పది సంసారాలకు సరిపోయేది ఆ రోజుల్లో ? ఇంత తిని పదిమందికి పెట్టిన వాళ్ళం–కడుపు కాల్చుకోవాల్సిన కర్మ మాకేం పట్టింది మళ్ళీ వండుకో"

మళ్ళీ వండుకొంటుందో లేదో ఎవరూ పట్టించుకోరు.

చక్రవర్తికి తాగుడొక్కటే కాదు. అతను 'సకల గుణాభిరాముడు' అని త్వరలోనే తెలుసుకొంది. పనిలేదు. వున్నా చేయడు, బాధ్యత లేదు, దానిని గురించి ఆలోచించడు.

అతను పేకాడుతాడు. రేసుల పిచ్చి విపరీతం. బ్రేకెట్టు పండితుడు. స్త్రీలతో కూడా సంపర్కాలున్నాయంటారు.

"అన్నీ అవలక్షణాలేగల మగాడిని ఏ ఆడకూతురు చేసుకొంటుందమ్మా ? పైగా అతగాడికి ఉద్యోగం చేసే పెళ్ళాం కావాలిట ! అంతా గొరగించుకొన్నాక పెళ్ళాం ఉద్యోగం మీదన్నా బతకొచ్చని ఆలోచన కాబోలు పాపం! ఎవరూ చేసుకోక అందరూ కాదంటే చివరికి పేపరులో ఆ నాటకం ఆడేరు. పాపం— దూరం కదా! తెలియక మీరు వాళ్ళ వుచ్చులో ఇరుక్కొన్నట్లున్నారు. బంగారం లాంటి పిల్లవుకదమ్మా–చదువు,ఉద్యోగం, నీకి ఖర్మం పట్టింది పాపం" ఆ వీధిలో ఆమె ఓ రోజు పని గట్టుకొని వచ్చి రుద్రమను చాటుకు తీసుకుపోయి జాలి పడింది.

ఓ రోజు రుద్రమ కాలేజీ నుంచి ఇంటికి రావడానికి బస్ స్టాపు వద్ద నిల్చుంది.

"హల్లో రుద్రమా" స్కూటర్ పక్కన వచ్చి నిల్చుంది. రవీంద్ర డ్రైవ్ చేస్తున్నాడు. వెనుక చక్రవర్తి. ఇద్దరూ స్కూటర్ దిగారు.

"ఇదేమిటి ఇక్కడున్నావ్ ? అసలు హైదరాబాద్ ఎందుకొచ్చావ్ ? ఎప్పు డొచ్చావ్? ఎక్కడున్నావ్? మా యింటికి రాకపోయావా ? శారద పుట్టింట్లో వుందనుకో. వుంటే ఏం తప్పా? ఉద్యోగం కోసం వచ్చావా ? ఏడ్చినట్టుంది ఉద్యోగం చేస్తున్నావుగా? ట్రాన్స్‌ఫర్ కోసం వచ్చావా ఏమిటి ?"

శారద ఎదుట తనతో మాట్లాడటానికి సిగ్గుపడ్డ మనిషి, విజృంభించి మాట్లాడు తున్నాడు. చిత్రమనిపించింది రుద్రమకు. భయమేసింది కూడా !

అంతటితో ఆగలేదు రవీంద్ర. చక్రవర్తికి రుద్రమను పరిచయం చేశాడు.

"చిన్నప్పుడు నేను ఈమెను ప్రేమించానోయ్. నా భార్య కావాల్సింది. కానీ శారద నన్ను బుట్టలో వేసుకొంది ఈలోగా ..." చెప్పుకు పోతున్నాడు గొప్పగా. అతనిలో దిగిన గుర్రం అడ్డం ఆపూ లేకుండా దౌడు తీస్తోంది.

చక్రవర్తి ఇదేం పట్టనట్లు సిగరెట్టు కాల్చు కొంటూ వింటున్నాడు.

"రవీంద్రగారూ కాస్త ఆపుతారా మీ ధోరణి. బజార్లో అలా మాట్లాడటానికి మీకు సిగ్గు లేదండీ? అదేం గొప్పనుకుంటున్నారా? నా స్నేహితురాలు భర్త కనుక వూరుకొన్నాను. లేకపోతే..." రుద్రమ కనులు అరుణిమలయ్యాయి.

"నేనిప్పుడు తప్పేం అన్నాను. బ్రదర్! నువ్వు చెప్పు?"

"నాకు పెళ్ళయింది. మీరు మాట్లాడుతున్నది నా భర్తతోనే. ఆ సంగతి తెల్సా మీకు ?"

"ఏమిటి చక్రవర్తి భార్యవా నువ్వు? నీకు పెళ్ళయిందా? నాకు తెలీదే ?"

"ఏం ప్రపంచంలో జరిగేవన్నీ మీకు తెలియాలని వుందా? నా పెళ్ళి విషయం మీకు తెలియకపోతే నాకు వచ్చే నష్టం ఏమిటి? చిన్నప్పుడు మీరు ప్రేమించానని చెప్పారు కానీ ఆ తర్వాతి సంగతి చెప్పరేం? అది చెప్పకపోతే మీ ఘనత అందరికీ తెలుస్తుందేమోకాని నన్ను అంతా ఏమనుకొంటారోనన్న ఆలోచన వుందా మీకు?"

"క్షమించండి రుద్రమా. పొరపాటు చేశాను. మిమ్మల్ని చూసిన ఉత్సాహంలో..." స్కూటర్ స్టార్టు చేశాడు అతను. చక్రవర్తి వెనుక ఎక్కలేదు. రవీంద్ర అడగనూ లేదు. స్కూటర్ వెళ్ళి పోయింది.

"నడిబజార్లో నా స్నేహితుడిని ఎందుకలా అవమానించావు? నన్నెందుకంత యిబ్బంది పెట్టావు ? నీ పాతివ్రత్యాన్ని నిరూపించుకోవటానికేనా ?" ఇంటి కెళ్ళాక నిలేశాడు చక్రవర్తి.

రుద్రమ ఆత్మాభిమానం దెబ్బతింది.

"అదేమిటండీ అతనలా మాట్లాడటం బాగుందా? నేను జవాబివ్వడం తప్పా? అలాగని మీరు నన్ను సంజాయిషీ అడుగుతున్నారా ? ఏం చిత్రం ?''

"తెలుగు మేస్టరివి నీకేం తెలుస్తుందే నాగరిక సమాజంలో జీవన విధానం? నువ్వు పతివ్రతవా కాదా అని నేనెప్పుడన్నా అడిగేనా? రవీంద్ర నిన్ను ప్రేమించానని చెప్పేసరికి నువ్వే భుజాలు తడుముకొన్నావు. నేనేమంటానో అని భయపడిపోయావు. నీ పాతివ్రత్యం, పవిత్రతలతో నాకు పనిలేదు. మేరేజ్ ఈజ్ ఏ కాంట్రాక్ట్. పెళ్ళి ఒక అంగీకారం ఒప్పందం. నేను పవిత్రుడినయితేగా ? ఇన్నేళ్ళువచ్చిన నీలో పాతివ్రత్యాన్ని, పవిత్రతను నేను ఆశించటానికి ?"

"అంటే నేను పవిత్రురాలిని కాదంటారా ?"

"అవునో కాదో? అయితే నీ పవిత్రతను నీ దగ్గరే దాచిపెట్టుకో. ఎవరిక్కావాలి ? నాన్ సెన్స్-."

"నేను అనాగరికురాలినే పోనీ మీరే చెప్పండి. మీ నాగరికత ప్రకారం చేసుకొన్న కాంట్రాక్ట్‌లో అంశాలేమిటి ?"

"ఏమిటా ?" పులిలా గాండ్రించాడు చక్రవర్తి.

"ఆ ఏమిటి ? భరించువాడు భర్త అని అర్థం. కానీ మీరు నన్ను భరించడంలేదు. మిమ్మల్ని వొకరోజుకు నేను భరించాల్సి వస్తుందేమో ! ఇక నన్ను పెళ్ళిచేసుకొని

ప్రశ్నించిందేమిటి ?"

పులి పైనబడి పంజాతో కొట్టింది. రక్కింది, కరిచింది.

ఇంట్లో వాళ్ళంతా పోగయ్యారు. బయటివాళ్ళు పోగు కాబోయారు. పులిని ఏమీ అనలేదెవ్వరూ తరమలేదు. బెదిరించలేదు. పంజా దెబ్బలు తినే మనిషినే తిట్టేరు. పులిని ఎందుకు రెచ్చగొట్టాలి. పంజా విప్పితే కొడుతుందనే బుద్ధిలేదూ ?

వేటను వెదుక్కొంటూ పులి ఆ రాత్రి పూరి మీద పడింది. పంజా దెబ్బలుతిన్న మనిషిని ఓదార్చే వారే లేకపోయారు.

మధ్య మధ్యలో ఇలాంటి సంఘటనలున్నా, అనాదిగా స్త్రీ మధురంగా భావించే సమయం ఏ పూజా పునస్కారాలు లేకుండానే రుద్రమకు లభ్యమయింది. గర్భవతి అయిన భార్యను చూసి ఒకసారి చమత్కారంగా అన్నాడు చక్రవర్తి. "భరించువాడు భర్త అని ఏమేమో పాండిత్యాలు వెలగ బెట్టావు కదూ! ఆ రోజు ? ఆ వ్యుత్పత్తి అర్థాలను గొయ్యితీసి పూడ్చి పెట్టు. నిన్ను నేను భరించేదేమిటి ? నువ్వునన్నిప్పుడు భరిస్తున్నావు. నీ కడుపులో ఇప్పుడుండే– ఆదిచ్చేవాడిని కనుకనే నువ్వు భరించు దానవు కావాలి. తెల్సిందా ?"

"ఇదేనా మీ నాగరికతలు– కాంట్రాక్టులు ! బలహీనతలను కప్పిపుచ్చుకోవటానికి నాగరికత ముసుగు వేసుకోకండి" అని వాదనకు దిగలేదు రుద్రమ. అతని హేళనను భరించింది. పులి మళ్ళీ పంజా విప్పితే తనతోపాటు మరో జీవి బాధ పడుతుందే ఇప్పుడు ?

స్త్రీదేన్నైతే వరప్రసాదమని, మాధుర్యమని అనుకుంటుందో, అదే –ఆ మాతృత్వపు తీపే ఆమెకున్న బలహీనతలా ? ఆ బలహీనతనేనా పురుషుడు వాడుకొంటున్నాడు ?

నెలలు దగ్గరబడే కొద్దీ మరో ప్రశ్న తల ఎత్తింది. పురుడు ఎక్కడ పోసుకోవాలి?

ఏ క్షణాన మంచం ఎక్కిందో గాని సరస్వతమ్మ మళ్ళీ దిగలేదు. పైగా దీర్ఘ జాడ్యాలు పైకొచ్చాయి.

'మహాతల్లి. ఏ ముహూర్తాన యింట్లో కాలు పెట్టిందో ? గుండ్రాయిలా తిరిగే మా అమ్మ మంచం ఎక్కింది' అని సుందరమ్మ కోడల్ని మాటిమాటికీ సాధించటమే.

అక్కడ ఆ వాతావరణంలోకన్న ప్రశాంతంగా వున్న చోటే పురుడు పోసుకోవాలని రుద్రమ ఆకాంక్ష. కానీ పుట్టింట్లో పరిస్థితి బాగలేదు. అనసూయమ్మకూ రోగమే.

మొదట్లో యింట్లో చాకిరీకి వుండాలని సరస్వతమ్మ, సుందరమ్మ పురుడు యిక్కడే పోసుకోమన్నారు. రుద్రమ కూడా అంగీకరించింది.

కానీ చివర్నంది. ఇక లాభం లేదనుకొన్నాక సుందరమ్మ అంది.

'మా కెందుకులెమ్మా యీ తద్దినం ? ఏం? అంత పురుడుపోయని దౌర్భాగ్య స్థితిలో వున్నారా నీ పుట్టింటివాళ్ళు ? అక్కడికే వెళ్ళు'

రుద్రమ పుట్టింట్లోనే పురుడు పోసుకొంది. మగబిడ్డ. అచ్చు రుద్రమ పోలికే. బిడ్డను చూసుకొని మురిసిపోయింది. వాడిని చూడవచ్చిన వాళ్ళంతా పొగుడుతుంటే పొంగిపోయింది. అన్నేళ్ళ కష్టాన్ని ఆ క్షణంలో మర్చిపోయింది. భర్తను ప్రేమించింది. అత్తను, ఆమె

తల్లిని క్షమించింది.

'గుణపత్నిగారూ !

నేనూ మగబిడ్డనే కన్నాను. మగ పెళ్ళి వాళ్ళం మేమే. మా వాడికి భార్యను కనటమే తరువాయి' అంటూ రుక్మిణికి ఆనందాతిశయంతో వుత్తరం రాసింది.

బాలసారెకు రమ్మని భర్తకు ప్రత్యేకించి ఓ వుత్తరం రాసింది. చక్రవర్తి జవాబైనా యివ్వలేదు.

మానసికంగా రుద్రమే కొడుకుకు నామకరణంచేసింది. శ్రీకృష్ణదేవరాయలు.

"మంచి పేరమ్మా. నీ అభిరుచికి చిహ్నం. నా మనవడిని శ్రీకృష్ణదేవరాయలంత వాడిగా, ఏ వొక్క రంగంలోనైనా తయారు చేసినా దేశం బాగుపడుంది"

బాలసారెకు రమ్మన్నా రాని భర్త తన అవసరానికి రమ్మని జాబు రాశాడు.

"శ్రీకృష్ణదేవరాయలా ? అల్లావుద్దీన్ ఖిల్జీనా? అదేం పేరు ? మా నాన్న పేరు పెట్టాల్సిందే" సుందరమ్మ కోడలి ఆలోచనను ఎగతాళి చేసింది. ఆమె తండ్రి పేరు వెంకటాచలపతి.

చక్రవర్తికి కొడుకు పేరు 'రాజ్‌కుమార్' అని పెట్టాలని వుంది. చివరికి చర్చలు చేసి చేసి 'వెంకటాచల రాజ్‌కుమార్' అని నామకరణం చేశారు.

రుద్రమకు ఆ చర్చలే అర్థరహితంగా అసహ్యంగా తోచాయి. అయినా మాట్లాడలేదు. పేరేదైతేనేం ? కొడుకు గొప్పవాడు కావాలి.

అదే ఆమె ధ్యేయం. భవిష్యత్ జీవితానికి బాట !

* * *

"ఒరేయ్ చలం. రోడ్డు మీద చాక్లెట్లు అమ్ముతాడే. ఆ బడ్డీ దగ్గరకెళ్ళి నా పేరు చెప్పు. నా పేరేమిటో చెప్పు."

"చక్రవర్తిగారు"

"అవునా? నేను తెమ్మన్నానని యిలాంటి సిగరెట్టు పెట్టె ఒకటి తీసుకురా. బామ్మకు కన్పించకూడదు. తెల్సిందా?"

"బామ్మ చూస్తే ఏం?"

"బామ్మ ఒట్టి వెర్రి బాగుల్ది. నిన్నూ నన్నూ కోప్పడుతుంది. అంచేత చూడకుండా తీసుకురావాలి. నువ్వు చాక్లెట్టొకటి కొనుక్కో."

"డబ్బులు యివ్వు మరి !"

"డబ్బులు యివ్వక్కర్లేదు. అప్పు యిస్తాడు"

"అయితే నేను రెండు చాక్లెట్లు కొనుక్కుంటా"

కొడుకుకు మూడేళ్లు వచ్చిన దగ్గరి నుంచి యిలాంటి ట్రయినింగు యివ్వసాగాడు చక్రవర్తి. భర్తచేత ఆ అలవాటును మాన్పించాలని ఎంతో ప్రయత్నం చేసింది రుద్రమ. వద్దన్న పనిని మరీ కచ్చగా చేయటం చక్రవర్తికి సరదా.

"బాబూ, అలాంటి పనులు చేయకూడదు. నాన్నగారు యీసారి చెప్తే 'తప్పు' అను. అంటావు కదూ?"

"నాన్నకు కోపంరాదూ? తంతాలు"

"తన్నరు. నేనున్నాగా?"

"మలి చాక్లెట్లు..."

"నువ్వు ఆపని చేయకపోతే నేను చాక్లెట్టు యిస్తాగా? వెధవ చాక్లెట్ల కోసం అలాంటి పని చేయవచ్చా?"

తల్లి దగ్గర చాక్లెట్టుకు డబ్బులు తీసు

కొని కొనుక్కొనేవాడు. తల్లికి కూడా కనిపించకుండా తండ్రి పనులు చేసి పెట్టి అక్కడా చాక్లెట్లు కొట్టేసేవాడు.

కొడుకు చేసేపని తెలిసేసరికి కొంత కాలం పట్టింది. తెల్సుకొన్నాక భయం వేసింది. ఆ యీడుకే తల్లిదండ్రులను మోసం చేయటం నేర్చుకోవటమా ?

"అలా చేయొచ్చా ? తప్పుకదూ!" కొడుకును మందలించిందొకసారి.

"తల్లిదండ్రులను గౌరవించాలని నువ్వే చెప్పేవుకదమ్మా—"

ఇప్పుడు వెంకటాచలరాజ్ కుమార్‌కు ఆరేళ్లు దాటాయి. సెకండ్ స్టేండర్డ్‌లోకి వచ్చాడు. కానీ యింగ్లీషు 'ఎబిసిడిలు' రానట్లే తెలుగులో 'ఓనమాలూ' రావు. బట్టలు మటుకు మంచివి వేసుకొంటాడు. రోజుకో స్టైలు.

ఈ ఆరేళ్ళలో రుద్రమ జీవితానికి సంబంధించిన మరెన్నో మార్పులు జరిగాయి.

మంచంలో తీసుకొంటున్న సరస్వతమ్మ ఎప్పుడో 'గుటుక్కు'మంటుందని అందరూ అనుకొంటుంటే, సుందరమ్మ గుండె ఆగి చనిపోయింది.

సరస్వతమ్మ మంచంలోనే వుంటోంది. కేశవరావు ఆ యింట్లో వున్నా లేనిశాలీ కిందే లెక్క. అంచేత చక్రవర్తి స్నేహితులని యింటికూడా తీసుకు రాసాగాడు. చతుర్ముఖ పారాయణాలు-మందు పార్టీలు. రుద్రమ కాలేజీలో వున్నంత సేపు యింట్లో యిదీ తంతు. అడిగేవారు లేరు.

"మామయ్యగారూ. మీ అబ్బాయిగారి వరస చూస్తున్నారా ? కాస్త మీరైనా మందలించి అదుపులో పెట్టండి"

ఏమనుకొన్నాడో ఏమో కేశవరావు ఓరోజు అత్తగారి దగ్గరికెళ్ళాడు.

"ఏమండీ? చక్రికి మీరు డబ్బు ఇవ్వకండి. వాడు చెడిపోతున్నాడు."

"చెడిపోతున్నాడా నా మనవడు! వాడి పెళ్ళాం చెప్పిందా? డబ్బు వాడికి నేను ఇచ్చేదేమిటి ? ఇదంతా ఎవరిది? వాడిది కాదూ? వాడు నా దౌహిత్రుడు. రేపు తలకి కొరివిపెట్టే నా తండ్రి. వాడికి కష్టం కలగనివ్వమనా మీ సలహా. తల్లిలేని బిడ్డ. ఏ లోటు లేకుండా చూడాల్సింది పోయి...బాగుంది వరస. కోడలు మిమ్మల్ని బుట్టలో వేసుకొన్నదన్న మాట!"

అల్లుడి దగ్గరఅలా అన్నా సరస్వతమ్మ మనవడికి డబ్బిచ్చే విషయంలో జాగ్రత్త పడసాగింది.అంచేత అవసరాలకి రుద్రమమీద పడసాగాడు చక్రవర్తి. సరస్వతమ్మను నొప్పిస్తే, ఎదిరిస్తే అంతా నష్టమే!

అంతవరకు ఆడవాళ్ళు సూటిపోటిగా ఏవో మాటలనటమేగానీ రుద్రమ జీతం విషయం పెద్ద సమస్య కాలేదు. కానీ రుద్రమ ఒకటి రెండుసార్లు చక్రవర్తి అడిగితే లేదన్నాక అది సమస్య అయింది.

"ఏం చేస్తున్నావు డబ్బంతా?"

"దుబార ఖర్చు మాత్రం చేయటం లేదు?"

"అంటే నేను చేస్తున్నానని చెప్పటమా? పిచ్చి వేషాలెయ్యకు. నీ మీద నాకు అధికారం ఉన్నప్పుడు నీ డబ్బుమీద నాకు అధికారం లేదా?"

"ఉంది.అధికారంతోపాటు బాధ్యతనూ గుర్తిస్తే. మీ మీద నాకున్న అధికారానికి మీరు విలువనిస్తే?"

"అంటే? నువ్వు సంపాదిస్తున్నావు

కనుక నీ మాట విని పడుండాలా?"

"అలాగెందుకనుకొంటావు? ఇద్దరం కలిసి మన బిడ్డను తీర్చిదిద్దటానికి ప్రయత్నించాలని అనుకోకూడదా? అది మన సమిష్టి బాధ్యత కాదా?"

"సమిష్టి బాధ్యత! నువ్వు ఆడదానివి, నేను మగవాడిని. గుర్రం, గాడిద ఒకటి ఎలాగవుతాయ్! ఆదర్శాలు మాట్లాడకు. చంపేస్తా. డబ్బివ్వు."

"ఇవ్వను. ఆడదంటే చులకన. కానీ అది సంపాదించిన డబ్బు కావాలేం?"

"ముష్టి డబ్బంటే నీకు విలువ-ముష్టి దానివి కనుక! నాకేం? డబ్బు అంటే కేరేఝూట్—"

"అలాగయితే నా డబ్బును ఆశించకండి. అది చలం కోసం దాస్తున్నా—"

"ఓసి నీ మాతృప్రేమ తగలడ! మొగుడుకు పారాగతుల్లేవుకానీ ఎప్పుడో కొడుక్కని దాస్తున్నదిట! వాడికి నీ ముష్టి డబ్బు అవసరం ఉండదులే. మా బామ్మ బకెట్ తన్నేస్తే ఈ ఆస్తంతా మనదే. తెల్సా?"

మూర్ఖులతో, మొండివాళ్ళతో వాదన వల్ల ఏం లాభం?

ఈలోగా రుద్రమ మరోసారి గర్భం దాల్చింది. అప్పట్లో శారద ఓ ఆదివారం నాడు రుద్రమ ఇంటికొచ్చి వాలింది.

"నాకోక్రపమొచ్చింది. నేను అసలు నిన్ను చూడకూడదనుకొన్నా. అయినా నాకు నువ్వు స్నేహితురాలివికదా? అంచేత నీ తప్పులన్నీ క్షమించేసి వచ్చాను."

పెళ్ళికి కావాలనే శారదకు ఇన్విటేషన్ పంపలేదు రుద్రమ. పైగా అప్పుడు ఆమె పురిటికి వెళ్ళింది. ఆవిడ పురిటినుంచి వచ్చేసరికి తనకు పురుడు. పైగా కాలేజీ, ఇల్లూ గొడవలూ...తీరికేదీ? అన్నిటికన్నా ముఖ్యం రవీంద్ర ప్రవర్తన ఆమెకు నచ్చలేదు. మళ్ళీ వాళ్ళ ఇంటికి వెళ్ళి పనిగట్టుకొని పాత విషయాన్ని తిరగతోడటమెందుకూ?

"రవీంద్రను చెప్పుచ్చుకు కొట్టావుటగా నడి బజారులో. మంచి పని చేశావు. చెప్పాడులే. అందరూ శారద లాంటివాళ్ళే అనుకొన్నట్లుంది పాపం."

క్షణంలో తన మాటలతో సరస్వతమ్మనూ బుట్టలో వేసుకొంది.

"ఆ పిల్ల అంతగా పిలుస్తుంటే ఒకసారి ఇంటికి వెళ్ళి రారాదూ? ఇక్కడ పనులేం మునిగిపోవులే" అని సరస్వతమ్మ చేతనే అనిపించింది.

"రవీంద్ర నిన్ను ప్రేమించాట్టగా? ఉత్తరాలకు నువ్వు సమాధానాలివ్వలేదట. ఇక్కడికొచ్చాక అంతా చెప్పాడులే. భార్యాభర్తల మధ్య దాపరికాలు నాకు ఇష్టం వుండదబ్బా!"

అద్దె ఇల్లు కాదు వాళ్ళది. ఏదో స్కీములో మంచి ఇల్లే సంపాదించారు. ఇల్లు అందంగా, దర్జాగా ఉంది. ఇద్దరు మగపిల్లలు. ఇద్దరిదీ శారద పోలికే.

"వెధవలు నా పోలికతోనే పుడుతున్నారే. పోనీలే మగ కుంకలేగా? ఆడపిల్ల కోసం అర్రులు చాస్తున్నా. ఈ తడవ ఆడపిల్లే. అది రవీంద్ర పోలికతో పుడితే చాలు. లేకపోతే పెళ్ళి కష్టంకదా?" వాగేస్తోంది శారద.

"అవునుగాని-చక్రవర్తిగారు నిన్నెలా చూస్తున్నారే!"

రుద్రమ సమాధానం ఇవ్వలేని ప్రశ్న అది. శారద సమాధానాన్ని ఆశించినట్లు లేదు. తనే అందుకొంది—"ఎలా చూసినా మొగుడన్నాక మొగుడేలే. నాకు అతని

సంగతి చాలా కాలంగా తెల్సుగా? మా ఆఫీసరుగారికి మొదటి మందు స్నేహితులు ఆయనే. ఆ తర్వాత ఇద్దరూ కలిసి చాలా చాలా రాచకార్యాలు చేస్తున్నారనుకో. అయినా మగాళ్ళు—వాళ్ళకేమే! అన్ని



స్వాతంత్రాలున్నాయి. తలెత్తితే మనకే మొట్టికాయలు. అంచేత నేను తల వంచటం నేర్చుకొన్నాననుకో. మగాడు ఎక్కడ తిరిగితే మనకేం? మన దగ్గరున్నప్పుడు బాగా వుంటే మనకంతే చాలు–అదీ నా సిద్ధాంతం. దేనికదే చెప్పుకోవాలి. రవీంద్ర

నా దగ్గర మాత్రం ఇప్పటికి పిల్లీ-పిల్లాడే. అవునుగానీ నా పెళ్ళప్పుడు నీకో ప్రామిస్ చేశాను. గుర్తుందా?"

"ఏమిటి?"

"అప్పుడు అందరూ రవీంద్ర నీకు మొగుడు కావాల్సినవారన్నారు. కుళ్ళుకు చచ్చేరు. గుర్తుందా? నా స్నేహితురాలివి కనుక ఓ ప్రామిస్ చేశాను. నీ పెళ్ళి అయ్యాక మొగుళ్ళను ఎక్సేంజ్ చేసుకొందామన్నాను. ఇప్పుడు చేసుకొందామా ఏమిటి?"

నవ్వుతూనే అంటున్నా శారద మాటలు జుగుప్సాకరంగా, అసహ్యంగా తోచాయి రుద్రమకు. మొహంలో ఆ భావాలు కనిపించాయేమో శారదే మళ్ళీ అందుకొంది—

"ఏం? నూతన అనుభవాలు పురుషులకేనా ఏమిటి? మనకు మాత్రం అక్కర లేదా? పురుషుడికో న్యాయం, స్త్రీకో న్యాయం ఏమిటి? నీకు తెలీదేమోకానీ హై క్లాసు సొసైటీలో ఇదేం వింత కాదు, తప్పూ కాదు."

సమానత్వం అంటే ఇదా? పురుషుడు నీతి తప్పాడని స్త్రీ కూడా నీతి తప్పటంలో పోటీ పడటమా అభ్యుదయం? సొసైటి ఎదగటం అంటే ఇదా?

రెండోసారి కూడా పురిటికి పుట్టింటికే వెళ్ళింది. కానీ నెలలు నిండక ముందే పురుడొచ్చి జనన నష్టమయింది.

స్వతంత్ర భానుడు ఇంజనీర్ అయ్యాడు. ఇంటి బాధ్యతను స్వీకరించాడు. మిగతా పిల్లలను వృద్ధిలోకి తెస్తున్నాడు. పెళ్ళి చేసుకోమంది రుద్రమ.

"నువ్వే త్యాగం చేయకపోతే నేను ఏ గుమాస్తానో అయ్యేవాడిని కదా అక్కా. మరి నా తర్వాత ఒక్కడన్నా నా స్థాయికి రానియ్. పెళ్ళికేం తొందర?"

అనసూయమ్మ ఆరోగ్యం క్షీణించింది. మంచం - మందులు. చిత్రమేమిటంటే ఆ స్థితిలో ఆమెకు ఝాన్సీని గురించి దిగులు పట్టుకొంది.

"ఎంత గట్టి పిల్లే అది! చిరునామా అన్నా తెలుప లేదు. అసలు బ్రతికే వుందంటావా?"

హైదరాబాద్‌కు తిరిగి వెళ్తుంటే రైల్లో మార్కండేయులు కన్పించాడు. మనిషి ఆకారంలో పెద్దగా మార్పేం లేదు. కానీ భావాలలో తీక్షణత హెచ్చింది. ఆలోచన తగ్గింది.

"ఇప్పుడు ఏం చేస్తున్నావ్?"

"అంటే ఏం ఉద్యోగం చేస్తున్నావ్? గుమాస్తా నుంచి ప్రమోషన్ వచ్చిందా అనేనా? ఉద్యోగానికి ఎప్పుడో రాజీనామా చేశాను"

"మరి?"

మార్కండేయులు బిగ్గరగా నవ్వాడు.

భుజానికి వేలాడుతున్న బేగ్‌లోనుంచి పుస్తకాలు కొన్ని తీశాడు. కొన్ని కరపత్రాలు కూడా ఆమెకు అందించాడు. చూడగానే అర్థం చేసుకొంది రుద్రమ. అతను తీవ్రవాది.

"ఈ పుస్తకాలు మీరు రాసినవా?"

"చదివేరా?"

"చదివేను. పేరు మార్చుకొన్నారుగా? పోదనుకోలేదు"

"ఎలా వున్నాయి?"

"కవిత్వ శైలి బాగుంది. చెప్పదల్చుకొన్న దాన్ని స్పష్టంగా పిస్తోలు గుండు దూసుకొచ్చినంత తీవ్రంగా చెప్పేరు. కానీ మీరు అది రాసేరంటే నమ్మ లేకుండా వున్నాను"

"ఏం?"

"జిజ్ఞాస కన్నా మీ భావాల్లో పాక్షికత పాలు ఎక్కువగా వుంది. మీరు ఆలోచనా పరులని నా భావన. ఆనాటి తాత్విక చింతన సమ్యక్ దృష్టి మీ ఆలోచనలో కొరవడిందేమో! వయస్సు పెరిగే కొద్దీ ఆలోచనలు పెరుగుతాయని అంటారు కదా? మీ విషయంలో ఆ చక్ర గతి వెనక్కి వెళ్తున్నదేమోనని అనుకొంటు న్నాను"

అతను మౌనంగా ఆమె చెప్పేదంతా విన్నాడు.

"అంటే మీకు నా కవిత్వం వచ్చింది. కానీ అందులో వ్యక్తం చేసిన విషయం నచ్చలేదు. అంతేనా?"

ఇంతలో అతను దిగాల్సిన స్టేషన్ వచ్చింది. అతని కోసం రైలుస్టేషనుకు చాలా మంది యువకులు వచ్చారు.

చివరి ప్రశ్న వేసింది రుద్రమ. "మీ కుటుంబ స్థితిగతులు ఎలాగున్నాయి? తమ్ముళ్లు చెల్లెళ్ళు..."

"అందర్నీ యీ వ్యవస్థ పొట్టన బెట్టుకొంది"

మార్కండేయులు రైలు దిగేడు. రైలు అప్పటికే కదిలింది. రైలు దూకి అతని కథను వినాలన్నంత గాఢమైన కోరిక కలిగింది రుద్రమకు. కానీ అప్పటికే రైలు ప్లాట్ ఫారం దాటింది. మార్కండేయులు చాలాదూరమై పోయాడు. రైలు ఆమెను గమ్యంవైపుకి యీడ్చుకుపోయింది.

చలం చదివే స్కూలునుంచి ఉత్తరం వచ్చింది. తల్లి దండ్రులలో ఎవరోఒకరు వచ్చి మాట్లాడమని తాత్పర్యం.

కాలేజీకి సెలవు పెట్టి చలంకు చెప్ప కుండా స్కూలు కెళ్ళింది రుద్రమ. వాడి పద్ధతులు రుద్రమకు భయంగానే వున్నాయి. ఏం వుపద్రవం తెచ్చాడో?

"వయసులో చిన్నవాడైనా మీ వాడు అప్పుడే చాలా ఎదిగిపోయాడండీ. వాడు చేసే అల్లరి చిన్నపిల్లలు చేసేది కాదు. దొంగతనాలు చేస్తున్నాడు. ఆడపిల్లల్ని ముద్దు పెట్టుకొంటున్నాడు. ఈ మధ్య విలన్ పోజులు పెట్టి అందరినీ తన్నటం నేర్చుకొన్నాడు. 'టీసీ' యిస్తాము. మరో స్కూల్లో చేర్చుకోండి. వాడిని మా స్కూల్లో వుంచుకొని మేము వేగలేము"

హెడ్ మిస్ట్రెస్ మాటలు వెగటుగా తోచేయి రుద్రమకు. కొడుకు బుద్ధి మంతుడు కాదని తెల్సు ఆమెకు. కానీ ఆరేళ్ళ వయస్సులో యిన్ని పనులు చేసే టంతగా ఎదిగి పోయినట్లు వూహించలేక పోయింది. ఏదో సర్ది చెప్పబోయింది.

"చూడండి మేడమ్. మా స్కూలు కున్న 'మంచి పేరు' మీకు తెల్సు. డబ్బు కాదు మాకు ప్రధానం – పిల్లల భవిష్యత్తు. మీ బిడ్డను మా స్కూలులో చేర్చేక విద్యతో పాటు వినయం, మంచి తనం సద్వర్తన యిత్యాది గుణాలని కూడా మీ బిడ్డకు నేర్పి ప్రయోజనం కల సంపూర్ణ వ్యక్తిగా తీర్చి దిద్దాలన్నది మా ధ్యేయం. ఆ ధ్యేయానికి అనుగుణంగా మేము మీ బిడ్డ ప్రవర్తనలో మార్పు తేవటానికి ప్రయత్నించేము. మాకు చాత కాదని నిర్ణయించుకొన్నాకే మీ బిడ్డను మీకు అప్ప చెప్పుతున్నాము క్షమించండి"

చలం కోసం కబురు చేసింది హెడ్ మిస్ట్రెస్. క్లాసులో లేడని వార్త. ఇక ఏం వాదించగలదు రుద్రమ? టీసీ తీసుకొని బయట పడింది.

అల్లంత దూరంలో కిల్లీ బడ్డి దగ్గర

సిగరెట్టు కాలుస్తూ కొందరు పిల్లలతో చలం నిలబడి వున్నాడు. జుట్టు ఎగ దోసుకొంటూ మిగతా పిల్లలకు ఏదో చెబుతున్నాడు.

ఆరేళ్ళ కొడుకు ఆ క్షణంలో ఆమె కళ్ళకు పదిహేనేళ్ళ వాడుగా కన్పించాడు!

ఇంతలో చలం తల్లిని చూశాడు. సిగరెట్టు పారేసి పక్కనున్న గల్లీలో పడి పరుగో పరుగు!

ఆ రోజంతా మంచి నీళ్ళు కూడా ముట్టలేదు రుద్రమ. మరణ సదృశరా లయింది. మాతృ స్థానంలో కూడా తనని ఏదో సర్పం కాటు వెయ్యబోతోందా?

"అన్నం వద్దు బామ్మా. అమ్మ తంతుంది. భయంగా వుంది. ఇవాళ నీ దగ్గరే పడుకొంటా బామ్మా"

ఎప్పుడు వచ్చాడో బామ్మ పక్కలో చేరి వగలుపోతున్నాడు. చీకటి పడి చాలా సేపయినట్లుంది. చక్రవర్తి ఇల్లు చేరాలంటే అర్ధరాత్రి కావాల్సిందే!

ఆమెకు వున్నట్లుండి ఒక్కసారిగా కోపం పొంగు కొచ్చింది.

"ఒరేయ్ చలం"

"ఏమిటే ఆ గావు కేకలు? వాడు అసలే నీ దగ్గరికి రావటానికి భయపడు తున్నాడు. ఏం? నా బిడ్డను చంపుతావా? అలా అరుస్తావేమిటి? వాడికి అన్నం ఇక్కడికే కలుపుకొని తెచ్చి పెట్టు. బిడ్డ జడుసుకోగలడు. జాగ్రత్త"

సరస్వతమ్మ మాటలు రుద్రమకు విన్పించలేదసలు. విన్పించినా పట్టించు కొనే స్థితిలో లేదు. అసహాయత్వం - కోపం-భయం, బాధ కలిసి ఆమెను ముందుకు నెట్టాయి. సరస్వతమ్మ మంచం మీద ఆమె ఒళ్ళో తలదాచుకొని అమాయకంగా పడుకొని వున్న చలాన్ని రెక్క పట్టుకొని లాగింది. వాడు ఏడ్పు లంకించుకొన్నాడు.

"వేషాలు వెయ్యకు. ఇవాళ ఏం చేశావ్ నువ్వు? ఇన్నాళ్ళుగా బళ్ళో ఏం చేస్తున్నావ్?" పిచ్చి కోపంతో ఆమె వాడిని దబ దబా బాదింది. సరస్వతమ్మ ఎంత అరుస్తున్నా వూరుకో లేదు.

చలం ఏడుపుకి, సరస్వతమ్మ కేక లకి కేశవరావు తన గదిలో చేసు కొంటున్న తపస్సు నుంచి బయట పడి హడావిడిగా వచ్చాడు.

"తాతయ్యా!" ఆయనని చుట్టేసు కొన్నాడు చలం.

"చూడవయ్యా అల్లుడూ. నా ఎదుటే నా బిడ్డను ఎలా కొడుతుందో చూడు అది. మంచంలో పడ్డ ముసలి ముండ ననేగా దానికా తుస్కారం. ఏమేవ్- ఇది నా ఇల్లు. నా ఇంట్లో నా బిడ్డను కొడతావా? నా మాటను తిరస్కరిస్తావా? మీరన్నా బుద్ధి చెప్పండి అల్లుడు గారూ దానికి.

"ఏమిటమ్మా? ఏమిటయింది? బిడ్డను ఎందుకలా కొట్టావు?"

"ఏం చెప్పను. మామయ్యా? వాడు యీ ఇంట్లో గారాబంతో చెడిపో తున్నాడు..." అంటూ ఏడుస్తూ అంతా చెప్పింది రుద్రమ. అదీ చెప్పడం కాదు. స్వగతం.

"బోడి చదువు-బోడి స్కూలు. ఆ స్కూలు కాకపోతే దాని అబ్బలాంటి స్కూలు మరొకటి. చదువు రాకపోతే పీడా బోయె. ఏం? చదివి నీలాగా ఉద్యోగాలు చేయాలా వాడు. వాడికేం అంత ఖర్మ పట్టలా? మీరంటే ముష్టి వాళ్లు. మా వాడికి ఒకరి దగ్గర చెయ్యి

చాపాల్సిన అవసరం ఏం? మా చక్రవర్తి చాపాడా? మాది చక్రవర్తుల వంశం. ముష్టి మనుష్యులకేం తెలుస్తుంది? సిగరెట్లు తాగితే ఏమయిందిట! వాళ్ళ నాన్న తాగటంలా? అదో పెద్ద నేరమా?అందుకు ఇంత పెద్ద దండనా? కన్నాను గదాని కొట్టటానికి హక్కు వుందనుకొంటున్నావేమో! వాడు యీ ఇంటి వారసుడు. వాడి కోసమనే కాకపోతే నువ్వసలు యీ యింటి కొచ్చేదానివే కాదు. పెళ్ళి చేసుకోనని భీష్మించుకు కూర్చున్న చక్రం గాడిని మెడలు వంచి పెళ్ళి చేసింది ఎందుకనుకొన్నావ్? అమ్మా - వేషాలు పోతున్నావ్? వాడు రానియ్. ఇంతకు ఇన్ని దెబ్బలు తింటావ్ నువ్వు... యీ ఇంట్లో నీ వేషాలు సాగవు. నా అల్లుడు లాగానే మనవడు మేక, గొర్రె అనుకొంటున్నావేమో. వాడు పులి. పులి కడుపున పులి పుడుతుంది. లేకపోతే సింహం పిల్ల పుడుతుంది.మా చలపాయ్ గాడు సింహం పిల్ల. ఫో నీ మొహం నాకు చూపించకు."

అర్ధరాత్రికి పులి మంచి నిషాలో వచ్చింది. ఇంకో పులి చెప్పిన మాటల్ని వింది. పంజా విప్పి చంద్రమను చీల్చి చెండాడింది.

మర్నాడు పొద్దున చంద్రమకు విపరీతమైన జ్వరం వచ్చింది. 15 రోజులు మంచంలోనే. చూసే దిక్కు లేదు. పలకరించే మనిషి లేదు. పక్కింటి వంట మనిషి అందరికీ ఇంత వండి పడేసేది.

* * *

కాల చక్ర పరిభ్రమణం ఒకరి కోసం ఆగదుగా? దాని దోవన అది తిరుగుతూనే వుంది.

ఆ రోజు కొడుకు స్థితి చూశాక చంద్రమ కడుపు తరుక్కుపోయింది. గుండెల్లో మంట. ఆ మంటలో నుంచి ఓ నిర్ణయం. కొంత కాలం వాడిని ఇక్కడి వాతావరణానికి దూరంగా తీసుకెళ్ళాలి. పరిశుభ్ర వాతావరణంలో వాడి బుర్రలోని కాలుష్యాన్నంతా కడిగి పారెయ్యాలి. లేకపోతే ఆ యీడుకే వాడు తాగుబోతు కూడా అవుతాడు. తండ్రిని చూసి నేర్చుకోవటం, గారాబం-సినిమాలు-తండ్రి... యీ మూడు ప్రభావాల నుంచి అతడిని తప్పించాలి. మొక్కగా వుండగా వంచకపోతే మాను అయ్యాక సాధ్యమవుతుందా ?

క్రింద నున్న సీసాతోపాటు భర్త రహస్యంగా దాచే చోట వున్న సీసాలను కూడా తీసి అవతల పారవేపింది. గదిని శుభ్రం చేసింది.

"నా కొడుకు ఈ వాతావరణంలో ఇలా చెడిపోవటం నేను సహించలేను. మీ పద్ధతులు మార్చుకోవాలి. నా కోసం కాదు. వాడికోసం. లేకపోతే నేను వాడిని తీసుకొని వెళ్ళిపోతాను."

"వెళ్ళిపో కావాలంటే విడాకులే ఇస్తాను."

ఇది జరిగాక భార్యా భర్తల మధ్య మాటలు తగ్గిపోయాయి. చక్రవర్తి అప్పుడప్పుడు ఇంటికే ఆ ఆడవాళ్ళను తీసుకురాసాగేడు. మరో స్కూల్లో చేరాదన్న మాటేగాని చలం పద్ధతిలోనూ మార్పు లేదు.

చంద్రమ బదిలీకి కాగితం పెట్టుకొంది. కానీ కేవలం కాగితాలతో పనులయ్యే కాలం కాదుగా ?

కాలం గడుస్తోంది. కాలం గడిచే కొద్దీ

రుద్రమలో నిరాశ నిస్పృహలు పెరిగిపోతున్నాయి, సంసారం మీద రోత కలుగుతోంది.

బదిలీ విషయం ప్రయత్నించటానికి ఒక రోజు ఆఫీసుకు వెళ్ళింది. పెద్ద ఆఫీసరును కలిసింది. అప్పుడు ఆఫీసరు గదిలో మరో వ్యక్తి కూడా వున్నాడు. ఆ వ్యక్తి తన వైపే పరీక్షగా చూడటం గమనించింది రుద్రమ. అతడిని ఎక్కడో చూసినట్లు ఆమెక్కూడా అనిపించ సాగింది.

"అందరూ హైదరాబాద్‌కు బదిలీ కావాలనుకొంటారు. నువ్వేమిటమ్మా ఇక్కడినుంచి బదిలీ అడుగుతున్నావ్? పైగా నీ భర్త ఇక్కడే వున్నాడుగా?"

ఎలా వివరించగలదు రుద్రమ!

"పైగా మీరు అడిగే చోటుకి ఈ మధ్యనే ఒకతడిని వేశాము. అతడి భార్య కూడా అవూళ్ళోనే వుద్యోగం చేస్తోంది. మీరు అడిగే ట్రాన్స్‌ఫర్ చేస్తే ఒక్కసారి ఇద్దరు భార్యా భర్తలను అనవసరంగా విడదీసినట్లవుతుంది. అంతగా అవసరం అనుకొంటే మరోచోటు అడుగు"

"మీ ఇష్టమొచ్చిన చోటికి బదిలీ చేయండి సార్-"

ఆల్ రైట్...వుయ్ విల్ సి-"

రుద్రమ చేసేదేంలేక బయటికొచ్చింది.

"ఎక్స్‌క్యూజ్ మి"

ఇందాక ఆఫీసరు ఎదురుగ్గా కూర్చున్న వ్యక్తి. పొడుగ్గా, నల్లగా వున్నాడు. తల మీద అక్కడక్కడ నెరిసిన వెంట్రుకలు, కళ్ళజోడు, బూట్లు...అతనికి గంభీరతను తెచ్చి పెట్టాయి.

"నన్ను గుర్తుపట్టలేదా? నా పేరు విష్ణువర్ధనుడు"

గుర్తుకొచ్చింది రుద్రమకు. ఎందుకో సిగ్గు పడింది.

"మీకభ్యంతరం లేకపోతే నా వెంట ఓసారి రాగలరా?"

అతను హుందాగా ముందుకు నడిచేడు. ఎక్కడికి? ఎందుకు? ఇత్యాది ప్రశ్నలు అడగాలన్న తలంపే రాలేదు రుద్రమకు. అతని వెంట నడిచింది.

పోర్టికోలో తెల్లబట్టలు వేసుకొన్న డ్రైవరు విష్ణువర్ధనుని చూసి కారు డోర్ తెరచి పట్టుకొన్నాడు.

"కూర్చోండి" దారి చూపించినట్లు లోపలికి చూపించాడు. రుద్రమ వెనుక సీట్లో కూర్చుంది. అతను కూడా వెనక సీట్ లోనే ఎడంగా కూర్చున్నాడు.

"ఇంటికి"

కారు అతని ఇల్లు కాబోలు చేరింది.

దారిలో ఎవ్వరూ మాట్లాడలేదు.

ఇంటి ముందున్న 'నేమ్‌ప్లేట్'ను బట్టి అతని స్థాయి అర్థమయింది. అతను చాలా పెద్ద వుద్యోగంలో వున్నాడు.

"నిన్ను ప్రేమించక ముందు ఈమెను పెళ్ళి చేసుకొందామనుకొన్నాను. పేరు రుద్రమ. లెక్చరర్ వుద్యోగం చేస్తోంది" భార్యకు పరిచయం చేశాడు ఆమె కూడా కాస్తంత నలుపు ఛాయే అయినా అందంగా హుందాగా ఉన్నది.

మర్యాదలు అయ్యాయి. లాంఛనాలు ముగిశాయి.

"నన్ను ప్రేమించామన్నారు మరి"

"ఇప్పుడు కాదన్నానా? నిన్ను ప్రేమించాను. ఆమెను పెళ్ళి చేసుకొందామనుకొన్నాను. తప్పా?"

కాస్సేపు మాటలయ్యాకి వాళ్ళది ప్రేమ వివాహమని, అనురాగమయమైన సంసారమని అర్థం చేసుకొంది. తన

దగ్గర గుమాస్తాగా చేస్తున్న ఆమెను ప్రేమించి పెళ్ళి చేసుకొన్నాడు. పిల్లలు.. ప్రమోషన్...

"మిమ్మల్ని ఒకప్పుడు పెళ్ళి చేసుకొందామనుకొన్నాను. అందుకు కారణం చెప్పలేను. ఇప్పుడు మిమ్మల్ని ఇందాక ఆ పరిస్థితిలో చూశాక మీస్థితి తెల్సుకొని చేతనయితే సహాయం చేయాలని పించింది-"

ఎందుకో ఆ సమయంలో రుద్రమకు అత్యంత సన్నిహితమైన సహృదయుని చెంతనున్నట్లు అనిపించింది. బాధను చెప్పుకొంది.

"అయితే మీరు చక్రవర్తిని పెళ్ళి చేసుకొన్నారన్న మాట !"

"ఆయన మీకు తెల్సా ?"

"రవీంద్ర స్నేహితుడేగా ?" అంటూ నవ్వేడతను. అంత స్నేహితులకి కూడా చెప్పకుండా తనని పెళ్ళి చేసుకొన్నాడన్న మాట ? ఎందుకు? ఎప్పుడో కాపురానికి వచ్చిన కొత్తల్లో ఒకామె అన్న మాటలు గుర్తుకొచ్చాయి.

"తలి దండ్రుల ప్రభావం బిడ్డలపై వుంటుందన్నది నిస్సంశయమైన విషయం. కానీ, బిడ్డకోసం భర్తను వదిలేసి పారి పోవటం సమంజసమా?"

మిగతా ఇంటి బాధలు కూడా చెప్పకోక తప్పలేదు రుద్రమకు.

"రవీంద్రకు నేనెన్నోసార్లు చెప్పాను. కానీ వాళ్ళదొక సొసైటీ. రవీంద్ర భార్యను మీరెప్పుడైనా కలిశారా? ఆమె మీ స్నేహితురాలు కదా ? ఆమె మీలాగా ఎదురు తిరగలేదు భర్తకు. కాగా భర్తకు ప్రోత్సాహమిస్తోంది. సరే...నాకో అవకాశం ఇవ్వండి. విఫలమైనప్పుడు మీకు బదిలీ రావటానికి సహాయం చేస్తాను. మీ ఆఫీసరు నా మిత్రులే—?"

మరికొన్నాళ్ళు గడిచింది. విష్ణు వర్ధనుడు ఏం చేశాడో ఏమో తెలియదు. కాని ఓ రోజు చక్రవర్తి ఇంటికివస్తూనే విరుచుకుపడ్డాడు.

"కొత్త పరిచయాలు చేసుకొంటున్న ట్లున్నావే! కులం ఏదయితేనేంలే పెద్ద ఆఫీసరు పిట్టనే పట్టావు ?"

"అందరూ మీలాంటి వాళ్ళే ననుకోకండి" ఆత్మాభిమానం గాయపడగా వుక్రోషంతో అంది రుద్రమ.

"అంటే ...వాడు నాకన్నా గొప్పవాడా ? నాకు నీతులు చెప్పేవాడా ?"

పులి మరోసారి పంజా విప్పింది.

"అంతగా వాడు నచ్చితే వాడి దగ్గరికే వెళ్ళి పడుండు. ఇక్కడవుండి నాటకా లెందుకాడతావ్ ?"

ఉన్నట్లుండి ఓ రోజు బదిలీ అయినట్లు కాలేజీకి కాగితంవచ్చింది రుద్రమకు. ఎక్కడో చాలా దూరం. నాగరికతా వ్యామోహాలు ఇంకా పూర్తిగా విస్తరించని ప్రాంతం.

సరస్వతమ్మ ఆ వార్త విని గోల పెట్టింది. కేశవరావుకు ఆ మధ్య ఓ సారి 'హార్ట్‌స్ట్రోక్' వచ్చింది. ఆయన దీనంగా చూశాడు రుద్రమవైపు.

"వెళితే వెళ్ళు. నా మనవడికి మరో పెళ్ళామే దొరకదా? మా చలానికి బామ్మ వుంటే చాలు. అమ్మ లేదని ఏడ్చిపోడులే! డబ్బు పారేస్తే పని మనుషులు వంట మనుష్యులు దొరక్కపోరు"

ఏ కొడుకు భవిష్యత్తును కోరి బదిలీ సంపాదించుకొందో, ఆ చలం తల్లితో రానని మారాం చేశాడు. రుద్రమ కొడుక్కి ఎన్నో బోధలు చేసింది.

"ఛీ. సిటీని వదులుకొని ఆ బోడి

వూరుకు ఎవరొసారు? నేనేం వెర్రివాడిని కాను. నీలాగా నేను నాన్న దగ్గర, బామ్మ దగ్గరే వుంటా"

దగ్గర వుండి కొడుకు పతనాన్ని ప్రతి క్షణం కళ్లారా చూసే బదులు దూరంగా వెళ్ళిపోతే నయం కదూ? వుండి చేయలేని పనిని వెళ్ళి చేయగలదేమో!

"బెదిరిస్తే కాళ్లా వేళ్ళా పడ్తాననుకొన్నావేమో? ఉద్యోగాలు చేయంగానే సరా? వెధవ మొద్దుమొహం నువ్వూను.



మళ్ళీ నీ మొహం చూపకు వెళ్ళు"

భవిష్యత్తు జీవితానికి కొడుకు ఆలంబనం అనుకొంది. కానీ ఆ ఆధారం కాస్తా ఇప్పుడు తెగిపోతుంది. కన్న కొడుకును వదిలేసి తను అక్కడెక్కడికోపోయి ఏం సాధించాలి? అసలు ఒంటరిగా తను వుండగలదా ? మమకారాన్ని తెంపుకోగలదా?

"ఏ కొడుకు భవిష్యత్తు కోరి భర్తను కూడా వదిలి వెళ్ళటానికి సిద్ధపడ్డానో ఆ కొడుకు నాతో రానంటున్నాడండీ. ఒంటరిగా వెళ్ళి అక్కడెక్కడో నేనేం చెయ్యను? దయచేసి ఆ ఆర్డర్స్ కాన్సిల్ చేయించండి"

విష్ణువర్ధనుడు ఆమె బలహీనతను అర్థం చేసుకొన్నాడు.

"చూడండి! ట్రాన్స్‌ఫర్ కాన్సిల్ చేయించటం అంత కష్టం కాదు. కానీ మీ విషయమే మరోసారి ఆలోచించుకోండి. సంసార శకటానికి భార్యాభర్తలు గుర్రాలు లాంటి వారు. ఇరువురు సమోధ్యతగా, సమంగా వున్నప్పుడే శకటం ఒడుదుడుకులు లేకుండా నడుస్తుంది. సమత ఎలాగూ లేదనుకోండి. కనీసం సమోధ్యత అయినా వుండాలిగా? అది కొరవడినప్పుడు కొన్నాళ్ళు దూరంగా ఉంచటమే మంచిదేమో ఆలోచించుకోండి. పైగా తల్లి బిడ్డను ఎలాగైతే వదిలి ఉండలేదో బిడ్డ కూడా తల్లిని వదిలి ఎంతో కాలం ఉండలేడని నా అభిప్రాయం."

"కానీ వాడు..."

"పిల్లలకు అనుకరణ శక్తి ఎక్కువ. ఆలోచనా శక్తి తక్కువ. అందుచేత తప్పుదోవ పట్టి వుండవచ్చు. అంత మాత్రాన తల్లిని వదులుకోగలడా? అలా ఆ యీడునే తల్లిని కూడా వదిలేసుకోగలిగితే అప్పుడు ఆలోచించాల్సిందే వాడిని గురించి."

చివరికి వెళ్ళటానికే నిర్ణయించుకొంది. కొత్త వూరికి వెళ్ళేముందు మధ్యలో పుట్టింట ఓరోజు మజిలీ చేసింది. అనసూయమ్మ స్థితితోపాటుగా మాధవరావు ఆరోగ్యస్థితి అంతంత మాత్రంగానే ఉంది. ఆయన ముక్తి మార్గంలో పడ్డాడు. ఇక ఆ సంసారానికి తన అవసరం లేదు. స్వతంత్ర భానుడున్నాడు.

"భర్తనూ, పిల్లవాడినీ వదిలి ఈ కానన గంతల్లో ఉద్యోగమేమిటే ?" అనసూయమ్మ ముక్కుతూ, మూలుగుతూనే బాధపడిపోయింది.

"చాల్లే! ఉద్యోగం వదులుకోమని సలహా ఇస్తావా ఏమిటి? ఆడదానికి ఆర్థిక స్వాతంత్రం అవసరం. డబ్బులేని మన పరిస్థితి చూశావుగా? నా చరిత్ర నన్ను ఆదుకొందా ? స్వాతంత్రం సమరం అప్పుడు నేను చేసిన త్యాగాలు నన్ను ఆదుకొన్నాయా?''

"అయితే మనిషికి జీవితంలో ధనార్జనే ముఖ్యం అంటారా నాన్నా?''

"నేను అననమ్మా! కానీ లోకం అలా నడుస్తున్నది కదా? ఎదురీది ఏం లాభం? నాలాగా తల వంచటమేగా చివరికి?''

"ఒకప్పుడు మీరు అమ్మతో నన్ను గురించి మాట్లాడుతూ, స్త్రీకి వివాహం మినహా మరో జీవితం లేదా అన్నారు.''

"ఎప్పుడు?"

"ఎప్పుడైతేనేంలే నాన్నా. ఇప్పుడు చెప్పండి. స్త్రీ జీవితానికి అర్థం పరమార్థం ఏమిటి?"

"ఒక్క స్త్రీ జీవితమనే ఎందుకు అడుగుతావమ్మా. అసలు మానవ జీవి

తానికే అర్థం, పరమార్థం ఏమిటి? పెద్ద ప్రశ్నే. మహా మహాతాత్వికులకు అంతు బట్టని ప్రశ్న. వ్యక్తి అభిరుచులపై ఆ వ్యక్తి జీవితం యొక్క అర్థం ఆధారపడి వుంటుంది. నా మట్టానికి నన్ను తీసుకో. స్వాతంత్ర్యం రాక పూర్వం నా జీవితానికి అర్థం–స్వాతంత్ర్య సముపార్జనే అనుకొన్నాను. ఆ తర్వాత ఈ సంసారాన్ని ఈదగలగటమే అని అనుకోక తప్పలేదు. అలాగే ధనార్జనలో పడ్డ వాడికి జీవితం యొక్క అర్థం – ధనార్జనగానే కన్పిస్తుంది. కానీ పరమార్థం అలా కాదు కదా? అది అలౌకికమైనది. జ్ఞాన సముపార్జన, తాత్విక చింతన, పరోపకార పరాయణత్వం, దీనజన సేవ, ఆముష్మిక జీవనం...ఏదైనా కావచ్చు–కానీ జీవితంలో ఈ అన్వేషణ ఎప్పుడో ఒకప్పుడు చేసుకోని వాడికి–ఎంత సంపాదించినా అర్థం పరమార్థం అంతు పట్టవు"

డాక్టర్ రామ్‌మోహన్, కాశీకాంబలకు తన బదిలీ విషయం రాసింది. తను ఏ బండిలో వెళ్ళుతున్నది కూడా రాసింది. స్టేషనుకు రామ్ మోహన్ ఒంటరిగా వచ్చాడు.

"అదేమిటి మాష్టారూ. ఒంటరిగా వచ్చారా? రుక్మిణి...మీ బాబు...పాప"

రామ్‌మోహన్ ఉత్సాహంగా లేడు. మొహంలో ఏవో విషాదచ్ఛాయలు.

"నువ్వు ఒక్క పూట–కనీసం కొన్ని గంటలు–నీ ప్రయాణాన్నిక్కడ 'బ్రేక్' చేయలేవా రుద్రమా. నా కోసం..ప్లీజ్"

రైలు దిగి రామ్‌మోహన్‌తో ఇంటికి వెళ్ళింది. క్వార్టర్ అదే. కానీ కళా విహీనంగా వుందేం?

ప్రతాపరుద్రుడు పెద్దవాడయ్యాడు. చాకులాంటి కుర్రవాడని చూడగానే గ్రహించవచ్చు. వయసుకు మించిన తెలివి తేటలు గలవాడు. క్లాసులో అన్నింటా ఫస్టే. రుద్రమకు చలం గుర్తుకొచ్చాడు. వాడిలోనూ హుషారు వుంది. చైతన్యం వుంది. కానీ ప్రతాపరుద్రుడిలో కన్పించే చేతన సత్వ ప్రధానం. చలంలో కన్పించే చైతన్యం రజోగుణపేతం. ఒకడు భవిష్యత్తుకు వెలుగు–మరొకడు చీకటి.

రెండోది ఏణ్నర్థం పిల్ల. చందనపు బొమ్మలాగుంది. పేరు కమల.

రుక్మిణి ఏదీ? వాతావరణమే చెప్తోంది రుక్మిణి చనిపోయింది. ఇంకా వారమన్నా కాలేదు.

"ఇది పుట్టకముందునుంచే నీకు కోడలనుకనాలని వుబలాటపడింది.కనింది. మేమే హైదరాబాద్‌కు వచ్చి మా అల్లుడిని చూసుకొని, నీకు కోడల్ని చూపాలనుకొంటున్నాం. ఈలోగా అకస్మాత్తుగా ఇది జరిగి పోయింది."

రామ్‌మోహన్ ఏడవటం లేదు. విషాన్ని మింగలేక కక్కలేక గొంతులో దాచుకొన్న గరళకంఠుడిలాగున్నాడు.

"రుద్రమకు మాట ఇచ్చాను. ఎప్పుడోఒకప్పుడు ఆమె కోడల్ని ఆమెకు అప్ప చెప్తాను కదూ ?... రుక్మిణి చివరి మాటలు అవి. ఆమె కోరిక నెరవేర్చే సమయం ఇంత త్వరలో వస్తుందనుకోలేదు. అదృష్టవశాత్తు వచ్చింది. నీ కోడల్ని నీకు అప్పచెప్తున్నా"

కోడలు వుంది. కానీ కొడుకే దూరమయ్యాడే?

రుద్రమకెందుకో తన విషాద గీతం ఆ సమయంలో అతని ముందు పాడాలనిపించ లేదు.పాడి ఏం లాభం? విషాదాన్ని

మరికొంత తినిపించటమేగా ?

"అయితే నా కోడల్ని నేను తీసుకు పొమ్మంటారా మాస్టారూ. మీ కభ్యంతరం లేకపోతేనే సుమా ? నాకూ కాస్త కాల క్షేపం"

రామ్‌మోహన్ నీరసంగా నవ్వాడు. "ఈ మేస్టరంటే నీ కెందుకమ్మా ఇంత గౌరవం. కొత్తచోటు గదా నీకు? కాస్సంత స్థిరపడ్డాక నేనే వచ్చి నీ కోడల్ని అప్ప చెపాలే. నీ కోడలు నీ దగ్గర పెరగటమే మంచిది కదా ?"

కొత్తచోటు పద్మకు అన్నివిధాలా నచ్చింది. నవనాగరికత ఆర్భాటాలు లేకుండా ఊరు కాస్సంత ప్రశాంతంగా ఉంది. జనంలో కూడా మరీ అంత దుర్మార్గ ప్రవృత్తి పెరగలేదు. కాలేజీలో విద్యార్థుల 'డిసిప్లీన్' ప్రాబ్లమ్ అసలు లేదు. ఎక్కడో దూరంగా వుండటం వల్ల మేస్టర్ల మధ్య కూడా గ్రూపులు లేవు. సయోధ్యతే వుంది.

కాలేజీ ప్రిన్సిపాల్ శంకర నారాయణ కూడా ఆ ఊరికి కొత్తగా వచ్చాడు. ఆయన సాహిత్య వేత్త. ఇంగ్లీషు, తెలుగు సాహిత్యాలను పుక్కిట పట్టిన పండితుడు. జీవిత అనుభవంతో, ఆలోచనలతో పండి పోయిన వ్యక్తి ఆయన.

"మీరు రాసిన కథకు అప్పుడెప్పుడో బహుమతి వచ్చింది కదూ?" పద్మ కాలేజీలో చేరిన కొన్నాళ్ళకి ఏదో సంద ర్భంలో ప్రశ్నించాడు శంకర నారాయణ.

"చాలా సంవత్సరాల క్రితమండీ–" పద్మ వినయపూర్వకంగా అంది.

"అవును. ఆ తర్వాత మళ్ళీ ఏమీ రాసినట్లు లేదు?"

"లేదండీ."

"అప్పుడా కథల పోటికి నేనో 'గుణ నిర్ణేతను' మీ కథ నాకు బాగా నచ్చింది. ముందు ముందు చాలా రాస్తారనిఆశించాను. ఆ బహుమతి మీకు ప్రోత్సాహకరంగా వుండి, వుద్దీపననిస్తుందని మే మను కొన్నాం. దానికి వ్యతిరేకంగా జరిగి నట్లుందే ?"

సిగ్గు పడింది పద్మ. "అదేం కాదండీ. నేనసలు రచయిత్రిని కాను. ఏదో అంశం నన్ను ప్రేరణ చేయగా అప్పుడా కథను రాశాను. ఆ తర్వాత.."

"ఆ తర్వాత జీవితంలో ప్రేరణ కలిగించే సంఘటనే లేదంటారా ?" ఆయన నవ్వాడు. "మీరు రచయిత్రో కాదో నిర్ణయించుకోవటంలో పొరపడ్డారు. మీరు రచయిత్రే. నేను చెప్తున్నాను. మళ్ళీ ప్రయత్నిస్తే మంచి రచనలు చేయ గలరు.

పద్మ ఒక ఇల్లు అద్దెకు తీసు కొంది. వంట మామూలే.

ఇల్లు కాలేజీకి దగ్గర. వంట చేసుకొని ఇంత తిని కాలేజీకి వెళ్తుంది. సాయం కాలం కాలేజీ నుంచి ఇంటికి వచ్చాక కాలం గడవదు. పుస్తకాలతో మిత్రత్వం చేసింది.

రామ్‌మోహన్ కమలను అప్పచెప్పి పోవటానికి వచ్చాడు.

"ఒంటరిగా ఇక్కడ ఎన్నాళ్ళు వుంటావ్? హైదరాబాద్‌కు బదిలీకి ప్రయ త్నించ మంటావా ?"

"వద్దు. నా కిక్కడే బాగుంది"

"పోనీ – బాబునన్నా పంపించమని రాయరాదూ మీ వారికి ?" అనుమానంగా అడిగాడు. అసలు విషయం చెప్పక తప్పలేదు పద్మకు.

"పెళ్ళినాడే అనుకున్నాము. అయినా

పంతాలకు పోకూడదు సుద్రమా. భార్యకు భర్త, భర్తకు భార్య సర్దుకు పోవాలి. నా మొదటి భార్య అనుభవంతో నేను నేర్చుకొన్న గుణపాఠం అది. భర్తను, బిడ్డను వదిలేసి రావటంలో తొందర పడ్డావేమో నువ్వు"

"లేదు మేస్టారూ. నా స్వభావం మీకు తెల్సుగా? సహనానికి కూడా ఓ సరిహద్దు వుంది కదా? నేను ఎన్ని బాధలు, అవమానాలనైనా సహించగలను. కానీ నా బిడ్డే నా కళ్ళ ఎదుట అలా చెడిపోతుంటే ఎలా చూస్తూ వూరుకోను? అలా వూరుకోటం మంచితనం అనిపించుకొంటుందా ?"

"పోనీ పారిపోయి ఏమి సాధిస్తున్నావు?"

"సాధించేదేమిటి మేస్టారూ? ఆ చిత్రహింస కడుపు కోత నుంచి తప్పించుకొన్నాను.కనీసం నా మనసుకు ప్రశాంతతను అన్వేషించుకొంటున్నాను"

"పోనీ నన్ను హైదరాబాద్ వెళ్ళి ఒకసారి ప్రయత్నించమంటావా ?"

సుద్రమ పేలవంగా నవ్వింది. "ఒద్దు మాస్టారూ. ఎలా జరగాలో అలాగే జరుగుతుంది. నా కొడుకు త్వరలో ఆ భ్రష్ట జీవితంతో రోసిపోతాడని నాకెందుకో నమ్మకంగా వుంది. అమ్మను వెతుక్కొంటూ వాడే వస్తాడు. అప్పుడు వాడిని ప్రతాప రుద్రుడిలా తయారు చేస్తాను మాస్టారూ. మీ అల్లుడిని నా ఆదర్శాల మేరకు తీర్చిదిద్దుకొంటాను. వాడు రాడనుకోండి - కమలను నా కూతురులాగా పెంచి మీ కప్పచెప్తాను. చూస్తారుగా?"

కమల పెంపకం...పుస్తక పఠనం..

రెంటిలో ఎంతటి అద్వితీయమైన ఆనందానుభూతి !

వినాలని శ్రద్ధ వున్నవారికి పాఠం చెప్పటంలో ఎంత మాధుర్యం వుంది? ఎంత తృప్తి!

అయినా రోజుకోసారి అన్నా చలం గుర్తుకొచ్చేవాడు. వద్దనుకొన్నా భర్త గుర్తుకొచ్చేవాడు వారానికోసారన్నా. ఏం చేస్తున్నారో ? ఎలా వున్నారో ? తనని గురించి అసలు తల్చుకొంటున్నారా ? పశ్చాత్తాపం చెందుతున్నారా ?

చలానికి అన్నం ఎవరు పెడుతున్నారో ? సరస్వతమ్మ మంచంలోనుంచే లేవలేదే ?

ఇలాంటి ఆలోచనలు వచ్చినప్పుడు ఆమె మనసు తల్లడిల్లిపోయేది. అంతలోనే ఆత్మావలోకనం చేసుకొనేది.

ఎక్కడున్నదీ బలహీనత స్త్రీ పుట్టుకలోనే వుందా ? కన్న తల్లిదండ్రుల్ని మర్చిపోయినంత సులభంగా స్త్రీ భర్తను, బిడ్డల్ను మర్చిపోలేదేం?

అభిమానాన్ని చంపుకొని చక్రపర్తికి ఉత్తరం రాసింది. జవాబుకోసం చాలా రోజులు ఎదురు చూసింది. కానీ నిరాశే ఎదురయింది. అక్కడా ఓటమే!

బాధ, ఆవేశం, ఆవేదన?

వాటిని ఉపశమింపచేసుకోవటానికి ఓ కథ రాసింది. పత్రికకు ఒకదానికి పంపింది.

ఆ ఒక్క కథతో చిత్తశాంతి చేకూరలేదు. రెండు, మూడు, నాలుగు, అయిదు వరుసగా కథలు రాసింది. అన్ని కథల లోనూ తనే హీరోయిన్. పురుషుడిలోని ఒక్కో అంశం విలన్. ఈ రెంటి స్పర్థవల్ల కలిగేది బాధ. హీరోయిన్ బాధ పాఠకులకు జాలి కలిగిస్తుంది.

కథలెన్ని రాసినా తృప్తి కలగలేదు. నవల రాసింది.

కొన్నాళ్ళ తర్వాత కథలు, నవలలు అన్నీ దాదాపు ఒకేమారు అన్ని పత్రిక లలో ప్రచురించబడ్డాయి. ఒక్కసారిగా పేరు ప్రఖ్యాతులొచ్చాయి. రచయిత్రిగా ముద్రపడింది పత్రికల్లో పొగడ్తలపైన పొగడలు!

ఏంచిత్రం? తన మానసిక క్షోభ ఇతరులకి రసగుళికల్లాగున్నాయా? ఏ జీవితం అయితే తనకు వ్యధాభరిత మయిందో, అదే జీవితాన్ని ముక్కలు ముక్కలు చేసి కాగితంమీద పెడితే తిరిగి జీవితం ఆకర్షణగా, అర్థవంతగా కనిపిస్తున్నదేం?

"చూశారా? మీరు రచయిత్రి అని నేను చెప్పాను. ఇంకా బాగా రాస్తారు. రాస్తూ వుండండి" అని శంకరనారాయణ అన్నప్పుడు తన సందేహాన్ని వ్యక్తం చేసింది చంద్రమ.

"అయితే అది మీ జీవితమా?" అని ఆశ్చర్యపోయాడాయన మొదట్లో.తర్వాత ఆలోచనగా అన్నాడు "అనుభూతిలేని రచనలో జీవం వుండదు. ఉన్నా స్పష్టంగా ఇతరులను ప్రభావితం చేసేటంతగా వుండదు. అందుకే రచయితకు అనుభవం, అనుభూతులను పొందగలిగే హృదయం అవసరం—"

"అంటే రచయితలు ప్రతిదీ అనుభ వించి రాయాలంటారా?"

"కాదు. స్వీయ అనుభవాలు, అనుభూతులే కానక్కరలేదు. ఇతరుల అనుభవాలని, అనుభూతుల్ని స్వీకరించి తన స్వంతం చేసుకొనే హృదయం వుంటే చాలు. అంతేకాదు, అనుభూతులు ఆలోచ నాత్మకంగా కూడా వుంటాయి.ఆలోచనల్లో నుంచి, జిజ్ఞాసలో నుంచి మనసు పొందే అనుభవం మహత్తరమైనది. ఉన్నత శ్రేణికి చెందినటువంటిది. అలా పొంద గలిగినవాళ్ళు క్రాంత దర్శకులు. ఉత్తమ సాహిత్యాన్ని వాళ్ళే సృష్టించగలుగు తారు."

"మరి నా రచనలు..."

"మీరే చెప్పారుగా? మీ రచనలు స్వీయ అనుభవాలు. చెప్పగలిగిన నేర్పు వుండటం వల్ల మీ రచనలు ఆకర్షిస్తు న్నాయి జనాన్ని. రెండు, మూడు దశ లను అందుకోవాలంటే అప్పుడే సాధ్యమా? రాస్తుండండి"

రచన మంచి కాలక్షేపమే కాదు. అందులో చంద్రమకు అనేక లాభాలు కని పించాయి. ఆత్మానందం-డబ్బు-పేరు-గౌరవం - తృప్తి...

అయిదేళ్ళలో ఆమె రచయిత్రిగా గొప్ప పేరు పొందింది. స్త్రీ సమస్యలను అత్యంత ప్రతిభావంతంగా, సునిశితంగా దర్పణం పట్టే రచయిత్రిగా ఆమెకు ముద్ర పడిపోయింది - విమర్శకుల చేతుల్లో.

నవలలకు ఎన్నో బహుమతులు ... సన్మానాలకు పిలుపులు...

ఈలోగా కొత్త అనుభవాలు. అన సూయమ్మ చనిపోయింది. మాధవరావు కొడుకులు, కూతుళ్ళు అందరికీ ఉత్త రాలు రాసి 'మహాప్రస్థానాన్ని' వెతు క్కుంటూ పోయాడు.

స్వతంత్ర భానుడు సంసారాన్ని ఓ ఒడ్డుకు యీడుకొనిపోయాడు. చెల్లెలికి పెళ్ళి చేశాడు - యీడు వచ్చి రాక మునుపే.

"అక్కల అనుభవం దానికి వద్దు. అందరు ఆడ పిల్లల్లాగా దానికైనా, సహ జంగా సామాన్యంగా బతికే ఏర్పాటు

చేసాను" అన్నాడు. తమ్ముళ్ళు ఇద్దరిలో ఒకడికి చదువుఅంతగా రాలేదు. గుమాస్తా ఉద్యోగంలో చేరిపోయాడు. ఇంకోడు చదువులో ఎక్కొస్తున్నాడు.

రుద్రమ ఇంటి నుంచి వచ్చిన కొత్తల్లోనే కేశవరావు రెండోసారి హార్ట్ స్ట్రోక్ వచ్చి చచ్చిపోయాడు. మంచంలో తీసుకొని తీసుకొని సరస్వతమ్మ ప్రత్యక్ష నరకాన్ని అనుభవించి ఈ మధ్యే చనిపోయింది. రవీంద్ర తాగి తాగి, తిరిగి తిరిగి ఆరోగ్యాన్ని చెడగొట్టుకొన్నాడు. ఉద్యోగ ధర్మాన్ని సరిగా నిర్వర్తించటం లేదన్న నేరంపై అతడిని సస్పెండు చేశారు. కోర్టుకు వెళ్ళాడు. కోర్టులో అతని కేసు కొట్టివేశారు. ఆ దిగుళ్ళతో అతనూ ఈ మధ్యే గుండె ఆగి చనిపోయాడు. శారద పిల్లలిద్దర్నీ తీసుకొని పుట్టిల్లు చేరుకొందిట.

శారద పాత్రగా ఓ నవల రాస్తే కాని ఆత్మశాంతించ లేదు రుద్రమకు.

శ్రద్ధగా పెంచే తోటమాలి చేతిలోని అందమైన వుద్యానవనంలా కమల పెరుగుతోంది. అప్పుడప్పుడూ రామ్ మోహన్, ప్రతాపరుద్రుడు వచ్చి ఇరువురి యోగ క్షేమాలు విచారించి పోతున్నారు.

కొన్నాళ్ళ క్రితం ఓ రాత్రి ఒక మధ్య వయస్కురాలు వచ్చి రుద్రమ ఇంటి తలుపు తట్టింది. ఆ రాత్రికి ఆశ్రయమడిగింది. ఆమె పేరు పైడమ్మ.

ఆశ్రయమివ్వటానికి భయపడింది రుద్రమ. జాలి గొలిపే మాటల్తో మెల్లగా చేరి మోసగత్తె ఘాతుకాలు జరుపుతున్న సంఘటన లెన్ని? ఏమో! ఏ వ్యక్తి ఎలాంటిదో? పైగా తను ఒంటరి?

జాలిగా ప్రాధేయపడింది పైడమ్మ. చివరికి ఆ రాత్రికి ఆశ్రయమిచ్చింది.

పైడమ్మది అక్కడికి దగ్గరలో వున్న ఒక పల్లెటూరు. కటిక బీదరాలు. భర్త కూలి పని చేసేవాడు. పైడమ్మ కూడా కాయ కష్టం చేసేది. వాళ్ళకి ఒక్కడే కొడుకు. వాడిని చదివించి గొప్పవాడిని చేయాలని ఆ భార్యా భర్తలకు ఆశ.

భర్త అకస్మాత్తుగా ఏదో ప్రమాదంలో చనిపోయాడు. అంతవరకు కన్నెత్తి చూడని వూళ్ళో భూస్వాములు భర్త పోయాక పైడమ్మ మీద కన్ను వేశారు. పనికి వెళ్తే వెకిలి వేషాలు వేసే వారే అంతా.

కొడుకుకు అన్నం పెట్టి, బట్టలిచ్చి చదువు చెప్పించే సంస్థ ఏదో పట్నంలో వుందని తెలుసుకొని విచారించటానికి వచ్చింది. అలాంటిదేదైనా వుంటే ఇక్కడే తనూ కాయ కష్టం చేసుకొని బతుకుతూ కొడుకుని పెద్ద చేయాలని ఆమె ఉద్దేశ్యం. కానీ ఇక్కడికి వచ్చిన దగ్గర్నుంచి రిక్షాల వాళ్ళ నుంచి ప్రతి వాళ్ళు ఆమెను అదో విధంగా చూస్తున్నారు. రాత్రి అయింది. వెధవ జనం వెంటబడ్డారు. అసలు వచ్చిన విషయం తెలియటేదు. ఎవరిని నమ్మటానికి వీల్లేకుండా వుంది.

పైడమ్మ చెప్పిన కథను వింది రుద్రమ. కానీ నమ్మలేదు. ఆ రాత్రి నిద్రపోలేదామె. నిద్ర పోతున్నట్లు నటిస్తూ పంచలో పడుకొన్న పైడమ్మను కనిపెట్టే వుంది.

పగలంతా తిరిగిందేమో పడుకోవటం పడుకోవటం పైడమ్మ లేవనేలేదు. పొద్దున్నే రుద్రమకు కృతజ్ఞతలు చెప్పి వెళ్ళిపోవటానికి సన్నద్ధమైంది.

అప్పుడు ఆమె పైన నిజంగా జాలి వేసింది రుద్రమకు.

"చూశావా పైడమ్మా. ఒక్కనలుసు విషపు బిందువు కడివెడు క్షీరాన్ని కలుషితం చేస్తుంది. ఎవరో కొందరు చేసిన మోసపు పనులవల్ల ప్రతి మనిషిని అనుమానించాల్సిన అవసరం ఏర్పడుతోంది. మనిషిని మనిషి ప్రతి దానికి ఇలా అనుమానించుకోవాల్సిన పరిస్థితి రావడం ఎంత దురదృష్టం. నీకెవ్వరూ లేరు అన్నావు కదా? ఈ ఇంటిలో వుండు. ఆ పిల్ల తప్ప నాకూ ఎవరూ లేరు ప్రస్తుతం. ఈ ఇల్లును, ఆ పిల్లను నేను కాలేజీకి పోయినపుడు కనిపెట్టి వుండు. నీ కొడుకు చదువు విషయంలో తతిమ్మా ఏర్పాట్లు నేను చేస్తాను"

అప్పటి నుంచీ పైడమ్మ రుద్రమ యింట్లోనే వుంటోంది. ఆమె కొడుకు సింహాద్రి విషయంలో తగు ఏర్పాట్లు అన్నీ రుద్రమే చేసింది. హాస్టల్లో చేర్చింది. బళ్లో చేర్చింది. వాడు చదువుకొంటున్నాడు. వారానికి ఒకసారో రెండు సార్లో వచ్చి తల్లిని చూసి పోతుంటాడు.

వాడిని చూసినప్పుడల్లా చలం గుర్తుకొస్తాడు రుద్రమకు. మట్టిలో పుట్టిన వాడు సింహాద్రి. అయినా ఎంత నెమ్మది? ఎంతటి తెలివితేటలు? పైకి వస్తున్నాడు. అన్నీ వున్నయింట పుట్టేడు తన కొడుకు. తల్లిదండ్రులిద్దరూ చదువుకొన్నవారే. అయినా వాడెందుకలా అయ్యాడు?

పైడమ్మ చాలా మంచిది. ఎంత పని చెయ్యటానికీ వెనకాడదు. ఆమె యింటికొచ్చిన దగ్గర నుంచీ రుద్రమ్మకు శారీరక సుఖంతోపాటు తన బాధను చెప్పుకోటానికి, కాగితం కలంతో పాటు, మరో వ్యక్తి చిక్కింది. మనసుకు ఊరట!

"తల్చుకొని దిగులు పడేదాని కన్నా వోపాలి ఎల్లి చూసి రాకూడదండమ్మా? కడుపు తీపి కాదనుకొంటే పోతుందా? కట్టుకొన్న బంధం తెంచుకొందా మంచే తెగిపోతుందా?"

రుద్రమకు పైడమ్మ సలహా నచ్చింది. దాదాపు ఆరు సంవత్సరాల తర్వాత హైదరాబాద్ బయలు దేరింది.

ఇంటిలో మార్పు లేదు. కాకపోతే వెల్ల కూడా లేక మాసిపోయి పాతపడినట్లుంది. యింట్లో ఎవరో అద్దెకుంటున్నట్లున్నారు. వాకిలి ముందు మూడు బోర్డులు అలాగే వున్నాయి. వాటికి తోడు నాలుగోది కూడా చేరింది. అద్దెకున్న వారిది కాబోలు!"

"ఎవరండీ? ఎవరు కావాలి?"

తన యింట్లో తనకు వేసిన ప్రశ్న. భర్తను గురించి వాకబు చేసింది.

"అదిగో ఆ పక్కనున్న రెండు గదులు అట్టే పెట్టుకొన్నారు. మిగతాది మాకు అద్దెకిచ్చారు."

ఆ గదులు తలుపు లేసే వున్నాయి.

"ఎక్కడికెళ్లేడో ఆయనగారు? ఎవరు చెప్పగలరు? ఎప్పుడొస్తాడో మాకేం తెలుస్తుంది?" అని విసుక్కొంది ఆమె. అంతలోనే "యిక యిళ్ళకొచ్చ్కాడా యిలా మనుష్యులు వస్తుంటే యీ ఇంట్లో కాపురం చేసినట్లే మేము?" అంది.

రుద్రమకు అర్థమయింది. ఆమె తనను చక్రవర్తి కోసం వచ్చిన పరాయి మనిషి అనుకొంటోంది. అందులో ఆమె తప్పేముంది?

రుద్రమ తనెవరో చెప్పింది. ఆ యింటి ఆమె మొహం చాటంత అయింది.

"చంద్రమదేవి గారు మీరేనా? మీ రచనలు అంటే నాకు ప్రాణం అనుకోండి. ఎన్ని సార్లు చదివేనో? యివిగో..." అంటూ ఓ షెల్ఫు చూపింది.

ఆ తర్వాత ఆమె చేసిన మర్యాద అంతా యింతా కాదు.

"ఈ యింటి యజమాని భార్య నా అభిమాన రచయిత్రి అని ఎవరో చెప్పగా విన్నాను. యిన్నాళ్లకు మిమ్మల్ని చూశాను. నా జన్మ ధన్యమయిందండీ. మీ రచనల్లో మీ జీవితం కన్పిస్తుందండీ. కాని అందరి స్త్రీలు తమ తమ జీవితాల్ని చూసుకోవచ్చు కూడా. అంత బాగా రాస్తారు. అదే మీ గొప్పతనం."

నిజ జీవితాన్ని చూసుకొని ఏడవాలో, రచయిత్రి జీవితాన్ని తల్చుకొని ఆనందించాలో తెలియని స్థితి!

"ఉద్యోగం చేస్తున్నారుగా? యిక్కడికి బదిలీ అయిందా?"

"లేదు"

"మీ వారు రమ్మన్నారా? అన్నానని కోపగించుకోకండి. కానీ... మీ నవలల్లో పురుష పాత్రల్ని చదువుతుంటే మీ వారు గుర్తుకొస్తారండీ!" అలాంటి మగవాళ్లతో కాపురం చేయడం కష్టమే. ఎన్ని దురలవాట్లో? పాపం మనిషి మంచివాడే కానీ దురలవాట్లు మంచివి కావుగా? కాపురం చేయటం కష్టమే సుమండీ... అన్నట్లు మీరు మా క్లబ్బులో వుపన్యసించాలి. ఎప్పుడు ఫిక్స్ చేయమంటారు?"

"క్షమించండి. నాకు వుపన్యాసాలిచ్చే అలవాటు లేదు. అంత సామర్థ్యమూ లేదు. నా జీవితాన్నే నేను చక్కదిద్దుకోలేని దాన్ని. ఒకరికేం చెప్పగలను?"

"అదేమిటండీ! - అంత పెద్ద రచయిత్రి అయివుండి..."

"రచయిత్రిగా నన్ను కాస్సేపు మర్చిపోండి. నేను యిపుడు నా భర్తను, పిల్లవాడిని చూసుకోటానికి వచ్చాను. మా చలం బాగున్నాడా? ఏం చదువుతున్నాడు?"

అకస్మాత్తుగా ఆమె మొహంలో రంగులు మారాయి. ప్రసన్నత స్థానంలో నిరాదరణ, భయం చోటు చేసుకొంది.

"అయితే మీ కొడుకు సంగతి మీకేం తెలీదా?"

"అంటే...?"

"అయితే మీరు మొగుడిని వదిలి లేచిపోయారన్న మాట నిజమే నన్నమాట! ఇన్నాళ్లకు కొడుకు కావల్సి వచ్చాడా?" ఇపుడామె మాట్లాడుతున్నది అభిమాన రచయిత్రితో కాదు. సాటి స్త్రీతో.

"మీరన్నట్లు స్వంత జీవితాన్ని చక్కదిద్దుకోలేని అమ్మ, రచనలు చేసి దేశాన్ని ఏం వుద్ధరిస్తుందిలేండి! పాతకులం - మధ్యలో మేము మూర్ఖులం"

"ఇంతకీ మా చలానికి ఏమయింది?"

"ఏమో? మేము యీ ఇంటికి కొత్తగా వచ్చాము. మీ భర్త వస్తారుగా? అడగండి. ఆయన చెప్తేనే బాగుంటుంది"

చక్రవర్తి ఎపుడో అర్ధరాత్రికి వచ్చాడు. అంతవరకు కన్నుల్లో ప్రాణాన్ని పెట్టుకొని అతని కోసం ఎదురు చూసింది.

అసలే సన్నబారు మనిషి. ఇంకా చిక్కిపోయాడు. కళ్ళు గుంటలు పడ్డాయి. గుంటల్లో తారు పూసినట్లు నల్లటి పొర!

"ఎవరది?" లైటు వేసి ఆ వెలుగులో వాకిట్లో నిలబడ్డ చంద్రమను గమనించి

ముద్దగా ప్రశ్నించాడు. రుద్రమ లోప లికి ప్రవేశించింది.

"ఓ! తమరా ? పతివ్రతగారా ?"

ఆరేళ్ళ తర్వాత వచ్చిన భార్యను ఆహ్వానించాల్సిన పద్ధతి అదేనా ? అయినా రుద్రమ స్వభావ సిద్ధమైన గుణాలను కూడగట్టి తెచ్చుకొందాయె! అంచేత బాధపడలేదు. చలించలేదు.

"చాలా గొప్ప పతివ్రతవి! నీ ముందు సీత, అనసూయ, అహల్య...వాళ్ళమ్మలు ఎవరూ పనికి రారు. వాళ్ళెవరూ నీ లాగా రచయిత్రులు కారుగా? నువ్వు రచయిత్రివి అయితివి! మొగుడ్ని పుస్తకాలలోకి ఎక్కించి ఏం పూజిస్తున్నావ్ ?" అలా ఎన్నెన్నో విధాల పొడిచాడు అతను. ఆ తర్వాత డైరెక్టుగా నిందించాడు. చివరికి నోరు నొప్పి పుట్టి విసురుగా అన్నాడు. "లేచిపోయిన ముండ ఇప్పుడు రావటానికి కారణమేమిటో ?"

భార్య అంటే ఎందుకీ మనిషింతకి తుస్కారం ? తనేం తప్పు చేసింది ? ఎందర్నో కాదని చివరికి కట్నం తీసుకోని ఆదర్శ పురుషుడు అనుకొని భ్రమపడి అతనికి భార్య కావటమే తన తప్పా ? పైకి అనలేదు ఈ ఆలోచనని

"నా భర్తను, బిడ్డను చూసుకోవాలని వచ్చాను. నా ఇంటికి నేను వచ్చాను."

"భర్త-బిడ్డ! ఆరేళ్ళక్రితం వెళ్ళే టప్పుడు అక్కరలేని భర్త, బిడ్డ ఇప్పుడు కావల్సి వచ్చారా?"

రుద్రమ భర్త చేతుల్ని పట్టుకొంది.

"నేనంటే ఎందుకండీ అంత కోపం? నేనేం తప్పుచేశాను? మీరెన్ని అన్నా సహించానా? నా బిడ్డ నా ఎదుట చెడిపో తుంటే చూసి ఎలా సహించగలను ? చూడలేక పారిపోయాను. అది నా తప్పే. క్షమించండి. ఇప్పుడొచ్చాగా ? చలం ఎక్కడున్నాడు ? ఏం చేస్తున్నాడు ? చెప్పండి..."

చక్రవర్తి కొంచెం తగ్గాడు. భార్య చేతుల్ని విదిలించి కొట్టలేదు.

"ఇక్కడి నుంచి వెళ్ళిపోయి వాడిని బాగుచేద్దామనుకొన్నావుగా? వాడు బాగు పడ్డాడు. చాలా బాగుపడ్డాడు. నాకన్నా చాలా బాగుపడ్డాడు. చాలా...చాలా... చాలా బాగుపడ్డాడు" ఆవేదనతో అన్నాడు అతను. రుద్రమ భయం పెరిగింది.

"ఏమైందండీ ! వాడెక్కడున్నాడు ఇప్పుడు?"

"నాకు తెలియదు. వాడి విషయం నాకు గుర్తు చేయవద్దు..." బాధగా అన్నాడు. బాధను మర్చిపోవటానికేమో దిండు కిందనుండి బాటిల్ తీశాడు.

"వద్దండీ...తాగకండి. మీ ఆరోగ్యం ఎంత చెడిపోయిందో..."

అతను ఆమెవైపు ఓసారి జాలిగా చూశాడు. ఆ తర్వాత బాటిల్ తెరిచి ఖాళీ చేశాడు. అంతే! కాస్సేపు తళుక్కుమన్న సాత్విక ప్రవృత్తి చచ్చిపోయింది. తిరిగి ఏదో ఏదో వాగాడు. చివరికి "నేను బాగా అలసిపోయాను. నిద్రపోవాలి. నువ్వు వచ్చిన పని అయిపోయిందిగా?"

వెళ్ళమని ధ్వని. రుద్రమ గుండె గుభేలుమంది.

"భర్తను వదిలిపోయిన భార్యకు ఎంత గౌరవమో, భార్యను వదిలేసిన భర్తకూ అంతే గౌరవమండీ. ఎందుకు మనమధ్య అనవసరపు గొడవ? మీకు అభ్యంతరం లేకపోతే..."

"నాకు అన్నీ అభ్యంతరాలే. నువ్వు నాకు వద్దు. నా జీవితం ఇలా గడిచిపోనీ. నువ్వు వెళ్ళు వెంటనే..."

ఆమె మళ్ళీ ఏదో మాట్లాడబోయింది. అతని కళ్ళు ఎర్రబడ్డాయి. ఆమెను రెక్క బట్టుకొని కొంత దూరం తీసుకొచ్చి బయటికి నెట్టాడు నిదానంగా.

తలుపులు మూతబడ్డాయి. లోపల నిశ్శబ్దం. ఆమె గుండె లోపల అగ్ని గోళాలు...లావాలు...ఇంకా ఏవేవో... మండిమండి ఆరిపోయాయి.

తను ఏమాశించి ఇక్కడికొచ్చినట్లు? ఏమి సాధించినట్లు?

ఆత్మాభిమానాన్ని ఇంతగా ఎలా చంపుకోగలిగింది?

సంసారం కోసం ఇంత తాపత్రయ మున్న మనిషి ఆనాడు ఎందుకు వెళ్ళి నట్లు? ఇన్నాళ్ళ తర్వాత మళ్ళీ...ఎందుకీ బలహీనత ఆవరించింది? భర్త గుణం తెలిసి తను ఎందుకిలా భ్రమపడింది?

కొడుకుకోసం. కడుపు తీపి చంపుకో లేక...

ఆ కొడుకు లేడు. వాడి సంగతి వాడి తండ్రికే తెలియదు.

ఇక తనెందుకుండాలిక్కడ?

ఆమె బయటికొచ్చింది. చలి, చీకటి. నిర్జనమైన వీధులు...ఒంటరిగా తను! ! కిందినుంచి పైదాకా శరీరంలో విద్యుత్తులా భీతి ఓ క్షణం ప్రవహించింది.

ఎక్కడికెళ్ళాలి? ఎలా వెళ్ళాలి?

ఇంట్లోనే వున్న అభిమానురాలి తలుపు తడితే? ఇలాంటి సంఘటనలను నవలలో చదివి కన్నీరు కారుస్తారు. థ్రిల్ ఫీలవు తారు. కానీ ఓ ఆడకూతురి నిజ జీవితంలో జరిగితే ఆదరిస్తారా?

ముందుకు అడుగులు వేస్తోంది ఆమె. కానీ సందేహం, భయం, అనుమానం ఆమె గుండెల్లో ఎక్కి వెనక్కి లాగు తున్నాయి. స్పర్థ!

పట్నం వీధుల్లో అర్థరాత్రిపూట ఓ ఆడది?

ఏం? మగాడు తిరగటల్లే. టాక్సీనో, రిక్షానో చేసుకొని స్టేషనుకు వెళ్ళ వచ్చుగా?

అమ్మో ఒంటరిగా? రిక్షావాడో, టాక్సీ వాడో ఏమన్నా చేస్తే?

మరి ఆ చేసేదేదో మగాడిని కూడా చేయొచ్చుగా? కానీ మగాడు భయపడడేం?

కానీ నేను ఆడదాన్ని. నా దగ్గర వున్న ధనాన్ని అపహరించి వూరుకోడు పురుషుడు. నా స్త్రీత్వాన్ని అపహరిస్తాడు. రిక్షావాళ్ళు, టాక్సీవాళ్ళు, అర్థరాత్రిపూట బజార్లు తిరిగేవాళ్ళు అందరూ కూడా మగవాళ్ళేగా? స్త్రీలు వుండరే?

సో...స్త్రీ శారీరకంగా బలహీనమైనది. 'బయాలాజికల్'గా ఆమె శరీర స్వభావం లోనే బలహీనత వుంది. అవునా?

మెయిన్ రోడ్డుమీదకొచ్చింది ఆమె. అక్కడేదో కొట్టు. లోపల లైటు. ఆమెకు విష్ణువర్ధనుడు గుర్తుకొచ్చాడు. అతని ఇంటి ఫోను నెంబరుంది. పోనీ ఫోను చేస్తే?

ఫోను చేయటానికి లోపలికెళ్ళగానే ఆ కొట్టువాడు ఏమన్నా చేస్తే?

అదిగో ఆటోరిక్షా. పోనీ అందులో ఎక్కితే?

ఆటోరిక్షాలో ఒంటరిగా? ఇంకేమైనా వుందా?

ఇలాంటి ప్రశ్నలన్నీ స్త్రీకే ఎందుకు రావాలి? ఎంత చదువుకొన్నా, ఎంత గొప్ప అధికారంలో వున్నా, పేరు ప్రఖ్యాతులున్నా....ఈ సందేహాలు, అనుమానాలు తప్పవా?

ఆమె చివరికి తెగించింది. ఆటోను

పిలిచి ఎక్కింది.

భయపడ్డట్లేం జరగలేదు. విష్ణువర్ధనుడి ఇంటికి క్షేమంగా చేరింది. సగం భయ సందేహాలవల్లే స్త్రీ స్వాంఘికంగా ఎదగటం లేదేమో?

"నీ భర్త విషయం తెలుసుకొంటూనే వున్నా. అతను స్వభావసిద్ధంగా అంత చెడ్డవాడేం కాదు. కానీ అన్ని వ్యసనాలకు బానిస. ఇక అతను బాగుపడడు. వ్యసనాలు బాగుపడనివ్వవు—"

"నా కొడుకు చలం. ఇంత దూరం వచ్చి వాడిని చూడకుండా వెళ్ళిపోతున్నాను. వాడెక్కడుందీ, ఏం చేస్తున్నదీ కూడా తెలవలేదు. నా బాధ ఎవరికి చెప్పుకోను. అందుకోసం మీ దగ్గరికొచ్చా. సహాయం చేయరూ?" రుద్రమ భోరున ఏడ్చింది. విష్ణువర్ధనుడి భార్య ఆమెను ఓదార్చింది.

"వాకబుచేసి చెప్తాను. కొంచెంసేపు విశ్రాంతి తీసుకో!"

విష్ణువర్ధనుడి భార్యను ఇబ్బంది పెట్టటం ఇష్టంలేక కళ్ళు మూసుకొని నిద్రపోతున్నట్లు నటించింది రుద్రమ కాసేపు. కానీ నిద్రపడుతుందా?

తెలతెలవారుతుండగా విష్ణువర్ధనుడు ఆమెవద్దకొచ్చాడు. అంతసేపు అతను ఫోనువద్దేవున్నాడు. అతనిరాకసుగమనించి ఛటుక్కున లేచి కూర్చుంది.

"నిజం చెప్పి నిన్ను బాధపెట్టక తప్పదు రుద్రమదేవీ. కానీ జీవితంలో ఇలాంటి 'ఛాలెంజస్' తప్పవేమో. విధి, అదృష్టం అన్న పదాలను అందుకే 'ఖాయం' చేశారేమో పెద్దలు. నీ కొడుకు తండ్రి అడుగుజాడల్లో నడిచాడు కొంత కాలం. ఇప్పుడు తండ్రిని మించి ఎదిగాడు. పోలీసుల రిజిస్టర్‌కు కూడా ఎక్కాడు. ఇంతకన్నా వివరాలు ఎందుకు?"

అతను భయపడ్డట్టు ఆమె ఏడవలేదు.

"దురదృష్టవంతుల్ని ఏ దేముడూ బాగుచేయలేడేమో!" అంది నిదానంగా.




"అమ్మా నేను స్కూలు కెళుతున్నా. సాయంకాలం సంగీత పోటీలున్నాయి. వచ్చేసరికి కాస్త ఆలస్యమవుతుంది నువ్వు ఖంగారు పడిపోకు. ఊ?"

"అలాగే కానీ జాగ్రత్త. లేకపోతే పైడమ్మను పంపనా?"

"పిచ్చి అమ్మా నేనింకా చిన్నపిల్లను కాదు. టెంత్ చదువుతున్నాను. మరీ గారాబం చేసి పిరికిదాన్ని చేయకు"

ఉలిక్కిపడింది రుద్రమ!

అవును. కమల చిన్నపిల్ల కాదు. పెద్ద మనిషయింది. ఎదిగింది. శరీరం, అందం, మనసు, బుద్ధి అన్నీ ఆరోగ్యంగా ఎదిగాయి. విత్తు విత్తకపోయినా, మొలకెత్తే కాలంలో లేకపోయినా, చిన్న మొలక అయిన దగ్గరనుంచి చీడపీడలకు దూరంగా ఆరోగ్యంగా తోటను పెంచిన మాలిలా తృప్తిగా వెళుతున్న కమలవైపు అదేపనిగా చూసింది.

ఎంతలో ఎంతగా ఎదిగింది పిల్ల? అప్పుడే ఇన్ని సంవత్సరాలు గడిచిపోయాయా? చేస్తున్న పూజపైన మనసు

లగ్నం కాలేదు.

ఆ రోజు

రైలు దిగి ఇంటికి రాగానే పైడమ్మ ప్రశ్నించింది.

"అబ్బాయిగారు బాగున్నారా? అమ్మా"

"చనిపోయాడు" అంతమాట ఎలా అనగలిగిందో రుద్రమకే తెలియదు. చిత్రమేమంటే అలా అన్న తర్వాత గుండెల్లో నివురు కింద నిప్పులా గుప్తంగా వున్న మంట చప్పగా చల్లారిపోయింది!

పైడమ్మ జాలిపడింది. కన్నీళ్ళు కార్చింది. రుద్రమకు ఊరడింపుమాటలు చెప్పింది. కానీ వీటన్నిటికీ అతీతమైనస్థితి రుద్రమదప్పుడు!

ఆ స్థితిలోనే ఆమె తన అనుభవాన్ని, ఆలోచనలను రంగరించి ఒక నవల రాసింది. రాశాక పత్రికకు పంపేముందు ఒకసారి చదువుకొని ఆశ్చర్యపోయింది. ఇది తను రాసిన నవలేనా? నిజంగా ఇన్ని భావాలు...ఆలోచనలు.. తనకున్నాయా? తనుకాక, ఏదో అజ్ఞాత శక్తి తనచేత ఆ నవలను రాయించినట్లనిపించింది ఆమెకు!

"మాస్టారూ మనిషి జీవితానికి పరమార్థం ఏమిటి?" అకస్మాత్తుగా అనుకోకుండా ఓ రోజు శంకరనారాయణను ప్రశ్నించింది. ఆయన ఆ మధ్య బదిలీ అయిపోయి రిటైర్‌మెంటుకు ముందు తిరిగి ఇక్కడికొచ్చాడు. రిటైరయ్యాక ఆ ఊళ్ళో స్థిరపడిపోవటానికి నిశ్చయించుకొన్నాడు. ఆయన ఇంటికి తరచూ వెళ్ళటం సాహిత్య చర్చలు చేయటం రుద్రమకు మామూలే

నవల ప్రచురణ అయింది. ప్రజాదరణను పొందింది. స్త్రీ సమస్యలకు అద్దం పట్టే రచయిత్రి ఆధ్యాత్మిక దృక్పథంతో నవల రాసినందుకు కొందరు విమర్శించారు. ఆమె 'రీ యాక్షనరీ'గా మారిపోతున్నదని గోలపెట్టేరు.

"ఇదొక కొత్త విమర్శక జాతి. వీరి ప్రపంచం అతి చిన్నది. ఆ చిన్న ప్రపంచంలో నుంచి వీరు అన్నిటినీ చూస్తారు. వీరి దృష్టి తమకు తెల్సిన ఆ ప్రపంచ స్థాయినుంచి ఎదగదు. ఎవరన్నా అలా ఎదిగితే ఇలాగే గోల చేస్తారు. దృష్టి దోషమున్న ఇలాంటి విమర్శకులమాటలు పట్టించుకోనక్కర్లేదు" సువర్చల అంది రుద్రమతో.

"మీ అనుభవాలను కథలుగా చెప్పే స్థాయినుంచి మీకే గోచరం కాని అలౌకిక అనుభూతులను సార్వజనీనంగా రసస్ఫూర్తంగా చెప్పే స్థాయికి ఎదిగేరు. మీ బుద్ధి వికాసానికి, ఉన్నతస్థాయి మనోస్థితికి ఈ నవల గొప్ప తార్కాణం" శంకరనారాయణ అన్నారు.

రుద్రమదేవి రాయటం తగ్గించి అధ్యయనం ఎక్కువ చేయసాగింది.

ఆ తర్వాత కొన్నాళ్ళకు శంకరనారాయణ రిటైరయ్యాడు. ఆ ఊళ్ళోనే ఇల్లు కట్టుకొని స్థిరపడ్డాడు.

మరి కొన్నాళ్ళకు డాక్టర్ రామ్మోహన్ కూడా రిటైరయ్యాడు. ప్రతాపరుద్రుడు ఐయ్యేయస్ ఆఫీసరయ్యాడు. కొడుకు దగ్గర వుంటున్నాడు. అలాగే రుద్రమకు తెల్సిన కొందరు వ్యక్తులు జీవితం నుంచే రిటైరయి పోయారు.

రుద్రమకు చత్వారం కళ్ళజోడు వచ్చింది. తలలో వెంట్రుకలు చాలా భాగం తెల్లబడ్డాయి. పైడమ్మ పెద్దదయింది. అయినా ఇంటి పనులన్నీ ఆమే. సింహాద్రి 'లా' చదివేడు. ఆ



వూళ్ళోనే ప్రాక్టీసు పెట్టాడు.

"ఎలా వుంది సింహాద్రీ - కొత్త జీవితం ?"

"ఆ కొత్త పద్ధతుల పద్మవ్యూహంలో నేను దూరగలనా అని భయమేస్తోంది అమ్మగారూ"

కొడుకు లాయర్ అయినా పైడమ్మ రుద్రమను వదలటానికి అంగీకరించలేదు.

"వాడి బ్రతుకు వాడు బ్రతుకుతాడు అమ్మాగారూ. మీకు నేను-నాకు మీరు తోడు. నన్ను పంపించెయ్యకండి

కమలను చూడటానికి ఎన్నోసార్లు వచ్చాడు రామ్‌మోహన్. ప్రతాప రుద్రుడూ వచ్చాడు. కమల కాస్త పెద్ద దయ్యాక వాళ్ళెవరో కూడా చెప్పింది రుద్రమ. రామ్‌మోహన్‌ని 'నాన్నా' అనే పిలుస్తుంది. అన్నను సరేసరి. రుద్రమను 'అమ్మ' అనే పిలుస్తుంది.

ఏనాడూ రామ్‌మోహన్ కూతుర్ని తనతో తీసుకుపోతానన లేదు. రుద్రమే ఒకటి రెండు సార్లు ఆ ప్రస్తావన తెచ్చింది.

"కోడలవు తుందనుకొన్నాం. కూతు రయింది. నీ దగ్గర వున్నా, నా దగ్గర వున్నా ఒకటేనమ్మా. మళ్ళీ ఎందుకు నాకు అక్కర్లేదనుకొన్న సంకెళ్ళను తగిలి సావ్. పెళ్ళయ్యాక ఎలాగూ అత్తింటికి పోయే పిల్లేగా? అంత వరకూ నీ దగ్గరే పెరగనియ్—"

కమల పెరిగింది. పెద్దదయింది. టెంత్‌లోకి వచ్చింది! స్కూల్లో అన్నిటి లోనూ ఫస్టే!

వసుతః పెద్ద రూపవతేం కాదు. కాని ఆమె శరీరం, బుద్ధి, ఆరోగ్యంగా పెరి గాయి. రుద్రమ అభిరుచులకు, ఆశయా లకు ఆమె ప్రతీక. ఆమెలో వున్న మంచి గుణాలన్నిటినీ, లేని కొన్ని అవసర గుణాల్ని ఆమె పుణికి పుచ్చుకొంది.

కమలను గురించిన తలంపే రుద్రమకు అనిర్వచనీయమైన ఆనందాన్ని, తృప్తిని ఇస్తుంది. లౌకికాతీతమైన అనుభూతి కలుగుతుంది.

ఇప్పుడు అదే స్థితిలో ఉండగా సింహాద్రి వచ్చాడు. కోర్టు సమయమది. సాధారణంగా ఆ వేళప్పుడు రాడు.

"న్యాయం న్యాయం అంటాం కాని ఎక్కడుందమ్మా న్యాయం? కోర్టులు, కోర్టు ప్రొసీజర్‌లు డబ్బున్న వాళ్ళకు సహాయం చేయటానికి సృష్టించ బడ్డాయా అనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు. చట్టాలను చుట్టూ తిరిగి ఎలా అతిక్రమించాలో, అన్యాయాన్ని, అధర్మాన్ని, న్యాయంగా, ధర్మంగా, ఎలా నిరూపించాలో న్యాయ వాదులు, న్యాయమూర్తులే ప్రజలకు ప్రతి నిమిషం తమ వాదనల ద్వారా, నిర్ణయాల ద్వారా తెలియ చెప్తున్నారు" అంటూ ఆవేదనతో అప్పుడే జడ్జిమెంటు అయిన ఓ కేసును వివరించాడు.

మట్టిలో పుట్టిన సింహాద్రి! ఎక్కడ నుంచి వచ్చిందతనికి ఇంత ధర్మనిష్ట? నిజాయితీ?

"ఈ దేశం బాగుపడదండమ్మాగారూ. ముందు ఈ కోర్టులను సంస్కరిస్తే తప్ప నైతికస్థాయి జనంలో పెరగదు. 'సర్ప యాగంలా ఏదన్నా ఓ యాగం చేస్తే కాని అది సాధ్యం కాదేమోనని అని పిస్తోంది"

సింహాద్రి-కమల!

ఈడూ జోడూ-! పెళ్ళి చేస్తే?

కానీ సాంఘిక ఆర్థిక వ్యత్యాసాలు చాలా పెద్దవే! సాధ్యమా?

కమలకు అంగీకారమైతే అది అసాధ్య మెలా అవుతుంది?

మొట్ట మొదటి సారిగా ఆరోజు ఆ ఆలోచన వచ్చింది. సింహాద్రి వెళ్ళి పోయినా ఆ ఆలోచన వదలలేదు ఆమెను.

"రుద్రమ దేవిగారి ఇల్లు ఇదేనా?" ఎవరో పెద్దమ్మను వాకబు చేస్తున్నారు వాకిలి దగ్గర. అడిగిన వ్యక్తి వివరాలు

వాకబు చెయ్య ప్రయత్నిస్తోంది పైడమ్మ.

ఆ గొంతు ఎక్కడా విన్న గుర్తు రాలేదు రుద్రమకు. కానీ ఇదేమిటి? ఏదో మధురానుభూతి! ప్రాణం లాగుతున్నదే?

ఆమె లేచి వరండాలోకి వచ్చింది. ఎత్తుగా ఎదిగిన ఓ యువకుడు. తెల్లటి మొహంపైన ఎదుగుతున్న నల్లటి గడ్డం-మీసం, రింగులు రింగులు తిరిగిన వొత్తయిన జుట్టు గల తల! వేసుకొన్న దుస్తులు అధునాతనంవే అయినా మాసిపోయి వున్నాయి. పాదాలు బూట్లలో కూరుకుపోయి వున్నాయి.

"అమ్మా! నేను ... నేను...నన్ను క్షమించమ్మా"

ఎదిగిన ఆకారం, మొహం మీదనున్న అద్దాలు - అతనెవరో తెలుసుకోకుండా రుద్రమను ఆపలేవు. ఆ ముక్కు - ఆ నుదురు-ఆ కళ్ళు...

అతని స్పర్శ—అదేమిటి? సూదంటి రాయిలా ఆకర్షిస్తోందేం?

ఎప్పటి కొడుకు? ఎప్పటి కొచ్చాడు? ఎంతటి వాడు? ఎంత ఎదిగేడు?

ఎదిగింది ఆకారమేనా? మనసు కూడానా?

"నన్ను క్షమించవామ్మా?"

ఏ తల్లి క్షమించనంటుంది కొడుకుని? కాని ప్రశాంతమైన కొలనులో బండ రాయి అకస్మాత్తుగా పడ్డట్లు భ్రమ! అది మనసు పడుతున్న భ్రమేనా? సత్యమా?

చలం త్వరలోనే ఆ ఇంటిలో మనిషి అయ్యాడు. పైడమ్మ వృత్తాంతం, కమల కథ తెలుసుకొన్నాడు. తన కథను తల్లికి చెప్పాడు.

సరస్వతమ్మ బ్రతికివున్న కాలంలోనే చక్రవర్తి ఆమె దగ్గర వున్న కాష్‌ను, బంగారాన్ని నెమ్మదిగా తీసుకెళ్ళి కరిగించేశాడు. ఆమె చనిపోతూ మిగిలిన ఇంటిని చక్రవర్తి పేర రాయ లేదు. చలంకు పుట్టబోయే కొడుకు పేర రాసి చనిపోయింది. అంత వరకు ఇంటి మీద వచ్చే ఆదాయం చక్రవర్తి అనుభవించవచ్చు.

తల్లి విషయంలో తండ్రి కొడుకుల మధ్య తరచుగా తగాదాలు వచ్చేవి. ఒకసారి పోలీసులు పిక్‌పాకెట్ దొంగతనాన్ని చలంపై ఆరోపించారు అన్యాయంగా. అయినా చక్రవర్తి కొడుకు వత్తాసుగా రాలేదు. ఫలితంగా చలం కొన్నేళ్ళు బాల నేరస్తుల కోసం ఏర్పరచబడ్డ హోంలో వున్నాడు.

"నాన్న బాగా చెడిపోయాడమ్మా. 'హోమ్' నుంచి తిరిగి వచ్చాక నీ విషయమై మేమిద్దరం చాలాసార్లు గొడవలు పడ్డాము. ఇప్పుడు ఆయన ఆరోగ్యం బాగా చెడిపోయిందిలే. అయినా పట్టుదల వదలడే. అంచేత నేనే నిన్ను వెతుక్కొంటూ వచ్చాను"

కొడుకు మాటలు తియ్యగానే కన్పించాయి. కానీ మత్తులో పడిపోలేదు రుద్రమ. పైడమ్మతో, కమలతో కూడా అతడి ప్రవర్తనను కనిపెట్టి వుండమని చెప్పింది. సింహాద్రితో కూడా అతడి వ్యవహారం కనిపెడుతుండమని హెచ్చరించింది.

"నేనంటే నీకు నమ్మకం లేదామ్మా? కొడుకు పైన పరాయివాళ్ళను సి.ఐ.డి.లుగా వేస్తావా?"

"నాకిక్కడ పరాయివాళ్ళెవరూ లేరు చలం. పైడమ్మ, సింహాద్రి, కమల వీరిలో ఎవరు పరాయివాళ్ళంటావ్?

విశ్వాసం అన్నది ఒకరు ఇచ్చేది కాదు. సంపాదించుకోవాల్సింది"

"అలాగని కన్న కొడుకు...

"కన్న కొడుకువనే ఇన్నాళ్ళ తర్వాత వచ్చిన నీకు ఆశ్రయం ఇవ్వ లేదు చలం, ఆపదలో వున్న వ్యక్తులను ఆదుకోవటం ధర్మంకనుక! ధర్మం, నీతి తప్పనంత కాలం నువ్వు నా కొడుకువే. అవితప్పిన నాడు నీకిక్కడ స్థానం వుండదు. మాతృత్వపు మమతా బంధనా లను ఎప్పుడో తెంచివేశాను మీరు. ఈ నాడు నా ధర్మమార్గానికి అవి అడ్డుగా నిలవవు గుర్తుంచుకో"

కొన్నాళ్ళు చలం బుద్ధిగానే వున్నాడు ఆ తర్వాత చలం కమల పట్ల కొత్త చూపులు చూస్తున్నాడని గ్రహించింది.

"చలం నా కడుపున పుట్టి నువ్వు ముల్లువయ్యావు. నా దగ్గర పెరిగి కమల పువ్వులా గుబాళిస్తోంది. ఆమె నీ చెల్లెలు. గుర్తుంది కదూ?"

రెండుమూడు సార్లు ఇంట్లో విలువైన వస్తువులు మాయమయ్యాయి.

ఒకరోజు సింహాద్రి చెప్పిన సమా చారం విన్నాక తను పొరపాటు చేసే నేమోనని బాధ పడింది రుద్రమ. చలం తాగుతున్నాడు. రౌడీలతో తిరుగు తున్నాడు. జూదం...వ్యభిచారం.

"చలం నువ్విక్కడినుంచి వెళ్ళిపో"

"నేను చెడిపోయానే అనుకో. ఎందుకు నన్ను బాగుచేసే ప్రయత్నం చేయవు? కొత్త అలవాట్లు అయితేకాని పాత అల వాట్లు పూర్తిగా చావవని నీకు తెలియదా? కమలనిచ్చి పెళ్ళి చేస్తే నేనూ పాత అల వాట్లు మానుకొని గుట్టుగా పడివుంటాను"

"పెళ్ళి చేసుకోవాలనుకొంటే ఆడ పిల్లలే దొరక్కపోరు. కానీ అందుకైనా అర్హత సంపాదించుకోవాలిగా ? పెళ్ళి చేసుకొని మంచిగా మారటం కాదు. మంచిగా మారి రా. అపుడు పెళ్ళి చేస్తాను"

"పోనీ ఓ పదివేలు నా మొహాన పారెయ్. ఏదన్నా బిజినెస్సు చేసుకొని బతుకుతాను"

"అలాంటి ఆశలుపెట్టుకోవద్దు. వెళ్ళిపో.రేపే నీ ప్రయాణం. గుర్తుంచుకో"

"ఎంత కఠినురాలివయ్యావమ్మా?"

సమాధానమివ్వలేదు రుద్రమ.

'అధర్మయుతమైన అరాచకత్వం కన్నా కఠినత్వం మంచిది' అని అను కొంది మనసులో. కాలేజీకి వెళ్ళింది.

తిరిగి వచ్చేసరికి కొంచెం చీకటి పడింది. చివరి రోజుల్లో కొత్తకొత్త బాధ్యతలు. స్వీకరించటానికి వెనకాడే తత్వం కాదు. పైగా ఆరోజు ఓ పిల్ల ఆత్మహత్య చేసుకొంది. ప్రేమ, మోసం, గర్భం...మామూలు కథే!

ఇంటి లోపలికి ప్రవేశించగానే కని పించిన దృశ్యం భీతావహంగా వుంది. పెదమ్మ ముందు హాలులో స్పృహ లేకుండా పడివుంది రక్తపుమడుగులో.

లోపల కమల గదిలో కేకలు, అరుపులు, పెనుగులాట.

పరుగెత్తింది. తలుపు తెరిచింది.

చూడకూడని దృశ్యం కళ్ళబడింది.

ఆ క్షణంలో...

రుద్రమ సర్వప్రపంచాన్ని మర్చి పోయింది. భౌతిక బంధాలు, మమతలు, చట్టాలు, కోర్టులు, పోలీసు వ్యవస్థ, కష్టాలు, సుఖాలు...ఇవేమీ ఆమెకు గుర్తు లేవు. లౌకిక జగత్తుకు, ఆమెకు మధ్య ఓ దట్టమైన తెరపడింది. ఆ తెరలోగుండా

చూస్తే ఎదుటవున్న వ్యక్తులిద్దరూ కమల, చలంలాగ కనిపించటం లేదు.

పులి-తామస ప్రవృత్తికి, అహంభావానికి, దుష్టతత్వానికి చిహ్నమైన పులి.

లేడిపిల్ల-సత్య ప్రవృత్తికి, సరళత్వానికి, సున్నితత్వానికి, మంచితనానికి ప్రతీక.

ఈ రెంటికీ మధ్య పోరాటం

పులి ప్రవృత్తి మారదు. లేడిపిల్ల ప్రవృత్తి మారదు. శక్తి పెరగదు. ఎలా?

జింకపిల్ల చివరిగా ఆర్తనాదం చేసింది. పులిపిల్ల వికటాట్టహాసం చేస్తున్నది. ధర్మగ్లాని జరుగబోతున్నది.

రుద్రమూర్తి అయింది రుద్రమ. శక్తి అవతారం దాల్చింది. పది చేతులు. అయిదు తలలు. శంఖం పూదింది. శూలం గురిచేసింది.

"అమ్మా!"

పరమ కిరాతకులు, హంతకులు, స్త్రీని భోగ్యవస్తువుగా మాత్రమే పరిగణించే నీచులు కూడా చివరనచేసే ఆర్తనాదం అదే! శక్తిచేత సంహరింపబడేముందు మహిషాసురుడు కూడా అదే అరుపు అరచి వుండాలి.

నెత్తురు తాగాలనుకొన్న పులి నెత్తురు కక్కుకు చచ్చింది.

* * *

కోర్టు కిటకిటలాడిపోతున్నది.

"కొడుకును చంపిన ఆ మహాతల్లి ఇంతవరకు ఒక్క కన్నీటి బొట్టయినా కార్చలేదుటగా ?"

"ఆ రోజునుంచి ఇంతవరకూ పచ్చి మంచినీళ్ళు ముట్టలేదుట-నిద్రపోలేదుట!"

"ఆమె మహా రచయిత్రి. ఆమె నవలలు మీరు చదవలేదేమో. ఎంత బాగా రాస్తుందనుకొన్నారు ? ఆమె హంతకురాలా?"

"ఆమె మొగుడు భలే బాధలు పెట్టేవాడుట. విడాకులిచ్చేసిందిట. కొడుకూ వెధవేనట! అలాంటివాళ్ళను చంపటమే నయం."

'కొడుకును చంపిన తల్లి కేసు'గా ప్రచారమైందా కేసు.

ప్రాసిక్యూషన్ కథనాన్ని ఆమెగానీ, ఆమె ప్లీడరుకాని ఇంతవరకు కాదనలేదు. ప్రాసిక్యూటర్ అడిగిన ఒక్క ప్రశ్నకూ ఆమె సమాధానం ఇవ్వలేదు. ఆమె తరఫున డిఫెన్సు లాయర్, తన ఇష్టం వచ్చిన సమాధానాలను అనుకోమని ప్రాసిక్యూటర్‌కు చెప్పాడు. ప్రాసిక్యూటర్ ఏ కంక్లూజన్స్ లాగినా వారు అభ్యంతరాలు పెట్టలేదు. ఇక కేసేమిటి? ప్రాసిక్యూటర్ వాదించగా విన్నవారు ఆమె దోషిగా నిర్ధారణ చేసుకొన్నారు.

ఇవాళ ఆమె చెప్పేదేదో వినాలన్న కోరికతో చాలామంది కోర్టుకు వచ్చారు.

డిఫెన్సు లాయరు సింహాద్రి తన స్థానం నుంచి లేచి నిలబడ్డాడు.

"నా మిత్రుడు ప్రాసిక్యూటర్‌గారు ఈ కేసును భౌతిక దృష్ట్యా పరిశీలించారు. లౌకిక న్యాయ సూత్రాల ఆధారంతో ఆమెను దోషిగా నిరూపించటానికి ప్రయత్నించారు. అది ఆయన ఉద్యోగ ధర్మం, వృత్తి ధర్మం. నేను కాదనను. కానీ నేనా దృష్ట్యా ఈ కేసును వాదించను. నిజానికి ఆ దృష్ట్యా చూస్తే ఈ ముద్దాయి నేరస్తురాలు కాదు.

ఎందుచేతనంటే ఈ ముద్దాయి తన కొడుకును మానసికంగా హత్య చేసింది కనుక. అంటే ఆమె తన కొడుకును

క త్తితో పొడిచి చంపక పోయినా, మాన సికంగా అతడిని ఆ క్షణంలో చంపాలనే అనుకొంది. ఇది వాస్తవం. అయితే ఆమె చంపాల్సిన అవసరం లేకుండానే, తల్లి భీకరమూర్తిని చూసి భయపడిపోయి చావును తనకు తానుగా కొనితెచ్చు కొన్నాడు అతను.

స్థూలదృష్టితో కాక సూక్ష్మ దృష్టితో చూసినట్లయితే-చంపటం అన్న క్రియే కాదు చంపాలన్న కోరిక కలగటమూ నేరమేనని మా ఉద్దేశ్యం. ఇది భౌతిక దృష్టికి అందని సూక్ష్మాతి సూక్ష్మమైన ధర్మం, న్యాయం. ఆ ధర్మ దృష్ట్యా ముద్దాయి నేరస్తురాలేనని అంగీకరించక తప్పదుగా?

తన స్వంత కొడుకును చంపాలన్న కోరిక ఒక తల్లికి ఎందుకు కలిగింది? అసలెందుకు కలుగుతుంది? అంతటి నైరాశ్యాన్ని, ఆవేశాన్ని ఓ మాతృ మూర్తిలో కలిగించే పరిస్థితులు ఎలా లోకంలో చోటు చేసుకొంటున్నాయి? ఈ అంశాలని పరిశీలించాలని, ఆలోచించా లని, ఈ న్యాయ స్థానాన్నే కాదు-ఇంత కన్నా విస్తృతమైన మానవ సమాజాన్ని కోరుతున్నాను.

భౌతికంగా ఆమె తన కొడుకును చంపిందన్న నేరానికి రేపు ఆమెకు శిక్ష విధిస్తాం. వురి తీస్తాం. అది ధర్మం. న్యాయం కాదని నేననను.

అయితే ఆమె ఆ క్షణంలో అతడిని చంపకపోతే, అతడి చావుకు కారకురాలు కాకపోతే జరిగేదేమిటి? ఆలోచించారా? ధర్మాన్ని మొట్టికాయలేసి, మూతి బిగించేసి అధర్మం వికటాట్టహాసం చేసేది.

ఆ అధర్మాన్ని, అవినీతిని జరుగనిచ్చి ఆ తర్వాత అందుకు కారకులైన వారికి శిక్ష విధించి లాభమేమిటి? అధర్మానికి బలి అయిన వ్యక్తికి న్యాయం చేకూరే మార్గం అదేనా? ఆమె జీవితంలో నష్ట పోయిన దానికి పరిహారం మరో వ్యక్తిని దండించటమా? అంత కన్నా ఆ అధర్మాన్ని జరగకుండా అరికట్టటం శ్రేయస్కరం కాదూ?

అంచేత ఈ కేసును ఆ దృష్టితో చూడమని, ఈ వ్యవస్థను, ఈ వ్యవస్థ ద్వారా ఏర్పడ్డ ప్రభుత్వాన్ని, ఆ ప్రభు త్వాలచే ఏర్పాటు చేయబడ్డ న్యాయ స్థానాలని అభ్యర్థిస్తున్నాను.

ఒక స్త్రీ - ఒక మాతృమూర్తి - కొడుకును తనే చంపిందో, అతడి చావుకు తనే కారణమయిందో ఏమైతేనేం ఆ కొడుకు ధర్మభ్రష్టుడై మరణించాడు. ఆమెకు ఆవేదన వుండదా?

ఆకలితో కానివ్వండి, అధర్మాన్ని చూడలేకే కానివ్వండి. ఎవరికీ హత్యలు చేసే, ఆత్మహత్యలు చేసుకొనే అవస రాన్ని కల్పించకండి. అంతకన్నా మించి ఏ స్త్రీకి కన్నబిడ్డను, కట్టుకొన్న భర్తను చంపాలన్న ఆవేశం కలుగచేసే పరిస్థితిని రానీయకండి. ఆ స్థితికన్నా మించినది కాదు వురిశిక్ష. ఆ స్థితిలో స్త్రీ అనుభ వించే వేదన జాతి యావత్తుకూ శాపంగా పరిణమిస్తుంది. తండ్రిగా, భర్తగా, పుత్రులుగా, సోదరులుగా, తోటి మను ష్యులుగా స్త్రీ సహనాన్ని ఎన్నడూ పరీక్షకు పెట్టకండి. ప్రళయానికి కార కులు కాకండి. ఇంటింటా ఓ 'స్త్రీ పర్వం' చోటు చేసుకోనివ్వకండి. స్త్రీ కన్నీటితో తడిసిన కాలానికి ముక్తి, మోక్షం వుండవు"

ఇక మాట్లాడలేని వాడివలె అకస్మా త్తుగా మాట్లాడటం ఆపి కూర్చున్నాడు

ప్రాసిక్యూషన్ లాయరు లేచాడు. మాట్లా డటానికి కోర్టు పర్మిషన్ తీసుకొన్నాడు.

"నా మిత్రుడు, యువక లాయరు ఇది న్యాయస్థానమన్న విషయాన్ని మర్చి పోయినట్లున్నారని నా భయం. కాలేజీలో వుపన్యాస వేదికనుకొని భ్రమ పడ్డట్లు న్నారు. అయినా అతను ఏం చెప్పాలను కొన్నారో, ఏం చెప్పేరో, ఈ కేసులో ఆయనగారి వాదనేమిటో నా కొక్క ముక్కా అర్థం కాలేదు. కోర్టువారికి అర్థ మయిందో లేదో నాకు తెలియదు. ఆయన వాదనకు కంక్లూజన్ ఏమిటో తెల్సుకో గోరుతున్నాను"

సింహాద్రి తిరిగి లేచాడు. రుద్రమ దేవివైపు ఓ క్షణం చూచాడు.

రుద్రమ మెల్లగా లేచినిలబడింది. కనులు అర్ధనిమీలితములై వున్నాయి. మెల్లగా గొంతు విప్పింది.

"ఇది నా కథ. నా ఒక్కదాని సమస్య. నా బాధ. నా వేదన.నా ఆనందం. నా తృప్తి. అయినా నా వేదనను, తృప్తిని, సమస్యను తనదిగా భావించాడు ఇంత సేపు నా తరపున మాట్లాడిన చిరంజీవి. నా బాధను లోకపు బాధగా మార్చాలని ప్రయత్నం చేసేడు.

అయితే ఇవాళ యీ రుద్రమదేవి కథ రేపు వందలమంది రుద్రమల కథగా మారకూడదు. ఈ నా కథలో నా వ్యక్తి గత బలహీనతలు, పొరపాట్లు, లోటు పాట్లు వుండవచ్చు. అవి పరిహరించినా, నా కథ ఇలాగే వుండేదేమో! నా కథలో మంచిని స్వీకరించండి. దోషాల్ని పరిహ రించండి.

ఇన్నేళ్ళ జీవితాన్ని ఒక్కసారి వెనక్కి తిరిగి చూసుకొంటే మంచితనం, సహనం, ఓర్పు ఇత్యాది గుణాలు కలిగి వుండటమే నేరమా అనిపిస్తోంది. ఈ భావన ఏ మనిషికీ కలగకూడదని కోరుకొంటున్నాను.

నేను చంపాలనుకొన్నాను. కాని నా కొడుకును కాదు. నా కొడుకులోని దాన వుడిని. నా కొడుకులో మూర్తీభవించిన పాపపు ఆలోచనలను,వాడిలో అంతర్గంగా వున్న నా భర్త భ్రష్ట రూపాన్ని.

అదైనా ఎందుకనుకొన్నారు. నాలాగా ఏ స్త్రీ విధివంచితకాకూడదన్న కోరికతో! నేననుభవించిన నరకాన్ని మరొక స్త్రీ అనుభవించ కూడదన్న తపనతో. నా భర్త నా కొడుక్కి నా ద్వారా ప్రాణ ప్రతిష్ట చేశాడు. నా కొడుకు, మరో అలాంటి కొడుకుకు, ఇంకో నాలాంటి స్త్రీ ద్వారా ప్రాణప్రతిష్ట చేయబోవ టాన్ని చూసి సహించలేక!

కానీ మీలో కొందరికి కూతురుగా, సోదరిగా, మరికొందరికి తల్లిగా నేను చేసే అభ్యర్థన ఒక్కటే. స్త్రీని మనిషిగా గుర్తించండి. ఆమె ఆత్మాభిమానాన్ని అడుగడుగునా హత్య చేయకండి.

నన్ను ఉరి తియ్యండి. కానీ మంచి తనాన్ని, ఉన్నత విలువల్ని, నైతిక ధర్మాన్ని మాత్రం ఉరితియ్యకండి. ఇదే నా కడపటి కోరిక."

అది ఆవేశమో, ఆవేదనో, ఆనందమో తెలియదు. చివరి మాటలతోపాటు రుద్రమ దేవి కూడా అకస్మాత్తుగా బోనులో కూలబడి పోయింది.

ప్రేక్షకులలో సంచలనం. ప్లీడర్లు మొహమొహాలు చూసుకొన్నారు.

మూర్ఛపోయిందా! లేక గుండె ఆగి పోయిందా?



# సొంత సొమ్ము

"రేపు ఉదయం బొంబాయి వెళ్ళాలి. ప్లేన్ టికెట్స్ రిజర్వ్ చేయించమన్నాను చేశారా ?" అడిగాడు మేనేజర్ గుర్నాధం.

"యస్ సర్ !"

"నేను మళ్ళీ పది రోజుల తర్వాత వస్తాను. ఆఫీసులో విషయాలన్నీ జాగ్రత్తగా చూసుకోండి. ఏవైనా అర్జంట్ మేటర్స్ ఉంటే 'టెలెక్స్' చేయండి"

తలూపాడు నంబియార్.

"ఇక మీరు వెళ్ళవచ్చు."

బ్రతుకు జీవుడా అనుకుంటూ తన



సీటు వైపు నడిచాడు.

'ఈ మేనేజర్‌గారు ఎప్పుడూ ఇంతే! చివరి క్షణంలో తన ప్రయాణానికి కావల్సిన ఏర్పాట్లు వెంటనే జరిగిపోవాల్సిందే అంటాడు' తనలో తను గొణుక్కున్నాడు.

గుర్నాధం చాలా సంపాయించాడు. పట్టుమని పదిరోజులు ఉండడు ఆఫీసులో ఏదో 'టూర్' అంటాడు. ఇరవై రోజుల తర్వాత వస్తాడు. గవర్నమెంటు కంపెనీ కావటం వల్ల, అతను 'టూర్'లో ఉన్నన్ని రోజులూ ఖర్చులన్నీ కంపెనీవే.

అతని హోదాకి తగ్గట్లుగానే తప్పనిసరిగా ప్లేన్‌లోనే ప్రయాణం చేస్తాడు. ట్రెయిన్‌లో ప్రయాణం అంటే మండిపడతాడు.

గుర్నాధం తన కూతురి పెళ్ళి- ఇలా టూర్ మీద వెళ్ళి, మిగిల్చిన డబ్బుతోనే చేశాడంటారు లోకులు.

బొంబాయి నుండి వచ్చిన మర్నాడు గుర్నాధం నంబియార్‌ని పిలిపించాడు.

"రేపు సాయంత్రం మద్రాసు ఎక్స్‌ప్రెస్‌కి రెండు టికెట్లు రిజర్వ్ చేయించు ఫర్ మి అండ్ మై మిసెస్."

నంబియార్ ఆశ్చర్యంతో నోరు తెరిచాడు.

'తన హోదాకి తగ్గట్లుగా ఎప్పుడూ ప్లేన్‌లో ప్రయాణం చేసే మేనేజర్‌గారు, రైలు ప్రయాణం అంటే మండిపడే మేనేజర్‌గారికి మతి పోలేదు కదా?' అని.

"యస్ సర్! ఫస్ట్‌క్లాసా-?"

విషపు పురుగుని చూసినట్లు చూశాడు గుర్నాధం. "నంబియార్! నీది ఒట్టి మట్టి బుర్రోయ్. ఫస్ట్‌క్లాసు కాదు. సెకండ్ క్లాసు—స్లీపర్ కోచ్‌లో రిజర్వ్ చేయించు."

ఇంకా ఆశ్చర్యంతో నంబియార్ నోరు పెద్దదైంది. గమనించాడు గుర్నాధం.

"నేను వెళ్ళేది 'టూర్'కి కాదు. మా చుట్టాలింట్లో పెళ్ళికి. స్వంత ఖర్చుతో వెళ్తున్నానన్లే" అన్నాడు తాపీగా.

—వి. లక్ష్మీదేవి

# నిషా

బాగా మందు బిగించే సుబ్బారావు అసలు అలవాటేలేని రామారావుని తనతోపాటు బార్‌కి తీసికెళ్ళాడు. కనీసం బీరు సేవించమని మొహమాట పెట్టేసి బీరుకి ఆర్డరిచ్చాడు. వెయిటర్ బీరు సీసాలు తెచ్చి టేబుల్ మీద వుంచాడు.

మందు ప్రారంభించే ముందు సుబ్బారావు రామారావు భుజం తట్టి "చూడరా! నీ కిదే మొదటిసారి కాబట్టి కాస లిమిటెడ్‌గా పుచ్చుకో... సరిపోయినంత పుచ్చుకోగానే తాగటం మానేయ్!" అని జాగ్రత్తలు చెప్పాడు.

"సరిపోయిందని ఎలా తెలుస్తుంది!" అమాయకంగా ప్రశ్నించాడు రామారావు.

"అదుగో ఆ మూల టేబుల్ దగ్గర ఇద్దరు వ్యక్తులు కూర్చుని వున్నారు చూశావా?... వాళ్ళిద్దరూ నీకు నలుగురిగా కనిపించారనుకో...అప్పుడు బాగా నిషా ఎక్కిందని తెలుసుకుని ఇహ తాగటం మానేయాలన్నమాట !" అని ధర్మ సూక్ష్మాన్ని వివరించాడు సుబ్బారావు.

"ఓకే" అన్నాడు రామారావు

ఇద్దరూ బీరు బిగించడం మొదలెట్టారు. అరగంటయింది. గంటయింది. గంటన్నర. రెండు – మూడు–నాలుగు గంటలయింది. రామారావు కళ్ళు నులుము కుని మూలకి చూశాడు అనుమానంగా

"అర్రర్రే..." అనరిచాడు.

"య్యేమిటి?" అన్నాడు సుబ్బారావు.

"ఆ మూలకూర్చున్న వాళ్ళు నాకూ..."

"ఆఁ... ఆఁ... నలుగురిగా కనిపిస్తున్నారా...అయితే ఇహ తాగటం ఆపేయ్!" అన్నాడు సుబ్బారావు.

"అబ్బే... నలుగురిగా కాదు... ఆ ఇద్దరూ ఒక్కడిగానే కనిపిస్తున్నారు. నాకిప్పుడు మందు ఎక్కువైనట్టా? తక్కువైనట్టా?" అడిగాడు రామారావు.

సుబ్బారావు కళ్ళు చిట్లించి మూల నున్న టేబుల్ కేసి చూసి ఫకాల్న నవ్వాడు.

"నీకు నిషా నషాళం వరకు ఎక్కిందోయ్...లేకపోతే అక్కడ ఒక్కడే కనపడ్డం ఏమిటి? మొత్తం ఎనిమిది మంది వున్నారు. బాగా చూడు!" అన్నాడు. విరగబడినవ్వుతూ.



రామారావు అయోమయంగా చూస్తూన్నంతలో వెయిటర్ వాళ్ళ దగ్గరకొచ్చి "సార్! చాలా టైమయింది. అందరూ వెళ్ళిపోయారు. ఇక మీరిద్దరే మిగిలారు. మీరూ లేస్తారా?" అన్నాడు బిల్లున్న ప్లేటుని వాళ్ళముందుకి తోస్తూ.

–సి. వి. లత

# షేక్ ట్రీట్‌మెంట్

డాక్టర్ ధనుంజయ ఎలాంటి వ్యాధినైనా ఇట్టే క్షణాలలో నయం చేయగలడని ఊళ్ళో మంచి పేరుంది. ఎప్పుడే రోగం వచ్చినా మా కుటుంబమంతా ఆయన దగ్గరికే పరుగెత్తటం ఆనవాయితీ! వంట్లో కాస్త నలతగా, తలనొప్పిగా, జలుబుగా వుండటంతో ఆవేళ డాక్టర్ ధనుంజయ దగ్గరికి బైలుదేరాను.

నేను ఆస్పత్రికి చేరుకునేసరికి పదిమంది దాకా 'విజిటర్స్ రూమ్'లో కూర్చుని వున్నారు. నెంబరు తీసుకుని నేను కూడా కూర్చున్నాను. దాదాపు అరగంట తర్వాత




మేల్ నర్స్ నా నెంబరు పిల్చాడు.

వెంటనే లేచి నిలబడ్డాను. అంతసేపు కదలకుండా కూర్చోవటంవల్లనుకుంటాను కుడికాలు బాగా తిమ్మిరెక్కింది. నడవడానికే ఇబ్బందిగా వున్నా అలాగే కన్సల్టింగ్ రూంలోకి వెళ్ళాను, కొద్దిగా కుంటుతూ.

నాలుగయిదు నిమిషాల తర్వాత ప్రిస్క్రిప్షన్‌తో బయటికి వచ్చాను. కాలి తిమ్మిరి పోవడంవల్ల బయటికి వచ్చేటప్పుడు సాఫీగా నడవగలిగాను.

విజిటింగ్ రూంలో కూర్చున్న ఒకాయన తన పక్కవాళ్ళతో అన్న మాటలు నా చెవిని పడ్డాయి.

"నే చెప్పలా ఈ డాక్టర్ నిమిషాల్లో రోగాన్ని నయం చేస్తాడని"

—మల్లాది వెంకటకృష్ణమూర్తి

# గడ్డం

ఉన్నట్టుండి రామజోగేశ్వరరావు గడ్డం గీయడం మానేశాడు. రామజోగేశ్వరరావు బార్బరు షాపులో పని చెయ్యడు. అతను గీయడం మానేసింది పరాయివాళ్ల గడ్డం కాదు – అతని గడ్డమే. 'నీ పోతు గడ్డం, ఛీఛీ నా కడ్డం' అని వాళ్ల ఆవిడ అందో లేదో మనకి తెలీదు.

"గడ్డం ఎందుకు పెంచుతున్నావ్ ?" అడిగారు మిత్రులు.

"ఒంట్లో బాగోలేదా ?" పరామర్శించారు కొందరు పరిచయస్తులు. "మొక్కా?" అన్నారు మొహమాటస్తులు.

అదేమీ కాదన్నాడు రామజోగేశ్వరరావు. అసలు కారణం ఏమిటన్నారు స్నేహితులు. గడ్డం పెంచడానికి కారణం వుండాలేమిటని వాళ్ల మాటను కొట్టి పారేశాడు. అడిగి అడిగి, ఆపైన అడగడం మానేశారు వాళ్ళు.

గడ్డం పెరుగుతూనే వుంది. రామజోగేశ్వరరావు గడ్డం మొహం జనానికి

అలవాటయింది. 'గడ్డం బాగుంది' అనే అభినందనలు కూడా రామ జోగేశ్వర రావు అందుకున్నాడు.

అయితే ఒక రోజున గడ్డాన్ని విసర్జించి, మామూలు మనిషైపోయాడు రామ జోగేశ్వరరావు. 'ఫోన్లే ఏదో గడ్డం పెంచాడు' అని సరిపెట్టుకున్న అతని మిత్ర బృందం-హఠాత్తుగా గడ్డం తీసేసినందుకు మాత్రం కారణం చెప్పందే వదలమన్నారు. అతన్ని మరీ మరీ బలవంతం చేశారు.

"ఏమీలేదురా! డబ్బున్న వాళ్లు కుక్కల్ని, పిల్లుల్ని పెంచుకుంటారు. నాకంత స్తోమత లేదు కదా! అంచేత గడ్డం పెంచాను. కానీ నిన్న మా



యింటికి చుట్టాలొచ్చారు. అందులో ఒకావిడ- 'నీ దవడమీద ఏవో మచ్చలు లేచాయట పాపం! అందుకేనా ఇంత గడ్డం పెంచావు' అని నన్నడిగింది" అంటూ అసలు సంగతి వివరించాడు రామ జోగేశ్వరరావు.

-సంగీతరావు

# మతిమరుపు

మతిమరుపు మహాసభలు జోరుగా సాగుతున్నాయి. మతిమరుపు మీద ఉపన్యాసం దంచటానికి దేశం నలుమూలల నుండి ఎందరో మతిమరుపు మహాశయులు విచ్చేశారు.

అధ్యక్షుడు మతిమరుపు మహాసభలు జరిపించటంలో గల ఉద్దేశాన్ని, ఆవశ్యకతని, ఔన్నత్యాన్ని వివరించి ఒక్కొక్కరినీ ఉపన్యసించవలసిందిగా కోరాడు.

మొదటాయన 'మతిమరుపు - పుట్టు పూర్వోత్తరాలు' అంశంపై అరగంట సేపు అనర్గళంగా ఉపన్యసించి, చెంబెడు మంచి నీళ్ళు తాగి కూర్చున్నాడు.

రెండో పెద్దమనిషి మతిమరుపు వల్ల లాభనష్టాలు' విషయాన్ని, విడదీసి, సాగదీసి, సభికులను విసిగించి, ఇక చాలు బాబో! అని చప్పట్లు కొట్టేవరకూ ఉపన్యసించి మరీ కూర్చున్నాడు.

మూడో ఆయన 'ఎందరో మతిమరుపు మహానుభావులు-అందరి చిరునామాలు' అనే అంశంపై ప్రపంచంలో పేరెన్నిక గన్న ప్రముఖ మతిమరుపు మహాశయులు, వారి వారి ప్రత్యేకతలూ వివరిస్తూ వారి జాబితాను చదివి మైకు నాణ్యతను పరీక్షించాడు.

ఇలా ఎందరో ఉపన్యాసకులు ఎన్నో విధాల వి సి గిం చ గా, విసిగించగా... ఓపిగ్గా కూర్చొని విన్న సభికులకు కృతజ్ఞత తెలుపవలసిన కనీస బాధ్యత ఉండటం వల్ల, అధ్యక్షుడు లేచి "ఇప్పుడు



మాధవరావుగారు వందన సమర్పణ చేసారు. అయ్యా! మాధవరావు దయచేసి స్టేజీమీదకి రావాలి" అని కూర్చున్నాడు.

మాధవరావుగారు రాలేదు.

అధ్యక్షుడు మళ్ళీ లేచి "అయ్యా! మాధవరావుగారూ త్వరగా రావాలి ఇప్పటికే కాలాతీతమయింది" అన్నాడు.

అయినా మాధవరావ్ రాలేదు.

మాధవరావుగారూ! ... మాధవరావు గారో!! ... మాధవరావుగారోయ్ !!!!" అంటూ మైకు బద్దలయ్యేలా అరవసాగేడు.

అంతలో సభికుల్లోంచి ఒకరులేచి, "అయ్యా! మాధవరావుగారు తమరే కదండీ!" అన్నారు అధ్యక్షుణ్ణి ఉద్దేశించి.

"అవునండోయ్!...నా మతిమండ!".

అని బుర్ర గోక్కున్నాడు సభాధ్యక్షుడైన మతిమరుపు మాధవరావు.

—బొనిగల ముకుందరావు

# ఆట

అప్పారావుకి వయసు ఇరవై ఏళ్ళయినా వయసుని మించి శరీరం విపరీతంగా పెరిగిపోతోంది. అయితే, శరీరంతో తెలివితేటలు ఏ మాత్రమూ పోటీ పడలేక స్థిరంగా నిలిచిపోయాయి. ఇక లాభం లేదనుకుని అప్పారావు ఓ రోజున డాక్టర్ దగ్గరికెళ్ళి సన్నపడేందుకు చిట్కా ఏదైనా చెప్పమని అడిగాడు.

"నీ వయసు ఏమంత ఎక్కువ కాదు. రోజూ బాగా అలసిపోయేలా కొంతసేపు ఆడుతూ వుండు. శరీరం అదే తగ్గుతుంది." అని డాక్టర్ 'ఉచిత' సలహా

నెలరోజులు గడిచాక అప్పారావు తిరిగి డాక్టర్ దగ్గరకి వచ్చాడు. అప్పారావుని చూసి డాక్టర్ ఆశ్చర్యపోయాడు! అప్పారావు సన్నపడకపోగా మరింత లావయ్యాడు! తన సలహా బెడిసికొట్టినందుకు సిగ్గు పడ్డాడు డాక్టర్.

"మీరు చెప్పినట్లే ప్రతి రోజూ అలసిపోయేంతవరకు ఆడు కుంటున్నానండీ" అన్నాడు అప్పారావు,

"అలాగా, అయితే ఎందుకు అలా వున్నావు" అని ఆగి "ఇంతకీ ఏం ఆటలు ఆడుతున్నావు" అడిగాడు డాక్టర్.

"కారమ్స్, చెస్ అలసిపోయేవరకూ ఆడుతూనే ఉన్నానండీ! అయినా ఒళ్ళు పెరిగిపోతూనే ఉంది" అని బదులు చెప్పాడు అప్పారావు!

—తాజీ ప్రసాద్

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.